# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

## 1 వ భాగం

సీతారామారావు జీవితం విచిత్రమైంది. ఉన్నత శిఖరాగ్రం నుంచి స్వచ్ఛమైన జలంతో భూమి మీద పడి మలినాన్ని కలుపుకొని, మురికి కూపంలోకి ప్రవహించే సెలయేటిని జ్ఞప్తికి తెస్తుంది. తనలో వచ్చిన మార్పు ఆ సెలయేటికి తెలుసో తెలియదో మనకు తెలియదు. ఒక వేళ తెలిస్తే, తనలో వచ్చిన మార్పుకి ఆ సెలయేరు బాధపడుతూ వుందో అదీ మనకు తెలియదు.

చేసే వాళ్ళు మాత్రం దాని పతనానికి జాలిపడుతూ వుంటారు. దానికి ఆ జ్ఞానం వుందో లేదో మాత్రం ఎవ్వరూ చెప్పలేరు. పైగా పర్వతాల్లో ప్రవహిస్తూ వున్నప్పుడున్న వడిదుడుకుల్లేవు అని సంతోషిస్తూ వుందేమో అనిపిస్తుంది అప్పుడప్పుడు.

సీతారామారావు తండ్రి, చావు మంచం మీద వుండి "బాబూ! మన వంశం పేరు నిలబెట్టు. అంత కంటే నే చెప్పేది ఏమీ లేదు" అని సలహా చెప్పాడు. అనే అతని ఆఖరు మాటలు.

ఆ మాటలు విని చుట్టూ వున్న వాళ్ళంతా ఆశ్చర్యపోయారు "ఆస్థి సంగతి చెప్పలేదు, ఇంకేమీ చెప్పలేదు, వంశం పేరు నిలబెట్టమన్నాడు. చూశారా, ఆయన గొప్పతనం!" అని పొగిడారు.

"ఆ గొప్పతనం వాళ్ళ వంశంలోనే వుంది" అన్నారు అంతా.

నిజంగా వాళ్ళ వంశం గొప్పదే. వాళ్ళ ముత్తాత తాత ఆ వూరికి చెరువు త్రవ్వించాడు. సత్రం కట్టించాడు. వాళ్ళ తాత నల్లగా వీరభద్రుడికి మల్లే వుండే వాడు. కర్ర చేత్తో పట్టుకుని బజార్న నడుస్తుంటే ఎవ్వరికయినా కూర్చునే ప్రాప్తం ఉండేదా? ఆడవాళ్ళు తుర్రున ఇళ్ళలోకి పరుగెత్తే వాళ్ళు. ఆయన పేరు చెపితే చాలు. పిల్లలు హడలుకొని మారాం కట్టిపెట్టి కుక్కిన పేలయ్యే వాళ్ళు.

ఆ ఊళ్ళో దేవాలయం కట్టించింది ఆయనే. ఇప్పటికీ దేవుడి పెళ్ళికి పీటల మీద కూర్చునే హక్కు వాళ్ళదే. ఈ హక్కు అతని తండ్రి ముప్ఫయి వేలు ఖర్చు పెట్టి, హైకోర్టు దాకా వెళ్ళి నిలబెట్టుకున్నాడు.

ప్రతి యేటా దేవుని ఉత్సవం తన సొంత ఖర్చుతోనే చేయించేవాడు. అడిగిన వాళ్ళకు లేదనకుండా దానం చేసే వాడు. ఆ వూరి గుండా ఏ పెళ్ళి వాళ్ళు వెళ్ళడం తటస్థించినా సరే - ఒక పూట వాళ్ళ ఇంట్లో బస చేసి, ఆయన చేసే సత్కారాలు అందుకొని, విందారగించి వెళ్ళవలసిందే.

వాళ్ళ కమతంలోకి రావాలని ఊళ్ళో మాల మాదిగలంతా ఉవ్విళ్ళూరుతూ వుండే వారు. అజమాయిషీ లేకపోవటం వల్ల కాజెయ్యటానికి వీలవుతుందని వాళ్ళ తాపత్రయం అని గిట్టని వాళ్ళు అనే మాట నిజమే గాని, ఆ కుటుంబంలో పుట్టిన వాళ్ళెవ్వరూ ఆ మాట నమ్మరు.

సీతారామారావు చిన్నతనం నుంచీ తన కుటుంబాన్ని గురించి అనేకులు గొప్పగా చెప్పుకోవటం వింటూ ఉండే వాడు. కొంత మంది అతని ముఖం ఎదుటనే కీర్తిస్తూ వుండే

వాళ్ళు. ఇక తన బంధువుల సంగతి చెప్పనవసరం లేదు. తమ ఇళ్ళల్లో జరిగిన కార్యం కరామత్తుల వైభవం దగ్గర్నుంచి, తమ తాత ముత్తాతల శౌర్యం వరకూ వర్ణించి చెబుతుండే వారు. అప్పుడతనికి రూఢీ అయింది. "డబ్బుదేముంది?" మనిషికి కావలసింది పేరు" అని.

అతని వంశాన్ని పొగిడే వాళ్ళంతా ఈ విషయం ఏకగ్రీవంగా ఒప్పుకున్నారు "డబ్బు మనల్ని సంపాయించిందా? మనం డబ్బును సంపాయించామా?" అనే వాళ్ళు.

"డబ్బు సంపాయించిన వాళ్ళు చాలా మంది ఉన్నారు. వాళ్ళందర్నీ మీ తాత ముత్తాతల్ని చెప్పుకున్నట్లు చెప్పుకుంటున్నారా?" అని ప్రశ్నించే వాళ్ళు.

అతనికి ఈ ప్రశ్నలు చాలా గొప్పగా కనిపించేవి. అతనిలో ప్రవహించేది ఆ వంశంలోని రక్తమే. ఈ విషయం తన తండ్రి కర్మకి పదివేలు ఖర్చుపెట్టి అతను నిరూపించుకున్నాడు.

"తండ్రికి మించిన చెయ్యి" అన్నారు అంతా.

"ఎముకలేని చెయ్యి" అన్నాడు ఒక కవి.

పది రోజులు నిరతాన్నదానం చేశాడు. వచ్చిన చుట్టాలెవరూ నెల రోజులు పూర్తికాకుండా వెళ్ళిన వాళ్ళు లేరు. అందర్నీ తృప్తిపరచి పంపాడు. ఆ పది రోజులూ చుట్టు ప్రక్కల గ్రామాల్లో వున్న బీదసాదలకు అన్నదానం చేశాడు. బట్టలు పంచి పెట్టాడు. వాటి మీద ఫలానా వారి ధర్మం అని వేయించాడు. ఆ రోజుల్లో అతని పేరు చెప్పుకోలేని వాళ్ళు లేరు. "చెప్పుకుంటే ఆయన్నే చెప్పుకోవాలా" అనుకునే వాళ్ళు.

"మా రాజు!" అనే వాళ్ళు.

తండ్రి గతించిన తర్వాత అప్పులు ఇవ్వవలసిన వాళ్ళ విషయంలో కూడా అతను చాలా ఉదారంగా ప్రవర్తించాడు. తమ కష్టసుఖాలు వచ్చి చెప్పుకోని వాళ్ళది పాపం. ఇచ్చిన వాళ్ళ దగ్గర ఇచ్చినట్లు పుచ్చుకున్నాడు. అతను ఒకటే మాట చెప్పాడు...... "నేను కోర్టుకి ఎక్కను."

అతని మేనమామ అతనికి నలభై వేలివ్వాలి. అది కూడా అతడు పరిష్కారం చేసుకున్నాడు. ఒక రోజు మేనమామ వచ్చి తన వూరు తీసికెళ్ళాడు! తన ఇంటికి తీసుకొని వెళ్ళి ఎన్నో మర్యాదలు చేశాడు. అత్త కూడా "రాక రాక వచ్చావు. నువ్వు వస్తే చూడు బాబూ, మా ఇల్లు కళకళలాడుతున్నది" అన్నది.

తాను వచ్చినందుకు వాళ్ళు పడిన సంతోషం, వాళ్ళు చేసిన మర్యాదలూ చూస్తే అతనికి అమితానందం కలిగింది. నాలుగో రోజు మేనమామ తన కుటుంబ పరిస్థితులు చెప్పుకుంటూ "బాబూ నేనంత డబ్బు ఇచ్చుకోలేను. పిల్లలు కలవాణ్ని పది ఎకరాల మాగాణి - నిక్షేపం లాంటిది రాసిస్తాను. నా కాపరం నిలబెట్టు. నీకీ డబ్బు ఒక లెక్కలోనిది కాదు. చదువుకున్న వాడివి, సమర్థుడివి. రేపటి నుంచి ఎంత సంపాదించాలంటే అంత సంపాదించు కోగలవు" అన్నాడు.

"సంపాదించుకోకపోతే మాత్రం నీకు సహాయం చేయకూడదా మామా?" అన్నాడతను. సంపాదించే అవకాశం వుంది కనుక ఇతర్లకు సహాయం చేస్తున్నాడను కోవటం అతనికి బొత్తిగా

బాగా లేదు సూర్యుని తేజస్సుకు మల్లే, రత్నాల కాంతికి మల్లే దాతృత్వం అతని స్వభావం.

"ఎందుకు చెయ్యకూడదు బాబూ! మేమేం పరాయి వాళ్ళమా?" అంది అత్త.

"పరాయి వాళ్ళకు మాత్రం సహాయం చెయ్య కూడదా అత్తా?"

"అది వేరు" అంది అత్త. కాని తర్వాత ఏమనాలో ఆమెకి తోచలేదు.

"నాయనా! మీ బాబు వచ్చి ఏ స్వర్గాన వున్నాడో వొక్కనాడైనా బాకీ సంగతి ఎత్తే వాడు కాదు" అన్నాడు మామ. అతడు అప్పటికప్పుడే పది ఎకరాలిస్తానని మాట జారినందుకు పశ్చాత్తాపపడటం మొదలు పెట్టాడు.

"నేను మాత్రం మీ మాట కాదన్నానా?"

"అద్గదీ! నేను చెప్పలా? వాడి గుణమే వేరు" అంద అత్త ఇంత ముఖం చేసుకొని, ఆమెకు నలభై వేల అప్పు పది ఎకరాలతో పోవటమే పట్టరాని సంతోషాన్ని కలిగించింది. భర్తకు మాత్రం ఆమె మీద కోపం వచ్చింది.

"నాయనా, మీ నాన్నా నేను ఎలా ఉండే వాళ్ళమో నీకు తెలుసుగా? ఇంటి పనులు ఆయన వక్కటి కూడా పట్టించుకునే వాడు కాదు. పొలం ఖాతా అంతా నేనే చూసుకునే వాణ్ణి. ఏది ఎంత వచ్చిందని కూడా అడిగేవాడా? మహారాజు మంచి అనిపించుకొని వెళ్ళిపోయాడు........ నీకు జ్ఞాపకముందో లేదో గాన నిన్ను నా చేతులతో ఎత్తి పెంచాను బాబూ" అన్నాడు.

"లేకేం మామా?" అన్నాడు సీతారామారావు. అతనికి నిజంగా జ్ఞాపకం లేదు. పెంచే వుంటాడని నమ్మకం అబద్ధమాటవలసిన అవసరమేమొచ్చింది తన మామకి.

"నా స్వంత తమ్ముడితోనే అనుకున్నా బాబూ! ఒక రోజు అరుగు మీద ఆడిస్తూంటే కింద పడ్డావు. ఎక్కడ దెబ్బ తగిలిందో అని నా ప్రాణాలు పైనే యెగిరి పొయినయ్యంటే నమ్ము, అప్పుడెట్లా వుండే వాడివి దొరల్లే నిగనిగలాడుతుండే వాడివి" అంది అత్త.

వాళ్ళ మంచితనం అతనికి ద్రిగ్భమ కలిగించింది. ఇంత మంచి వాళ్ళకీ తన తండ్రికి చివరి రోజుల్లో ఎందుకు వైరం

వచ్చిందాని ఆలోచించాడు. తన ఆస్తిపై పెత్తనం చేస్తూ చాటుగా చాలా డబ్బు తిన్నాడని వూళ్ళో వాళ్ళు అనుకుంటూ వుంటారు.

కాని ఇంత మంచి వాడు అటు వంటి పని చేస్తాడా? డబ్బు తింటే ఇంత అప్పు ఎందుకవుతుంది? గిట్టని వాళ్ళనే మాటలివి. తన తండ్రికి చెప్పుడు మాటలు వినే స్వభావం వుంది. ఎవ్వరో లేనిపోని మాటలు చెప్పితన తండ్రికి మేనమామకి తగాదా పెట్టి వుంటారు.

అతనిలా ఆలోచిస్తూ వుంటే మేనమామకి అనుమానం వేసింది. అన్నమాట ఎక్కడ జారతాడోనని, అందుకని వెంటనే "సరే బాబూ నీ యిష్టమొచ్చినట్లే చెయ్. అన్నీ తెలిసిన వాడివి. నీకు నే చెప్పేదేముంది?.... మరి యివ్వాళే రాతకోతలు పూర్తి చేసుకుందామా?" అని అడిగాడు.

సీతారామారావు తనకు రావలసిన నలభై వేలకు గాను పది ఎకరాలు రాయించు కొని

పరిష్కారం చేసుకొన్నాడు. అత్తా మేనమామలు అతన్నీ దీవించి పంపారు. ఊళ్ళో వాళ్ళంతా వూరు బయటికి సాగనంపి సెలవు తీసుకొన్నారు.

ఆ రోజుల్లో నౌకరికి సహాయం చెయ్యడమంటే పరమానందంగా వుండేది. ప్రతి వాళ్ళూ అతన్ని గౌరవిస్తూ వుండే వాళ్ళు. ఇంత కంటే ఏం కావాలి? బ్రతికిన నాలుగు రోజులూ యిలా బ్రతికితే చాలదూ? పది మందితో మంచనిపించుకొని పొమ్మన్నారు పెద్దలు.

"ఇంత చిన్నతనంలో యింత బుద్ధి వుండటం యెక్కడా చూడలేదు." అన్నారు అంతా.

"అది వాళ్ళ వంశంలోనే వుంది" అని వాళ్ళల్లో వాళ్ళే జవాబు చెప్పుకున్నారు.

తండ్రి కోర్కె నెరవేర్చాననే ఆనందం, వంశం పేరు నిలబెట్టాననే గర్వం అతనికుండేది ఆ రోజుల్లో.

ఆ వూళ్ళోనే రామయ్య అనే వృద్ధుడొకడుండే వాడు. అతన్ని అంతా 'తాతా' అని పిలుస్తుండే వాళ్ళు! అతనికి సీతారామారావు కుటుంబమంటే తగని అభిమానం.

"బాబూ! కుర్రవాడివి, ప్రపంచానుభవం తక్కువ. కొంచెం తెలిసి మెలగాలి" అని సలహా చెబుతుండే వాడు.

"నేను తెలిసే చేస్తున్నా తాతా?" అనే వాడు సీతారామారావు.

"చేతుల్లో నాలుగు రాళ్ళుంటే అంతా మూగుతారు. తరువాత మన మొగం చూచే వాళ్ళుండరు బాబూ!"

"మళ్ళీ మొఖం చూస్తారనే ఆపేక్షతో నేనీ పన్లు చెయ్యటం లేదు తాతా! చెయ్యడం కోసమే చేస్తున్నాను."

"పశ్చాత్తాప పడవలసిన పనులేవీ చెయ్యకు బాబూ?" పశ్చాత్తాప పడవలసివొస్తే - హృదయంలో తేళ్ళూ, జెర్రులూ నివాసం ఏర్పరచుకుంటాయి. నువ్విప్పుడు మంచి పనులనుకునే వన్నీ ఎదురు తిరుగుతై. ఇప్పుడు నీ వల్ల సహాయం పొందే వాళ్ళనే విరోధం చేసుకుంటావు. నీ నుంచే నీ పతనానిక కారణమవుతుంది.

"నేను ప్రతిఫలం కోరలేదు తాతా!"

"అది ఒక్కటే చాలదు బాబూ?" అనే వాడు రామయ్య తాత.

-2-

అతడు చిన్నతనంలో చాలా ఉన్నతమైన ఆశయాలు కలిగి వుండే వాడు. ఆదర్శ వంతమైన జీవితం గడపాలని ఉవ్విళ్ళూరుతుండే వాడు. నిత్యం ప్రయత్నిస్తూ వుండే వాడు. భావనలో, పలుకులో, ప్రవర్తనలో ఆ అభిలాష వ్య క్తమవుతూ వుండేది.

మిగిలిన వాళ్ళంతా నిత్య జీవితంలోని చిల్లర విషయాల్లో మునిగి తేలుతూ వుంటే అతను వాటికి అతీతంగా వుండి ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూ వుండే వాడు.

తన చుట్టూ జరుగుతున్న కుటుంబ జీవితం అతని మనస్సుని ఎక్కువ కష్టపెట్టేది. పెళ్ళి చేసుకోవటం, పిల్లల్ని కనడం, ఆరోగ్యం చెడగొట్టుకుని యీసురోమని తిరగటం, పిల్లలకోసం

నీచంగా తాపత్రయం పట్టం అతని మెత్తని హృదయానికి గంట్లు పెట్టేవి. కొంత మంది ఆడవాళ్ళు గర్భిణితో తిరగటం, నీళ్ళాడేటప్పుడు వాళ్ళు పడే బాధ, పిల్లలకు వాళ్ళు చేసే సపర్యలు చూస్తే అతనికి పరమ అసహ్యంగా వుండేది.

ఎంత ఆలోచించినా మనుష్యులు ఏ సుఖం కోరి పెళ్ళిళ్లు చేసుకుంటున్నారో అతనికి బోధపడేది కాదు. పెళ్ళయిన నాలుగో రోజు నుంచి భర్త భార్యను కష్టపెడుతూనే వుంటాడు. భార్య కూడా ఉడతా భక్తి తానూ కష్టం కలిగిస్తూనే ఉంటుంది. "ఇంత పొద్దుపోయి వచ్చారేం? అవును లెండి. మీకిప్పుడు కాపురం కావలసి వచ్చిందా" అంటుంది.

"రత్తమ్మ వదినా - నా సంగతి నీకు తెలుసుగా? కాపరానికొచ్చి ఇన్నియేళ్ళయింది కదా, ఎన్నడయినా గడపదాటి ఎరుగుదునా? పర పురుషుడి ముఖమయినా చూచి ఎరుగుదువా? మరెందుకో వారికి నా మీద ఇంత కోపం" అని ప్రచారం మొదలు పెడుతుంది.

"అనుక్షణం, ఏ నుయ్యో, గొయ్యో చూసుకొంటా" నని బెదిరిస్తుంది.

భర్త మీద కోపం పిల్లల్ని కొట్టి తీర్చుకుంటుంది. కాని మానవులు మాత్రం పెళ్ళిళ్ళు మానుకోరు. పోనీ పొరబాటు పడుతున్నారేమో అనుకుంటే అన్నీ తెలిసిన వాళ్ళే మూడు నాలుగు పెళ్ళిళ్ళు కూడా వొక దాని తర్వాత వొకటి

చేసుకోటానికి ఏ మాత్రం సంకోచించటం లేదు.

అతనికి మాత్రం కుటుంబ జీవితం అమిత రోతగా వుండేది. ఇల్లాలు నీళ్ళాడినప్పుడే కాక సంసార మెప్పుడూ పురిటికంపు కొడుతూ వుండేది. కొంత మంది ఆడవాళ్ళు ఎప్పుడో రాబోయే కాన్పుకనీ, పుట్టబోయే పిల్లవాడి పక్క కిందకనీ, పెళ్ళయిన దగ్గర నుంచీ చిరిగిపోయిన గుడ్డలు పోగు చేస్తూ వుంటారు. గర్భిణీ వచ్చినప్పటి నుంచి బియ్యం పోసుకుని, తీరిగ్గా కూర్చుని మట్టిగడ్డలేరుకొని తింటూ వుంటారు. ఇవన్నీ అతనికి కంపరం పుట్టించేవి.

తండ్రులు - కూతుళ్ళకు మొగుళ్ళను వెతకటం అతనికి చాలా హేయంగా కనపడేది. మా అమ్మాయి పుష్టిగా వుంటుంది. పీలగా వుండే కుర్రవాడు పనికి రాడని పిల్లతండ్రి చెపుతూ వుంటే అతనికి పశు ప్రదర్శనాలు జ్ఞాపకానికి వచ్చేవి.

ప్రత్యక్షంగా కళ్ళతో చూస్తూ పెళ్ళి యెలా చేసుకోవటం? చేసుకుంటే తన ఆదర్శం ఎలా చెల్లుతుంది? అందుకని, ఆలోచించి, ఆలోచించి, ఏ పరిస్థితులలోనూ పెళ్ళి చేసుకోకూడదని నిశ్చయం చేసుకున్నాడు.

స్నేహితులుగానీ, బంధువులుగానీ ఈ ప్రస్తావన తెస్తే ''నాకేమిటి? పెళ్ళేమిటి?'' అనే వాడు. తననూ అందర్ని చూచినట్టు చూడ్డం అతనికి కష్టం వేసేది.

వాళ్ళు తెలివిగా నవ్వుతూ, ''మేమూ ఇట్లా అన్న వాళ్ళమే లేవోయ్'' అనే వారు. అతని మాట నమ్మే వాళ్ళు కాదు. ''చెప్పుదూ, నువ్వు అంగీకరిస్తే రత్నంలాంటి పిల్లను తెచ్చి జేస్తాం'' అనే వాళ్ళు.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

## 2 వ భాగం

"అతని మసులో కలవరపడి, నేను సుఖపడటం మీకు ఇష్టం లేదా?" అని గంభీరంగా ప్రశ్నించే వాడు.

"అయితే ఎక్కడన్నా ఏర్పాటు చేశావా యేమిటోయ్?" అని ప్రశ్నించే వాళ్ళు, స్నేహితులు, చాలా కుతూహలంగా.

అతను గుక్క తిప్పుకుని, "మీకు అర్థం కాదు" అనే వాడు.

అటు వంటి అతను పెళ్ళి చేసుకుంటాడని తెలిసేటప్పటికి స్నేహితులూ, బంధువులూ విస్తుపోవటంలో ఆశ్చర్యం ఏముంది? ప్రతి వాడూ వచ్చి అతన్నే అడిగే వాడు. యదార్థం తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో.

"ఏమోయ్ పెళ్ళి చేసుకుంటున్నావట నిజమేనా?"

"ఆ! చేసుకుంటున్నాను."

"ఏం, ఇలా చేశావు?"

"నేను పెళ్ళికి ఒక నూతనార్థం కల్పిస్తాను."

"ఏమిటది?"

"నేను మీ యందరికి మల్లే ఈ యంత్రానికి బానిసను అవను. దాన్ని నా సిద్ధాంతానికి ఉపయోగించుకుంటాను."

"ఎట్లాగో కొంచెం చెప్పు?"

"మీరే చూస్తారుగా?" అనే వాడు. తన అభిప్రాయాలు వాళ్ళతో చర్చించడానికి అతనికి యిష్టం లేదు.

అసలు సంగతేమిటంటే, అప్పుడతను గురుకులంలో చదువుకుంటూన్న ఇందిరను ప్రేమించటం జరిగింది. పెళ్ళి చేసుకోకపోతే యేం చేసేటట్టు? పెళ్ళి చేసుకోకపోతే ఆమె దగ్గరికి రానివ్వదు. పైగా ఆమె తండ్రి పోలీసు ఉద్యోగి. కాబట్టి పిల్లలు కలుగ కుండా జాగ్రత్తపడి, తన భార్యక్కూడా స్వాతంత్ర్యం యిస్తే పెళ్ళిలో ఉన్న చెడు తనకు అంటదనుకున్నాడు. "ఆమె జీవితం ఆమెది, నా జీవితం నాది. మధ్య మధ్య ఆనంద డోలికలు..." అనుకున్నాడు.

కాని అతను అనుకున్నట్లు ఏమీ జరగలేదు. సంవత్సరం తిరిగి వచ్చేటప్పటికి పొత్తి గుడ్డలు కరువయినాయి. తన భార్య

బియ్యంలో మట్టి గడ్డలు ఏరటం మొదలు పెట్టింది. అతనికి ఒక ఆడశిశువు జన్మించింది. ఆనాడు అతను పడ్డ బాధపైన భగవంతుడికీ, క్రింద భూదేవికీ తెలియాలి. భార్య నొప్పులు పడుతుంటే, "ఈ హింసలకు నేనే కారణం నేను బ్రహ్మరాక్షసిని, మహాపాతకిని" అని తన్ను తాను తిట్టుకుంటూ, కన్నీరు కారుస్తూ కూర్చున్నాడు. మారణ యంత్రం తన్ను వశం చేసుకుంటున్నదని గ్రహించాడు. కాని ఏం లాభం? ఐదు సంవత్సరాలు దాటేటప్పటికి ఇద్దరు పిల్లలు కలిగారు. మూడు గర్భ స్రావాలు జరిగినయ్.

అతడు జీవితం చేతులలో కీలు బొమ్మ అయ్యాడు. పరిస్థితులు తారు మారయినాయి.

ఉద్యోగం చెయ్యక తప్పింది కాదు. అతని మామ ఒక పెద్ద ఫరంలో గుమాస్తాగిరి ఇప్పించాడు. "మా అల్లుడు.... కొంచెం ఛాదస్తుడు. ఒక కంట కనిపెడుతూ ఉండండి" అని మేనేజరుతో చెప్పి పొయ్యాడు.

"ఇకనైనా జాగ్రత్తగా వుండు అప్పుడప్పుడూ మేనేజరు ఇంటికి వెళ్ళి వస్తూండు. పెద్ద వాళ్ళ దర్శనం చేసుకోవడం ఎప్పటికైనా మంచిది" అని అతనికి బోధించి వెళ్ళాడు.

తన మామ సహాయంతో పొట్ట పోసుకోవలసి వచ్చినందుకు చాలా కిందపడ్డాడు. తన మామకి తను ఎంత లోకువ అయి ఉంటాడు! తన భార్య తనను గురించి ఏమనుకుంటుంది?

స్నేహితులు కొంటె నవ్వులు నవ్వటం మొదలుపెట్టారు. ఒకరిద్దరు "ఇదేనా నీవు పెళ్ళికి కల్పించిన నూతన అర్థం?" అని అడిగారు. "నీ మాట నీవు నిలబెట్టు కున్నావు..... నువ్వు పెళ్ళికి బానిసవయ్యావా ఏమిటి - మామకు అయ్యావు కాని" అన్నారు కొందరు.

అతనికి మామ మీద కోపం వచ్చింది. అస్తమానం ఆయన్ని గురించే ఆలోచించే వాడు. అతను లేకపోతే అతని కూతురు ఉండేది కాదు, అతని కూతురు వుండక పోతే తనకీ పెళ్ళి వుండేది కాదు. తనకు పెళ్ళి లేకపోతే ఈ బాధలు వుండేవి కావు. తనికి ఒక్క క్షణం ఈ ప్రపంచం మాయల మయంగా కనిపించింది. కనపడకుండా వుండి ఈ ప్రపంచాన్ని నడుపుతున్నారు వాళ్ళు. అతను ఉద్యోగం చెయ్యలేకపోయాడు.

ఒక రోజు ఆఫీసులో ఎక్కౌంటు పుస్తకం ముందు వేసుకొని లెక్కలు రాయడానికి బదులు మార్జిన్లో ఈ బొమ్మ గీసాడు.

అది చూచి మేనేజరు మండిపడుతూ - "ఇదేమిటి?" అని అడిగాడు.

"మామ!" అని యికిలించాడు సీతారామారావు.

"ఎవరి మామ?"

"మీ మామ కూడా ఇలాగే వుంటాడా ఏమిటి? ఇహ్హిహ్హి... ఒకరి మామ ఏమిటి? అందరి మామాను. పిల్లనిచ్చే మామ. చూశారా వీడి తల పెద్దది - కళ్ళు చిన్నవి. చేతులు సన్నం - ముక్కు పెద్దది .... ఇహ్హిహ్హి...." అని తను గీసిన బొమ్మ

చూపుతూ చెప్పాడు.

అతనికి అవాళే ఉద్యోగం ఊడింది. అసలే మేనేజరు అతని మీద కోపంగా వుంటున్నాడు. మొన్న కూతురు రైలుకి వెళుతుంటే బండి తీసుకు రమ్మని సీతారామారావుకి చెపితే "నేనా, బండా? నీ కూతురికా!" అన్నాడు. అది మనస్సులో పెట్టుకొని మేనేజరు డిస్ మిస్ చేశాడు సీతారామారావుని. ఉద్యోగం ఊడిందని తెలియగానే మేనేజరు దగ్గరకు వెళ్ళాడు సీతారామారావు. ప్రాధేయ పట్టానికి వచ్చాడనుకొని బిర్రబిగిసి కూర్చున్నాడు మేనేజరు.

"ఏదీ, మా మామ బొమ్మ?"

"ఎందుకు?"

"మీసాలు పెట్టి పోతాను. పోలీసు..... మీసాలు!" అని చప్పట్లు కొడుతూ, గంతులు వేస్తూ అడిగాడు.

మేనేజరుకి ఏమీ తోచలేదు. వెర్రిగా చూస్తూ కూర్చున్నాడు.

"నీ కూతురికి బండి దొరికిందా?" అని అడిగాడు సీతారామారావు.

"........."

తన ప్రశ్నకు మేనేజరు గుడ్లప్ప చెప్పి కూర్చోవటం చూస్తే సీతారామారావుకీ హుషారెక్కింది. "కూతుర్ని అల్లుడి దగ్గరకు పంపటం, అల్లుడు గర్భిణీ చేసి మళ్ళీ నీ కూతుర్ని నీ దగ్గరకు పంపటం, నీవు నీళ్ళాడించి మళ్ళీ అల్లుడి దగ్గరకు పంపటం, అతడు మళ్ళీ అతని దగ్గరకు పంపటం - అతను మళ్ళీ నీ దగ్గరకు పంపటం - నీవు అతని దగ్గరకు పంపటం - అతను నీ దగ్గరకు పంపటం - ఇదేనటయ్యా నువ్వు చేసే పని?" అని ముక్కు మీద వేలు వేసుకొని, ఇంటి కప్పు ఎగిరిపోయేటట్లు నవ్వి, వెళ్ళిపోయాడు.

ఇతరులు ఎవరయినా ఉద్యోగం ఎందుకు పోయిందని అడిగితే "మా మామ డిస్మిస్ చేయించాడు" అని చెప్పే వాడు.

ఇక మళ్ళీ అతను ఉద్యోగం కోసం ప్రయత్నించలేదు. అప్పుడతనికి ఒక మామ మీదే కాదు. ప్రపంచం మీదే కోపంగా వుండేది. తన దగ్గర సహాయం పొందిన వాళ్ళు తన దగ్గరకు రావటం కానీ, తనతో మాట్లాడడంగానీ ఎప్పుడో మానివేశారు.

దేవుడికి ఉత్సవం చేయించనందుకు, సత్రంలో ఉచిత భోజనం ఏర్పాటు చేయించనందుకు నిందించటం మొదలు పెట్టారు. "ఉన్నన్నాళ్ళు కన్ను మిన్ను కానకుండా ఖర్చు పెట్టాడు. ఇప్పుడనుభవిస్తున్నాడు" అన్నారు. "ఖర్చు పెట్టాడంటే ఎవరి కోసం పెట్టాడు? మన కోసం పెట్టాడా? తన పేరు కోసం, పది మందితో మంచి వాడని పించుకోడానికి పెట్టాడు!" అని ఈసడించే వాళ్ళు.

అతనికి ప్రపంచం మీద కసిగా వుండేది. ఇది వరకు తన్ను ఎరిగిన వాళ్ళతో మాట్లాడబుద్ధి అయ్యేది కాదు. తన సహాయం

పొందిన వాళ్ళు కంటపడకుండా తానే తప్పుకు తిరుగుతుండే వాడు. ఉండి ఉండి ఆ కసీ అనేక విధాల బయటపడుతుండేది. తరచు భార్య గురి అవుతూ వుండేది.

గుర్రపు బండికి స్టేషన్నుంచి తన ఇంటికి పావలా మామూలుగా కానీ తన దగ్గర అర్థ రూపాయి వసూలు చేస్తారు.

"మా రాజులు ఇవ్వాల, మేం తినాల" అంటారు. తను కాదనలేడు. వాళ్ళతో బేరం చెయ్యలేడు! ఇంట్లోకి వెళ్ళి ఏదో ఒక వంక బెట్టుకొని భార్యతో తగాదా పెట్టుకుంటాడు.

అప్పుడప్పుడూ తప్పక కూరగాయల మార్కెట్టుకి వెళ్తాడు. తను కూరగాయలు తేవటం ఎవరన్నా చూస్తున్నారేమో అని, సంచి మడిచి జేబులో పెట్టుకొని వెడతాడు. అవీ ఇవీ కొనుక్కొస్తాడు. బేరం చెయ్యడు, మంచి చెడులు చూడడు, నాలుగు కొట్లు తిరగడు.

ఎవరు ఎక్కడ చూచిపోతారో అని, చేతికందినవి కొనుక్కొని వచ్చేస్తాడు. సందు గొందుల వెంటపడి ఇంటికి వచ్చేస్తాడు. ఇంటికి రాగానే భార్య ఒక్కసారి కూరలు చూసి, "అన్నీ

పుచ్చులే!" అంటుంది.

అతనికి చర్రున కోపం వస్తుంది. తను పడ్డ శ్రమకి ఇదా ప్రతిఫలం!

"వంకాయలు పావలా. ఇంటికి వొచ్చి ఇచ్చిపోతున్నారు!" అంటుంది.

"అయితే నేను డబ్బు కాజేశానంటావా?" అంటాడు. పోట్లాడతాడు. ఈ గుణం నీ వంశంలోనే ఉందంటాడు.

"నీ తండ్రి పోలీసు ఉద్యోగి కాదూ? కోడి పెట్టలు లంచాలు తీసుకొనే వాడు కాదూ? అంతా అంతే అనుకుంటావు."

ఆ డబ్బు చీరె కొనుక్కోమని ఆమె తండ్రి ఇచ్చి వెళ్ళిన డబ్బు, అది తన కోసం ఖర్చు పెట్టుకుంటున్నాననే లోపలి తపన ఈ విధంగా బయటపడుతుంది.

"సాయంకాలానికి బియ్యం లేవు" అంటుంది భార్య.

"నన్నేం చేయమంటావు?"

"తెప్పించండి!" అంటుంది భార్య.

ఈ మాటకు తగాదా కాని ఏమని తగాదా ఆడతాడు. ఈ లోకంలో బియ్యం తేవలసిన బాధ్యత భర్తల మీద వున్నమాట నిజమేనాయె! బియ్యం అవసరమనే మాటా - నిజమేనాయె!

“తెప్పించండి అంటం ఎందుకూ? తెండీ అనరాదూ? ఎవ్వరు తెచ్చేది? నేనేగా? ఆ సంగతి నీకు తెలియదూ? మనకు తోడు “తెప్పించండి” అని డాబుసరి కూడా ఎందుకూ? నీ డాబుసరితో నాకు చచ్చేరోజు వచ్చింది.”

“ఎందుకండీ అంత కోపం? ఇప్పుడు నేనేమన్నాను?” అంటుంది భార్య.

“కోపమా? పైగా నాకు కోపం అంటున్నావా? గుండెలు మరిగే మాటలు అనేదీ ఏమన్నా అంటే కోపం అనేది! నువ్వనే మాటలన్నీ బాగున్నాయే” నేను సంపాయించటం లేదనేగా నీకీ అలుసు? ఇంతకీ నిన్ను అని ఏం ప్రయోజనం.. నాకు బుద్ధి లేదు!” అని కన్నీరు పెట్టుకుంటాడు.

ఆ రోజుల్లో అతనొక పాట రాశాడు.

పడగొట్టండోయ్ తాజ్ మహల్

తవ్వండయ్యోయ్ తుగ్లక్ గోరీ

చిదిమెయ్యండోయ్ స్త్రీ సౌందర్యం

నలిపెయ్యండోయ్ పువ్వుల మొవ్వలు

దోచెయ్యండోయ్ ధనవంతుల

చంపెయ్యండోయ్ క్షుధార్తుల

రుధిరం రక్తం చిందాలోయ్!

పుర్రెలు యెముకలు నవ్వాలోయ్!

అతను ప్రస్తుతం ఇల్లు కదలటం లేదు. ఇంటి నాలుగు గోడలే అతని జీవితానికి సరిహద్దులయినై. అతని మనస్తత్వం పూర్తిగా మారిపోయింది. ఏదో పని వున్నట్లు ఎప్పుడూ

తిరిగే వాళ్ళని చూస్తే ఒకప్పుడు నవ్వు ఒకప్పుడు కోసం కలుగుతూ వుండేది. అప్పుడప్పుడూ ఎవ్వరైనా కనబడి “ఏం చేస్తున్నారు?” అని అడిగేవారు.

“ఏముంది చెయ్యటానికి?” అనే వాడు.

ఈ జవాబు వాళ్ళకి విచిత్రంగా కనిపించేది. వాళ్ళు ఒక్క క్షణం నిలబడి ఆలోచించుకోరు. ఆలోచించుకుంటే వాళ్ళకీ తెలుస్తుంది. వాళ్ళు అజ్ఞానులు. ఈ ప్రపంచం అజ్ఞానుల కోసం చెయ్యబడ్డదే అనటం వల్ల వాళ్ళు సుఖపడుతున్నారు. హాయిగా జీవితం గడుపుతున్నారు.

అంతేగాని ఆలోచించి చూస్తే ఈ ప్రపంచంలో ఏముంది ఏం చెయ్యటానికి అయినా? ఈ ప్రపంచం అనుక్షణం మారుతూ వుంటుంది. కాని ఈ మార్పు ఎందుకో ఎవ్వరికీ అర్థం కాదు. ఈ మార్పుకి ఆదర్శం వున్నట్టు కనపడదు. ఇక మానవుడు చేసేది ఏమిటి?

కొంత మంది "సంఘ సంస్కరణ విప్లవం" అంటూ తిరుగుతూ వుంటారు. ఏదో బ్రహ్మాండమైన పని చేస్తున్నట్టు వాళ్ళు రొమ్ములు విరుచుకొని కేకలు వేసుకుంటూ తిరుగుతూ వుంటే, వాళ్ళని చూచినకొద్దీ జాలి వేసేది సీతారామారావుకి. ఏమిటి వీళ్ళు చేసేది? సంఘానిక పరిపక్వదశ అనేది లేదు గదా! మరి దేని కోసం వీళ్ళ ఆర్భాటం?

ఒక సమస్యని పరిష్కరిస్తే, ఆ సమస్యా పరిష్కారంలో నుంచే మరొక సమస్య పుట్టుకొస్తుందని పెద్దలు చెప్తున్నారు. ఇదే ప్రపంచ పరిణామం అని కూడా అంటున్నారు. కాబట్టి ఎప్పటికప్పుడు మానవుల్ని బాధపెట్టే సమస్య ఏదో ఒకటి వుంటూనే వుంటుంది. కొంత మంది మానవులు బాధపడుతూనే వుంటారు. ఇక వీళ్ళు చేసేదేమిటి? తమ్ము తాము మోసం చేసుకుంటున్నారా? ప్రజలను మోసం చేస్తున్నారా?

మరి ఇంత మంది నాయకులు, ఇంత మంది మేధాసంపన్నులు, శాస్త్రవేత్తలు ఉన్నారే...... వీళ్ళంతా ఈ మాత్రం తెలియకేనా ఇన్ని కష్టాలు పడుతున్నారు? ఈ ప్రశ్నకు అతనికి వెంటనే జవాబు దొరికింది.

కుర్రతనంలో ఉబలాటం కొద్దీ సంఘానిక సేవ చేయాలని బయల్దేరతారు. ఇప్పుడున్న సంఘంలో బాధపడే వాళ్ళని చూచి ఉద్ధరిద్ధామని బయల్దేరతారు. కొన్నాళ్ళకు తాము చేసే పని పట్ల ఏమీ లాభం లేదని తెలిసినప్పటికి వెనక్కు తగ్గే అవకాశం వుండదు. లోకులకు యధార్థం చెప్పే ధైర్యం వుండదు.

అప్పటికే సంఘంలో వాళ్లకు గౌరవస్థానం లభించి వుంటుంది. వాళ్ల మాటలు నమ్మి అనేక కష్టాలకు వోర్చి అనేకులు వాళ్ళకు అనుచరులై వుంటారు. వాళ్ళకు ఏం చెప్పేటట్టు? "నేను ఇది వరకు చెప్పింది అంతా తప్పు" అంటే వాళ్లు ఊరుకుంటారా? అతని మాటలు నమ్మి తాము చేసిన స్వార్థ త్యాగం, పడిన కష్టాలు అన్నీ జ్ఞాపకం వస్తే ఇంకేముంది? కొంపలు కూలిపోవూ?

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

3 వ భాగం

అందుకని వాళ్ళకు సత్యం తెలిసినా పైకి చెప్పరు. యథాప్రకారం జీవయాత్ర సాగిస్తారు. చచ్చేవరకు తమకు నమ్మకం లేకపోయినా "సంఘసంస్కరణ" "విప్లవం" అంటూనే వుంటారు. ఈ విధంగా ఆలోచిస్తూ వుండేటప్పటికీ అప్పుడు పని చేస్తున్న సంఘసంస్క ర్తలంతా ఒక్కొక్కరే జ్ఞాపకం వచ్చారు. సీతారామారావుకి. ఒక కుర్రవాడు రాజకీయాలలో బాగా పని చేస్తుండే వాడు. అటు వంటి కుర్రవాడికి తన కూతురు నిచ్చి పెళ్ళి చేసి ఒక దేశ నాయకుడు అతనిని రాజకీయాలలో నుంచి విరమింపజేసి, ఒక దిన పత్రికలో ప్రవేశపెట్టాడు.

మరొక నాయకుడు కూతురికి ఉన్నత విద్యాభ్యాసం ఇప్పించి రాజకీయాలలో ఎన్నడూ దిగే వీలులేని ఒకడికి ఇచ్చి వివాహం చేశాడు. మరొక దేశ నాయకుడు తన కొడుకును ఇన్సూరెన్సు కంపెనీలో పెద్ద ఉద్యోగంలో ప్రవేశపెట్టాడు. తాము చేస్తే పనిలో, చెప్పేమాటల్లో తమకు నమ్మకముంటే ఈ పనులెందుకు చేస్తారు. ఆ దేశ నాయకులు? అనుకున్నాడు సీతారామారావు, "వాళ్ల యిష్టానికి విడిచి పెట్టాం" అంటారు పైక, కాని వాళ్లతో మాత్రం "మేం సరే కష్టాలు చూస్తూ వున్నావుగా..." తర్వాత నీ యిష్టం!" అంటారు. యిక వాళ్ళ యిష్టం ఏముంది?

ఈ రహస్యం తెలియని మూర్ఖులు, అమాయకులు, యేదో వాళ్ళకు ఆ సహాయం చేస్తున్నాం - ఈ సహాయం చేస్తున్నాం అని కష్టపెడుతూ వుంటారు. కాని, అన్నీ తెలిసిన తనెందుకు పడాలి? తనకేం పట్టింది? అతనికి వీళ్ళంటేనే కాదు - సంతోషంగా కాలం గడిపే ఎవ్వర్ని చూచినా హాస్యాస్పదంగానే ఉండేది. యేం చూసుకుని వాళ్ళంతా సంతోషపడుతున్నారో అర్థం అయ్యేది కాదు. "కుర్రాళ్ళు, అమాయకులు" అనుకునే వాడు.

ఒకప్పుడు రామయ్య తాత తనకు చెప్పిన మాటలే తను యిప్పుడు యితరులకు చెప్పటం మొదలు పెట్టాడు. వాళ్ళేమన్నా అంటే "ఒకప్పుడు నేను యిట్లానే" అనుకున్నవాణ్ని" అనేవాడు. ఒకప్పుడు తనకు తన స్నేహితులు చెప్పిన మాటలే ఇప్పుడతను ఇతర్లకు చెపుతున్నాడు.

"ఈ ప్రపంచంలో మనం చెయ్యదగింది ఏమీ లేదు" అనే వాడు.

"ఆ సంగతి మాకు తెలుసు" అనే వాళ్ళు కొంత మంది కుర్రవాళ్ళు.

"తెలిస్తే మరి మీరేమిటి చేసేది?"

"మాకు ఏది సుఖమనిపిస్తే అది చేస్తున్నాం"

"సుఖమంటే ఏమిటి? సుఖం ఎక్కడుంది? మృగాల కంటే మీరు సుఖంగా వున్నారని మీరు చెప్పగలరా? సుఖం బుద్ధిలో వుంటుంది! తృప్తిపడడంలో ఉంటుంది. రాత్రింబగళ్ళు పొలాల్లో పని చేసే కూలివాడి కంటే ధనవంతుడు సుఖపడుతున్నాడని

ఎవ్వరు చెప్పగలరు? సర్వసంగపరిత్యాగికన్నా భోగి సుఖపడుతున్నాడని ఎవ్వరు చెప్పగలరు? అజ్ఞానికన్నా జ్ఞాని సుఖపడుతున్నాడని ఎవ్వరు చెప్పగలరు? ఆలోచించి చూస్తే ఈ ప్రపంచంలో నిజంగా సుఖపడేది అజ్ఞానే అని తేలుతుంది. అజ్ఞానిని ఆలోచనలు వేధించవు. తనకు అందని ఆదర్శాలతో హైరానపడడు. అతనికున్న సుఖం మరెవ్వరికీ ఉండదు" అనే వాడు.

ఆకర్షవంతంగా అలంకరించుకొని, అందంగా వుండే ఆడవాళ్ళని చూస్తే అతనికీ మరీ కంపరం పుట్టేది. "ఏం చూసుకొని వీళ్ళకీ నిక్కు? వీళ్ళూ మామూలు ఆడవాళ్ళకు మల్లే రోజూ కాలకృత్యాలు తీర్చుకునే వాళ్ళేగా!" అనుకునే వాడు.

అతడు అనేక దృశ్యాలు ఊహించుకునే వాడు. ఊహించుకున్న కొద్దీ ఆ ఆడవాళ్ళు ఇళ్లల్లో చేసే పనులన్నీ వికారంగా కనిపించేవి.

వీళ్ళల్లో ఒకావిడకి ఏదో కష్టమొచ్చింది. మామూలు ఆడదానికి మల్లే ఈ అందమైన ఆకర్షవంతం అయిన స్త్రీ కూడా కళ్ళ వెంట నీల్ళు కార్చుకుంటూ చీదివేస్తూ వుంది.

ఇటు వంటి విషయాలన్నీ జ్ఞాపకం తెచ్చుకొని తనలో తాను నవ్వుకునే వాడు. ఇటు వంటి వాళ్ళు ఆకర్షవంతంగా అలంకరించుకోటానకి సిగ్గు వెయ్యదు కాబోలు! పైగా వీళ్ళకి అందంగా వుంటామని ఒక్కొక్కళ్ళకీ పుట్టెడు గర్వం ఎందుకో? మళ్ళీ నవ్వుకునే వాడు.

వీళ్ళ వెంట తిరిగే కుర్రవాళ్ళని చూస్తే అతనికి మరీ మండేది. వాళ్ళ కోర్కెలు తీర్చటమే వీళ్ళపని. వాళ్ళ వెనక తిరగటమే వీళ్ళకు గొప్ప, చెంగు తగిల్తే చాలు - పరవశత్వం పొందుతారు.

"ఎందుకట్లా తిరగటం?"

"ఆమె ఎంత అందంగా వుంటుందనుకున్నావు?" అంటూ అంగలారుస్తారు.

"ఏమిటి అందం? మిగిలిన ఆడవాళ్ళలో లేనివీ, ఆమెలో వున్నవీ ఏమిటి?"

"నీకు తెలియదు?"

తాను ప్రేమించినప్పుడు ప్రేమించలా? వీళ్ళందరి కంటే ఎక్కువగానే ప్రేమించాడే! ఏమిటి తనకు తెలియంది?

"మీరిది చాలా గొప్ప విషయం అనుకుంటున్నారు. పశువులకూ మీకూ భేదం ఏముంది? పశువులింకా నయం" అని చీదరించుకునే వాడు.

"నీకు హృదయం లేదు" అంటారు.

ఈ మాటకు అతనికి కోపం వొచ్చేది. యోగిని అయిం తర్వాత చింతామణి పాడిన సీసపద్యం పాడబుద్ధి అయ్యేది.

"ఇది ముక్కు అనుకుంటున్నారేమో - కాదు, జలుబు చేసినప్పుడు చూడండి."

ఇవి కళ్ళు అనుకుంటున్నారేమో? కాదు రెండు తూట్లు.

ఇవి స్తనాలు అనుకుంటున్నారేమో - కాదు - మాంసపు ముద్దలు.

ఇది మన్మథస్థానం అనుకుంటున్నారేమో - కాదు - తోలుబొక్క!"

ఈ వేదాంత సారం వాళ్ళకు బోధించి రోగం కుదర్చాలనుకునే వాడు గాని, తనని మరీ అసహ్యించుకుంటారేమోనని భయపడి పస్తాయించే వాడు.

తను చదువుకునే రోజుల్లో ఆడవాళ్ళు ఒక పెద్ద బస్సునిండా ఎక్కి చదువు కోవడానికి కాలేజీకి వెళ్తుండే వాళ్ళు. వాళ్ళ మధ్య కూర్చోబుద్ధి అయ్యేదతనికి. తాను కూర్చున్న తర్వాత బస్సు బోల్తా కొట్టాలనీ, ఒకళ్ళకు మొహం దోక్కుపోవాలనీ, ఒకళ్ళకు బుగ్గలు చీరుకుపోవాలనీ, ఒకళ్ళకు కాళ్ళు విరగాలనీ అనిపించేది.

అట్లా తయారైన వాళ్ళని ఊహించుకుంటే అతనికి ఎందుకోగాని చాలా సంతోషంగా వుండేది. కాని అట్లా కోరడం తప్పని, ఆ భావాన్ని బలవంతంగా అణుచుకునే వాడు. పైకి రానిచ్చే వాడు కాదు. ఇప్పుడు మళ్ళీ అదే భావం వివిధ రూపాలలో బహిర్గతం అవుతోంది. దాన్ని ఆపే శక్తి ఇప్పుడతనికి లేదు.

అతడు అనేక రకాలైన ఆలోచనలతో మధనపడి చివరికి అసలు ఆలోచించటమే తప్పనే నిర్ణయానికి వొచ్చాడు. అతి చిన్న విషయాన్ని గురించి దీర్ఘంగా ఆలోచించటమే తన బాధలకు మూల కారణం అనుకున్నాడు. తీరిక అంటే ఆలోచనలు రాక తప్పవు. తీరిక లేకుండా చేసుకోటానికి కాయకష్టం మొదలు పెట్టాడు. ఇంట్లో పనులన్నీ అతనే చేసుకోవటము మొదలు పెట్టాడు.

దొడ్డి నిండా కూరగాయల పాదులు పెట్టి అస్తమానం వాటికి నీళ్లు పోస్తూ కూర్చునే వాడు. ఈ పద్ధతి మొదట్లో బాగానే వుంది, అనిపించింది. గాని కొద్ది రోజులు గడిచేటప్పటికి బలహీనం ఎక్కువైంది.

కాయకష్టం పడే అలవాటు అతనికి లేకపోవటం వల్ల శరీరంలో వేడి ఎక్కువై నిస్సత్తువగా ఉండేది. ఎప్పుడూ వొళ్ళంతా నొప్పులుగా వుండేది. వీటి వల్ల అతనికి కోపం, చిరాకు ఎక్కువైనై. కుటుంబ జీవితం దుర్భరం చేసుకోవటం మొదలు పెట్టాడు. చీటికి మాటికి భార్యను తిట్టే వాడు, కూతుర్ని కొట్టే వాడు.

రామయ్య తాత ఒకనాడు, "ఇది నీకు తగదు అబ్బాయి" అని చెప్పాడు.

"ఎవరిపని వాళ్ళు చేసుకోవటం మంచిదేగా తాతా!"

"ఇది నువ్వు చెయ్యవలసిన పని కాదు"

"ఎందుకని!"

"నీకు అలవాటు లేదు బాబూ, ఏదైనా ఉద్యోగం సంపాదించుకొని హాయిగా కాలం గడుపు" అన్నాడు.

"ఈ జీవితం జంఝాటం నేను పడలేను తాతా!"

"మరి తప్పదు బాబూ! ఎక్కడికి పోయినా అది వెంటపడుతూనే వుంటుంది. బతికినన్నాళ్ళూ ఏదో ఒక రకంగా జీవితంలో పాల్గొనవలసిందే! మనం దేనికి పనికి వస్తామో తెలుసుకొని ఆ పని చేస్తూ వుండటం మంచిది."

"ఎప్పుడో ఒకసారి అందరం చావవలసిందేగా!"

"అవును బాబూ......"

"ఇక ఈ తాపత్రయం ఎందుకు?"

"చచ్చి ఏం చెయ్యాలో తోచక బాబూ!"

"ఈ కష్టాలుండవుగా!"

"ఈ సుఖాలూ ఉండవు. ఏమీ ఉండదు. ఏమీ లేని దానికన్నా ఈ జీవితమే మెరుగని కొందరి అభిప్రాయం. ఇంకొక సంగతి కూడా చెబుతారు. ఇప్పుడు చాలా మంది కష్టాలనుభవిస్తున్నమాట నిజమే. కాని ఎప్పటికైనా కష్టాల్లేని జీవితం మానవుడికి లభించక పోతుందా? అనే ఆశ చాలా మందికి వుంది. ఎవరికి తోచిన విధంగా వారు ప్రయత్నిస్తున్నారు.

కాని చచ్చి మాత్రం చేసేదేముంది బాబూ! ఒకళ్ళు చచ్చినంత మాత్రాన ఈ ప్రపంచ సమస్య తేలేదేముంది? పుట్టే వాళ్ళు పుడుతూనే ఉండిరి. ఏది శాశ్వతం, అయినా మానవుడు, ఈ ప్రపంచంలో ఉండటం శాశ్వతమే! అది తప్పదు కాబట్టి ఎవరి పని వాళ్ళు చేసుకుపోతూ వుండాలి. అలా చెయ్యని వాడు తనకు తాను బరువు అవుతాడు".

అతనికి ఏమీ తేలటం లేదు. ఎంత చిన్న విషయాన్ని గూర్చి అయినా సరే అతనొక నిశ్చితాభిప్రాయానికి రాలేకుండా వున్నాడు. మనస్సు పరిపరి విధాల పోతూ వుంది. ఆలోచనలతో అతలాకుతలం అవుతూ వుంది మనస్సు.

ఒకప్పుడు ఒక అభిప్రాయం మంచిది అనుకుంటాడు - మరుక్షణం దానికి వ్యతిరేకమైన అభిప్రాయం మంచిదిగా తోస్తుంది. ఒక పని చేద్దామని మనస్సులో అనుకొని, దానికి వ్యతిరేకమైన పని తనకు తెలియకుండానే మొదలుపెడతాడు. మధ్యలో తాను ఇంకొక విధంగా సంకల్పించుకున్నట్లు జ్ఞాపకం వొస్తుంది. "పోనీ, ఇదే మంచిదేమో! లేకపోతే ఎందుకు చెయ్యబుద్ధి

అవుతుంది!" అనుకుంటాడు.

కాని వెంటనే, "అదీ ఇదీ మంచివి ఎట్లా అవుతాయి - అదో ఇదో మంచిదవ్వాలిగాని?" అనిపిస్తుంది. చేసే పని ఆపి, ఆలోచించటం మొదలు పెడతాడు.

"ప్రపంచానిక ఒక ఆదర్శం లేదు గనుక, ఏ పనికీ ప్రయోజనం లేదు గనక, అన్ని పనులూ మంచే. అన్ని పనులూ చెడే! పెద్దలు ప్రతి విషయానిక బహుముఖాలుంటవి అంటారు. అంతేగాని ఇది మంచీ - ఇది చెడూ అనేది లేదు. చూట్ట మీద ఆధారపడి వుంటుంది.

చూచి లేనిది కల్పించుకొని బాధపడిందాని కంటే అసలు చూడ్డమే మానుకుంటే!"

అతని హృదయసీమలో హఠాత్తుగా ఒక భావం విరిసేది "అసలు ఏదో ఒకటి చెయ్యాలనుకోవటంలోనే ఈ చిక్కులన్నీ వొస్తున్నాయ్యేమో!"

మెదలకుండా కూర్చునే వాడు.

"మనస్సు పరిపరి విధాల పోనివ్వకు. చిక్కబట్టు" అంటారు. పెద్దలు, పరిపరి విధాల ఆలోచించేదే తనైనప్పుడు ఇక చిక్కబడేదెవ్వరు.

పరిస్థితుల వల్ల భావాలు మారతాయి. పరిస్థితులు మార్చుకోమని సలహా చెపుతారు. కొందరు, పరిస్థితుల వల్ల, పరిస్థితులు మార్చుకునే శక్తి లేక తను పడి వుంటే, ఇక పరిస్థితుల్ని మార్చేదెవరు?

చూసే దాన్ని చూడు అంటారు వేదాంతులు. చూచేదే తనైనప్పుడు, చేసే దాన్ని తనెట్లా

చూస్తాడు?

అతని జీవితం గొడవైపోయింది. తల ఆలోచనల పుట్ట అయింది. తలే కాదు అతని జీవితమే ఆలోచనల గూడు. ఎప్పుడూ ముసుగు పెట్టుకొని పడుకొని, కళ్ళు మూసుకొని బాహ్య ప్రపంచాన్ని మరచిపోయి ఆలోచించే వాడు, ప్రశ్న మీద ప్రశ్న పుట్టుకొచ్చేది. కాని ఏ ఒక ప్రశ్నకీ సరైన జవాబు దొరికేది కాదు.

ప్రస్తుతం కళ్ళు మూసుకొని ముసుగు పెట్టుకొని పడుకోవటమే అతని జీవితం.

అసమర్థుని భార్య

పొయ్యిలో బూడిద ఎత్తి వేస్తూ, "పాపా! ఇంటి ముందు కొంచెం ముగ్గు వెయ్యమ్మా" అని చెప్పింది కూతురితో సీతారామారావు భార్య.

ఇంకా బాగా తెల్లవారలేదు, ఆలస్యం అయితే ఒచ్చే పొయ్యే జనం వల్ల వీలుండదని చీకటితోనే ఇంటి ముందు వూడ్చి, కళ్ళాపి జల్లి ముగ్గు వెయ్యటం ఆమెకు అలవాటు. ఈ మధ్యయ మాసిన బట్టలు కట్టుకుని బయటకు వొస్తే, సీతారామారావు మండిపడ్డాడు. "నా పరువు తీసి వెయ్యటానికే ఈ పనులన్నీ చేస్తున్నావు" అన్నాడు.

అప్పటి నుంచి ఆమిక అటు తొంగి చూట్టానికే భయంగా వుంది.

పాప ముగ్గు డబ్బా తీసుకొని బయటకు వెళ్ళింది. ఆమె పొయ్యిలో బూడిద చీపురు మీద పోసుకొని పెంట పోగుమీద పోసి వచ్చింది.

పెంటపోగు పాపం పెరిగినట్లు పెరుగుతూ వుంది.

ఇంతలో పాలమనిషి వొచ్చింది. చేతిలోని పాలచెంబు అందిస్తూ "ఇవాళ డబ్బు ఇప్పిస్తారా అమ్మా!" అని అడిగింది.

"ఎంత అయింది వెంకమ్మా?" అని అడిగింది ఆమె.

"ఎంతవకేవమ్మా? ఇవాళ్తో రెండు నెలలు పూర్త అయినయి. కిందటి నెల పందొమ్మిది రూపాయల ఆరణాలు ఇవ్వాలి. ఈ నెల పదిహేడు రూపాయల మూడణాలు, పందొమ్మిదీ, పదిహేడు ముప్పై ఆరు - ఈ నెల మూడణాలూ వెళ్ళి కిందటి నెల ఆరణాల్లో పడితే తొమ్మిదణాలు మొత్తం ముప్ఫై ఆరు రూపాయల తొమ్మిది ఆణాలు ముందే కూతురుతో సమగ్రంగా విషయాలన్నీ చర్చించి రాకపోతే మాత్రం పాల మనిషి ఇంత తేలిగ్గా లెక్క తెలపగలిగేది కాదు.

"ముప్ఫై ఆరు రూపాయలా!" అనుకుంది ఆమె మనస్సులో.

"నేనైనా చీటికీ మాటికీ అడిగే దాన్ని కాదు. పెద్దయ్యగారి టైం నుంచీ పోస్తున్నా, అమ్మగారికి తెలుసుగా నా సంగతి. ఇప్పుడు అవసరం వచ్చి అడుగుతున్నా, అమ్మాయి కాపురానికి వెళ్తూంది. ఇంట్లో పెద్ద ముండనని వున్న తర్వాత దానికి యింత చీర గుడ్డా, రవిక గుడ్డా అవి పెట్టకపోతే దాని ప్రాణం వుసూరుమంటుంది."

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

4 వ భాగం

ఆ ఇంట్లో వతసుగా పోసే వాళ్ళెవరూ డబ్బు కోసం ఇబ్బంది పెట్టరు. చాలా కాలం నుంచీ యిస్తూ, వుండటం కారణం కావొచ్చు. ఖాతాలో ఎంత కలుపుతున్నా అడక్కపోవటం కారణం కావొచ్చు.

"ఆగిందానివి ఎట్టాగో ఆగావు. ఇవ్వాళ కూడా ఆగు వెంకమ్మా వారింకా నిద్ర లేవలేదు. లేవగానే అడిగి తీసుకొని రేపు తప్పకుండా యిస్తాను" అంది ఆమె.

"సరేలే అమ్మా" అని వెళ్ళిపోయింద వెంకమ్మ.

వెంకమ్మ అడగ్గానే డబ్బు యివ్వలేకపోయినందుకు ఆమె మనస్సు చాలా నొచ్చుకుంది. పాపం! ఎంత అవసరం వుండి అడిగిందో, కూతురు కొత్తగా కాపరానికి వెళ్ళడం అయె! కాని, తను ఏం చెయ్యగలదు? ఇంట్లో చిల్లిగవ్వ కూడా లేదు. ఆమె కళ్లు చెమ్మగిల్లినై.

ఆ వూళ్ళో పంపుల్లేవు. ఆ పేటలో బావుల్లేవు. పంపూ బావీ ఆ యింట్లోనే వున్నాయి. అందుకని తెల్లవారగట్ట నుంచీ ఆ చుట్టుపక్కల వాళ్ళంతా నీళ్ళకి కడవలు భుజాన పెట్టుకొని, చీమల బారుకీ మల్లె వొస్తుంటారు. ఆ యింటికి ఆడవాళ్లు కడవలు భుజాన పెట్టుకొని బిత్తర చూపులు చూస్తూ భయం భయంగా అడుగులో అడుగు వేసుకుంటూ వస్తారు. ఒక పడుచు అమ్మాయి కడవ భుజాన పెట్టుకొని వాలు చూపులు చూస్తూ వస్తూ వుంటే యింట్లో వుండే ముసలిది కుండ భుజాన పెట్టుకొని ఆ పిల్లని కనిపెట్టి చూస్తూ వెనకాలే వొస్తూ ఉంటుంది. మొగవాళ్లు మాత్రం రెండు చేతుల్లో రెండు బుంగలు పట్టుకొని ధనాధనామని అంగలు పంగలు వేసుకుంటూ వొస్తుంటారు. ఎదురు పడ్డ పడుచు తొలిగిపోతూ ముసి ముసి నవ్వులు నవ్వుతుంది. వెనక వున్న ముసలిది "రామయ్యగారి లక్ష్మయ్య కాదటే. వాడికి తొలుగుతావెందుకు, నీకు అన్న వంటి వాడు" అని ప్రమాదం లేని చుట్టరికం కలుపుతుంది. కాని అప్పటికే కడవలో నీళ్ళు చింది, కడవ ఎత్తుకొన్న భుజం, వొక్క పక్క రవికా తడిసి ఉంటై పడుచుకి.

శీనయ్య నీళ్ళకు వచ్చాడు.

శీనయ్య నీళ్ళకు రావటం చూసి, "ఇవాళ కొంచెం యింట్లో నీళ్లు పోసిపో శీనయ్యా" అంది ఆమె.

"ఆ పోస్తానమ్మా" అన్నాడు శీనయ్య బావి వొడ్డు ఎక్కుతూ.

శీనయ్యది పల్నాటి సీమ "ఈ వూరు ఎందుకు వచ్చావు శీనయ్యా" అని ఎవరైనా అడిగితే "బతకటానికి" అని వెతుక్కోకుండా జవాబు చెబుతాడు. లాగుడుబండి ఒకటి అద్దెకి తీసుకొని, దాని వల్ల పొట్ట పోసుకుంటూ ఉంటాడు.

నూటపదహార్లు సంపాదించి స్వగ్రామం వెళ్ళి పెళ్ళి చేసుకోవాలని అతని కోర్కె. తీరిగ్గా ఉన్నప్పుడు ఆ పనీ యీ పనీ చేసి పెట్టి కూడా నారా పెట్టించుకు వెళుతుంటాడు. అతనికి వొండి పెట్టే వాళ్ళు లేరు. ఇన్ని బియ్యం వండుకొని తింటూ వుంటాడు.

ఆమె వంట యిల్లు శుభ్రం చేసి, పొయ్యి రాజేసింది. శీనయ్య దొడ్లో గాబులో నీళ్ళు పోస్తున్నాడు. పాప ముగ్గు డబ్బా చేత్తో పట్టుకు వొచ్చింది.

"వేశావా అమ్మా?"

"ఆ"

"దొడ్లో కూడా, వేసిరా, మా అమ్మ కదూ!"

"వేశానే అంటే!"

"దొడ్లో?"

"ఆ! గేట్లో, వాకిట్లో, సందు వాకిట్లో దొడ్లో - అన్ని చోట్లా వేశాను."

పిల్ల చెప్పించుకోకుండా పనులు చేస్తున్నందుకు తల్లికి సంతోషం కలిగింది. వెళ్ళమ్మా! వెళ్ళు కాసేపు చదువు. ఇంతలో కాఫీ కాస్తాను. కాఫీ తాగి బడికి వెళుదువు గాని.

"దా మరీ!"

బడికి వెళ్ళే ముందు ఒక గంటసేపు తల్లితో పాఠాలు చెప్పించుకోవటం పిల్లకి అలవాటు.

"ఇవాళ నాకు తీరదమ్మా - నువ్వే చదువుకో. ఏముంది రాత్రి చదువుకున్న పాఠాలేగా!" అంది తల్లి.

కాని, చదువుకోవటం కోసం వెళ్లటానికి బదులు తల్లి దగ్గరకు వొచ్చి కూర్చుని, "ఒక్క రోజు బడికి వెళ్ళకపోతే ఏం అమ్మా!" అని అడిగింది పాప.

"వెళ్లకపోతే చదువు యెట్లా వస్తుంది? యిక్కడుండి యేం చేస్తావు?"

"అంట్లు తోముతాను."

"నువ్వా?"

“నాకు చేతవునే, తెల్లగా మెరిసిపోయ్యేట్టు తోముతాను. రోజూ నువ్వు తోముతుంటే చూట్టంలా? ఏముందీ? ఇంత పేడ తెచ్చుకొని, ఇంత బూడిద వేసుకుని కూచుంటే, మిలమిలా మెరిసిపోతాయి!”

తల్లికి ఏదో జ్ఞాపకం వొచ్చింది. విచారంగా పిల్లని దగ్గరకు తీసుకొని “నేనుండగా ఆ పని నీకెందుకమ్మా?” అంది.

“రాత్రి ఒంట్లో బాగా లేదంటివే?”

తల్లిక కళ్ళలో నీళ్ళు తిరిగినాయ్. ఆమెకు వొంట్లో బాగాలేని మాట నిజమే. కాని అప్పుడే కూతుర్ని ఈ పనుల్లోకి దింపగలుగుతుందా? తను చేస్తున్నది చాలదూ?

తల్లి మెదలకుండా కూచోటం వల్ల కూతురికి ధైర్యం వొచ్చింది. “నేను బడికి వెళ్ళనమ్మా? మేష్టరు గారు మాట్లాడితే జీతం అంటారు. నాన్నని అడిగితే కోప్పడతారు” అంది.

ఆ రోజు పిల్ల బడికి వెళ్ళలేదు. తల్లి బలవంత పెట్టలేకపోయింది.

-2-

కూతురు అంట్లు తోముతూ వుంది. తల్లి కూరగాయలు బేరం చేస్తూంది. “మొన్న

దోసకాయలు యిచ్చి వెళ్లావు. అన్నీ చేదు విషాలయినాయ్. ఒక్క కాయన్నా పనికి రాలేదు. నీ దగ్గర అంతా దండగ బేరంగా వుంది!”

“నా దొడ్లో పండినయ్యా తల్లీ? మారు బేరానికి అమ్ముకునే ముండని నా మట్టుకు ఏం తెలుస్తుంది? వాళ్ళిస్తారు నేను యేసుకొస్తాను. మీ బోటి మా రాజులు కొంటే - నాలుగు డబ్బులు మిగిల్తే - నా పొట్ట నిండుతుంది.

“ఇవ్వాళైనా మంచి కాయలు తెచ్చావా?”

“మంచియనే తెచ్చా మంచివి కాకపోతే నా మొహం ఎవరు చూస్తారూ?”

ఆ ముసల్ది మంచికాయలు తేదని ఆమెకు తెలుసు. చౌకబారు కాయలు వేసుకొచ్చి గిట్టిన చోట గిట్టినట్లు ఇచ్చిపోతుంది. అయినా కొనక తనకు తప్పేదేముంది? మార్కెట్టుకు పంపటానికి ఇంటిలో డబ్బు లేదు. ఈ ముసల్దయితే రేపు రమ్మంటే వొస్తుంది.

“బెండకాయలు ఎట్లా యిస్తున్నావు?”

“తీసుకోండి...... ఎంతకో ఒకంతకి” అని తక్కెడ తీసి తుయ్యబోయింది.

“ఎంతకిస్తావో చెప్పూ?”

“ఇప్పుడే ఇచ్చి వొస్తున్నా! ఆ కోంటోరమ్మని అడిగింది?”

“ఎంత?”

“ఆ, ఎంత - మీతో అబద్ధం చెపుతానా? సవ్వాసేరు పావలా.”

“పావలా....! ముసల్దానా నీకు పిల్లా జెల్లా లేరు కదా, ఈ డబ్బంతా ఏం చేస్తున్నావే” అని నవ్వుతూ అడిగింది ఆమె.

“సరే తీసుకోండమ్మా, మూడణాలు చేసి యిస్తాను.”

బెండకాయలూ, బీరకాయలూ, పచ్చిమిరపకాయలూ యిచ్చింది. ఒక అరవీశె కాకరకాయలు కూడా తీసుకోమని బ్రతిమాలింది. తీసుకోకపోతే డబ్బు ఇప్పుడే ఇమ్మంటుందేమో అని ఆమె వొప్పుకుంది.

దానికి ఆ కాకరకాయలు ఎక్కడా అమ్ముడు కాలేదనీ, తనకు అంటగట్టి వెళ్ళాలని చూస్తూ వున్నదనీ ఆమెకు తెలుసు కాని ఏం చేస్తుంది. ముసల్ది అరివీశ కాకరకాయలు కూడా యిచ్చి డబ్బు అడిగింది.

“చిల్లర లేదు, రేపు వచ్చినప్పుడు కనపడు యిస్తా” అంది.

“సరేలే అమ్మా” అని ముసల్ది వెళ్ళిపోయింది. అంతే చాలనుకుంది ఆమె.

ఇంతలో శీనయ్య యింట్లో నీళ్ళు పోసి వొచ్చాడు.

“కొంచెం బజారుకి వెళ్లి రావాలి శీనయ్యా” అంది ఆమె.

“వెళ్తా”

“కట్టెలు తెచ్చి పెట్టాలి”

డబ్బివ్వండి, తెస్తాను.”

కాని డబ్బెక్కడిది? ఆమె డబ్బు కోసం లోపలికి వెళ్ళినట్టు వెళ్ళింది. దొడ్డి గోడ దగ్గరకు వెళ్ళి పక్క యింటి కాంతమ్మను పిలిచింది.

“కాంతమ్మక్కా! అయిదు రూపాయలుంటే బదులిస్తావా? మొన్న జాకెట్టు కుట్టించాను. కుట్టుకూలి ఇవ్వాలి. వారిని అడగటానికి మనస్సు వొప్పటం లేదు. “మొన్న వంద రూపాయలు పెట్టి చీరలు కొన్నావే, అప్పుడే మళ్ళీ ఖర్చా?” అని నొచ్చుకుంటారేమో అని భయంగా వుంది. రెండు రోజుల్లో నాన్న వస్తాడు రాగానే ఇచ్చి వేస్తాను.” అని అడిగింది.

ఇంట్లో ఐదు రూపాయలు లేవంటే లోకువ అనీ, తన భర్త గౌరవాన్ని ఎక్కడ లోపం వచ్చిపడుతుందో అనీ తప్పంతా తన మీదే పెట్టుకొని అడిగింది.

“అయ్యో! దానికేం అమ్మా! ఇబ్బంది ఎవరికయినా వొస్తుంది” అని కాంతమ్మ డబ్బు తెచ్చి యిచ్చింది. ఆ డబ్బు శీనయ్య కిచ్చి “రెండు పలకల కట్టె పేళ్ళు తెచ్చి పెట్టు నాయనా” అన్నది.

“ఆ”

శీనయ్య బజారు వెళ్ళటానికి రెండడుగులు వేశాడు.

“చూడు శీనయ్యా, ఎట్లాగూ బజారు వెళ్తున్నావు గనుక వొచ్చేటప్పుడు వొక సవాశేరు వెన్నపూస కూడా తెచ్చిపెట్టు”

కట్టెల ఆడితి, వెన్నపూస కొట్టూ రెండూ ఒక్క చోట కాదు. ఆ సంగతి ఆమెకు తెలుసు. అందుకనే రెండూ పనులూ ఒకేసారి చెపితే ఏమన్నా అనుకుంటాడేమోనని ఈ విధంగా చెప్పింది.

శీనయ్య డబ్బు తీసుకొని, కట్టెలు కట్టుకు రావటానికి డొక్కనారు తాడు తీసుకొని బజారు వెళ్ళాడు.

వెంటనే ఆమెకు వెచ్చాలు అయిపోయినయ్యనే సంగతి జ్ఞాపకం వొచ్చింది. పాప కోసం వెతికింది. అంట్లు తోముతున్న ఆ పిల్ల చూచేటప్పటికి విచారం, ఆనందం రెండూ ఒకేసారి కలిగాయి. అంట్లు తోమాల్సివొచ్చినందుకు విచారం - తోముతున్న వైఖరికి సంతోషం.

చేతుల నిండా, పేడా, మొహం నిండా బూడిదా పూసుకుంది పాప. నాపరాతి మీద చతికిలాబడి కూర్చొని కాళ్లారాజాపి అంట్లు తోముతూ వుంది, చేతి వూపుకి తగినట్టుగా తల వూపుతూ ఉంది.

“ఒకసారి ఇట్లారా పాపా” అని పిలిచింది తల్లి.

“చేతిలో పని తెమలనియ్యి” అని సమాధానం చెప్పింది పాప, పని ఆపలేదు, తల ఎత్తలేదు.

“కొంచెం సుబ్బయ్య కొట్టుకు వెళ్ళి వెచ్చాలు తెచ్చిపెట్టాలమ్మా” అన్నది తల్లి.

సుబ్బయ్యది చిల్లరకొట్టు. వాళ్ళ ఇంటి దగ్గరలోనే ఉంది. అక్కడ వాళ్ళకు ఖాతా వుంది. అక్కడ నుంచి అప్పుడప్పుడూ

వెచ్చాలు తేవటం పాపకి అలవాటే.

"కావాల్సినయ్యేవో రాయి, తెస్తా" అంది పాప.

ఇంట్లోకి కావలసిన సరుకులు కాగితం మీద రాసి ఇచ్చింది తల్లి.

"పెద్ద ఉల్లిపాయలు ఒక వీశ - ఎండు మిరపకాయలు సవాశేరు

ధనియాలు రెండు గిద్దలు - మిరియాలు అణా

ఆవాలు అర్థణా - సన్ లైట్ సోప్ మూడు అణాలన్నర

మంచి నూనె అరవీశ - కుంకుడు కాయలు ఒక శేరు

లక్సు సోప్ నాలుగణాలన్నర - చింతపండు అరవీశ

కందిపప్పు రెండు శేర్లు - పచ్చి సెనగపప్పు బేడా అర్థణా"

పాప చేతులు కడుక్కొని, లంగాకి తుడుచుకొని తడి కాకుండా రెండు వేళ్ళతో కాగితం పట్టుకొని చదువుకుంది.

"రెండు సబ్బులు ఎందుకమ్మా?"

"ఒకటి బట్టలు వుతుక్కునే సబ్బు"

"నీ చీరె వుతుక్కోవటానికా?"

"ఊ"

"నీ చీరెకు వేరే ఒక సబ్బు కావాలేం?" అంటూ పరుగెత్తింది పాప.

-3-

శీనయ్య కట్టెలు తెచ్చి వంట యింట్లో వేశాడు. కోమటి ఇంటి నుండి నాలుగయిదు సార్లు తిరిగి చిన్న సంచితో సరుకులన్నీ ఇంటికి జేర్చింది పాప. శీనయ్యే వెన్నపూస కూడా తెచ్చాడు. ఆమె సరుకులన్నీ సర్ది, వొకసారి నిట్టూర్పు విడిచింది. "ఇవ్వాళ్టికి గట్టెక్కినట్టే కాపరం ఒక రోజు గడిచింది" అనుకుంది.

కాని నొకపక్కన ఆమెకు బాధగానే వుంది. తుమ్మితే వూడే ముక్కుగా ఇట్లా కాపరం ఎన్నాళ్ళు జరుగుతుంది? ఎంత దూరం ఆలోచించి చూసినా ఒడ్డు కనపట్టం లేదు. ఆలోచించిన కొద్దీ భయంకరమైన అలలే కనిపిస్తున్నాయి. అలల తాకిడికి ఈ ఓడ ఎప్పుడూ పుటుక్కుమన్నా అనొచ్చు.

"కాఫీకి పొయ్యి మీది నుంచి పాలు దింపుతూ చేతులు చూచుకుంది. అంట్లు తోమటం వల్ల గోళ్లు అరిగినయ్. ముంజేతులు మసితో నల్లబడి ఉన్నాయ్, అర చేతులకు ఇది వరకున్న మృదుత్వం లేదు. తన ఆకారం, స్వభావం అన్నీ మారిపోతున్నట్లు ఆమె భావించుకుంది. ఇంకా ఎక్కువ దూరం ఆలోచించటానికి భయం వేసింది.

"నాన్న లేచేరేమో చూడమ్మా!"

"లేవ లేదే ఇంకా."

"లేపమ్మా, కాఫీ ఆరిపోతుంది."

"నేను లేపను బాబూ కోప్పడతారు"

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

5 వ భాగం

ఈ మాటలు విని కాఫీ కలుపుతూ అలాగే ఆలోచిస్తూ కూర్చుంది ఆమె.

ఆమెకు తన చిన్నతనం, తన చదువుకొన్న రోజులు, ఆనాటి తన వూహలూ అన్నీ జ్ఞాపకం వచ్చి వుంటాయి. తను గురుకులంలో చదువుకున్న రోజులే తన జీవితంలో కెల్లా మంచి రోజులనుకుంది. భర్తలను చూడవలసిన విధం పిల్లలను పోషించవలసిన పద్ధతి వాళ్ళు బోధిస్తూ వుంటే ఎన్ని తియ్యని వూహలు వూహించుకునేది! నిజంగా తన పెళ్ళి అయినప్పుడు కూడా అంతా తన్ను అదృష్టవంతురాలే అనుకున్నారు. తనూ అలానే అనుకుంది. కానీ, అనుభవానికీ వచ్చేటప్పటిక అంతా తారుమారయింది. తప్పు ఎక్కడుందో తెలియటం లేదు.

"అమ్మా?.... కాఫీ....!"

ఆలోచిస్తూ అటు కాఫీ ఆరబోస్తున్న సంగతి మరచిపోయింది. కాఫీ చిందిపోతూ వుంది.

ఆమె సర్దుకొని "నాన్నని లేపమ్మా!" అంది.

"నేను లేపనంటే"

"మా అమ్మవి కదూ"

"కోప్పడతారంటే"

కోప్పడితే? నాన్న అన్న తర్వాత ఆ మాత్రం కోప్పడరూ వెళ్ళమ్మా - కాఫీ ఆరిపోతే నాన్న తాగరు.

ఆమె కళ్ళ వెంట రెండు కన్నీటి చుక్కలు రాలినయ్. మొన్న ఆలస్యంగా కాఫీ ఆరిపోయిందని "నిద్రలేపటమే నీకు కష్టమయిపోయిందా? అని కోప్పడ్డారు. నిన్న కూతురు లేపితే నిద్ర లేపి నందుకు కోప్పడ్డారు.

"నేను చేసిన తప్పేమిటి?" అనుకుంటూ కూర్చుంది.

తల్లి విచారంగా వుండటం చూచి మాటల్లోకి దింపాలని ప్రయత్నించింది పాప.

"వెళ్తాలేవే! సరేగాని, నాన్న పెద్ద వాడు గదా - అన్నీ తెలుసా?" అని అడిగింది.

“అన్నీ తెలుసునమ్మా.....”

“మరి, తొమ్మిది పదమూళ్ళు ఎంత నాన్నా అంటే నాకు తెలియదు అన్నారే?” అని అడిగింది.

“ఏదో ఆలోచిస్తూ అన్నారు గాని, ఆ మాత్రం నాన్నకు తెలియదటే?” అంది.

“తెలియదమ్మా - ఒట్టు! మొన్న నక్షత్రాల్లో ఏముంటుంది నాన్నా?అని అడిగితే నాకు తెలియదని కోప్పడ్డారు” అంది కూతురు. “నిజం అమ్మా! నువ్వడుగు - గాలి ఎట్లా వొస్తుందో చెప్పమను. ఆకాశం ఎంత ఎత్తున ఉందో చెప్పమను. ఆకాశం ఎంత ఎత్తున ఉందో చెప్పమను. కొబ్బరి చెట్టు ఏయే పనులకు పనికి వస్తుందో నూనె చేయు విధమూ చెప్పమను......”

తండ్రికి ఏమేమి రావో, కూతురు ఇట్లా చెప్పుకుపోతుంటే ఆమెకు నవ్వొచ్చింది.

వెంటనే తన చిన్నతనం జ్ఞాపకం వొచ్చింది. ఆడవాళ్ళకు ఎంత తెలివి వుండి ఏం

లాభం? అది రాణింపుకు వచ్చే వీలేది? ఆ తెలివి బయటపడే అవకాశం భర్త ఇవ్వకపోతే అంతా బూడిదలో పోసిన పన్నీరు అనవలసిందే?

“ఈ పిల్ల జాతకం ఎట్లా వుందో?” అని ఆలోచిస్తూ కూర్చుంది. కూతురు నెమ్మదిగా లేచి, తండ్రిని లేపటానిక వెళ్ళింది.

సీతారామారావు గాజు గ్లాసులో తప్ప కాఫీ తాగడు. ఇంకే గ్లాసుతోనూ తాగినట్లు వుండదని అంటాడు. అందుకని అతని కోసం ప్రత్యేకం ఒక గాజు గ్లాసు తెప్పించింది. అది పిల్లలు ఎక్కడ పగలగొడతారో అనే భయంతో, అతను కాఫీ తాగ్గానే అలమరలో దాస్తుంది అతని భార్య.

ఇప్పుడు ఆ గాజు గ్లాసు కోసం నెమ్మదిగా లేచింది అతని భార్య.

అసమర్థుని ఆదర్శం

సీతారామారావు ఇంకా నిద్ర నుంచి లేవలేదు. అతనికి కొద్ది రోజుల నుంచి కలలు వస్తున్నాయ్. అన్నీ తెల్లవారగట్టే తెల్లవారగట్ట వచ్చే కలలు నిజమౌతవంటారు.

తను చీమలు దూరని చిట్టడవిలో, కాకులు దూరని కారడవిలో తపస్సు చేసుకుంటున్నాడు. ఒక పక్క పెద్ద పులులు, సింహాలు కాండ్రుమంటున్నాయి. మరో పక్క ఏనుగులు తండోపతండాలుగా తొండాలు పైకెత్తుకుని ఘీంకారాలు చేసుకుంటూ పరుగెత్తుతున్నాయ్. కుందేళ్ళు కుప్పిగంతులు వేస్తున్నాయ్, లేళ్ళు చెంగు చెంగున దూకుతున్నాయ్.

నెమళ్ళు పింఛాలు విప్పి నృత్యం చేస్తున్నాయ్. పాములు బుస కొడుతున్నాయ్. ఒక నాగుబాము తన నెత్తిమీద పడగవిప్పి, సూర్యరశ్మి నుండి తనను కాపాడుతూ వుంది. ఒక కొండ చిలువ చెట్టు చాటున కూర్చొని, మనుష్యభాషలో “అలా రండి,

ఇలా రండి" అంటూ వుంది. చెట్టు చాటు కోతులు కిచ కిచ గెంతుతున్నాయ్. ఆంత్ర మధ్యాన పక్షులు రింగురింగున రొండ్లు కొడుతున్నాయ్.

ఒక ఎలుగు గొడ్డు తాటి చెట్టు ఎక్కి, కల్లు లొట్టలో నుంచి కల్లు తాగి, కాళ్ళ సందున తల ఇరికించుకొని, అంత ఎత్తు నుంచి ఢామ్మున కింద పడింది. దానికి దెబ్బ తగలలేదు కాని, భూమి అదిరింది. తపోభంగమైంది. కన్నులు తెరిచాడు.

తపోభంగమయి నందుకు తనకు కోపమొచ్చింది కాబోలు తన నేత్రాల్లోంచి ఒక తేజస్సు - వెలుగు - ఒక మంట - బయలుదేరి సూటిగా ఎలుగ్గొడ్డు మీదకి వెళ్ళి, దాని వెంట్రుకలను కనురెప్ప పాటులో చుర చుర కాల్చి వేసింది. ఇప్పుడు ఎలుగ్గొడ్డు మబ్బులున్న ఆకాశానికి మల్లే, తోలు వూడిన అరటికాయకి మల్లే తెల్లగా వుంది.

మళ్ళీ తను కళ్ళు మూసుకుని తపస్సు మొదలు పెట్టాడు. ఏండ్లు పూండ్లు గడిచినయ్.

తన చుట్టూ గబగబా పుట్టలు మొలిచినయ్. గోళ్ళు పెరిగి పెరిగి మెలితిరిగి హాస్యగాని కర్రకు మల్లె వున్నాయి. గడ్డం ఇంతింతయి కారు మబ్బంత అయింది. శరీరం శుష్కించి

పోవటం, ముఖంలో బ్రహ్మ తేజస్సు ఉట్టిపడటం - రెండూ ఒక్కసారి జరిగినయి. మరీ విచిత్రమేమంటే, శరీరం ఎంత శుష్కిస్తే, ముఖంలో బ్రహ్మ తేజస్సు అంత ఎక్కువ అవుతూ ఉంది.

ఉండి వుండి ఒక మెరుపు మెరిసింది. అది సాధారణంగా మెరిసే మెరుపు వంటిది కాదు. కొండలను చీల్చుకొని భూమి మీదకు దూకే జలపాతానికి మల్లే - హృదయాలను చీల్చుకొని బయటకు దూకే ప్రేమ ప్రవాహానికి మల్లే ఆకాశాన్ని చీల్చుకొని అతని ముందుకు దూకింది. దూకింది దూకినట్టుగానే ఉండిపోయింది.

ఆకాశాన్నుంచి అతని ముందుకి దాని తేజస్సుతో ఒక తెల్లని తళ తళ మెరిసే బాట ఏర్పడింది. ఆ మెరుపు తేజస్సుకి సింహాలూ శార్దూలాలూ ఏనుగులూ - వన్యమృగాలన్నీ నివ్వెరపోయినవి. చేతనారహితంగా యెలా నుంచున్నవి అలాగే - యెలా కూర్చున్నవి అలాగే - యెలా తిరుగుతున్నవి అలాగే ఉండిపోయినయి.

వెయ్యి రాంఢోళ్ళ మోత వినబడింది.

అతను కన్ను తెరచి చూచాడు. పార్వతీ పరమేశ్వరులు మెరుపు యేర్పరచిన దారి గుండా పరుగెత్తుకొని వచ్చి అతని ముందు ప్రత్యక్షం అయ్యారు. పార్వతీ పరమేశ్వరులు ఇద్దరు వ్యక్తులు కారు.

అర్ధనారీశ్వరుడు, ఒకే ఆకారంలా సగం పార్వతీ, సగం శివుడూ, ఈ విషయం సుస్పష్టం చెయ్యటానికో అన్నట్టు మధ్య పార్టీషన్‌గా వ్యవహరిస్తూ నల్లగుడ్డ, శివుడు మాట్లాడేటప్పుడు పార్వతినీ, పార్వతి మాట్లాడేటప్పుడు శివుణ్ణీ కప్పుతూ వుంటుంది. కాబట్టి పొరపాటునో, పార్టీషన్ గాలికి రెప రెప కొట్టుకునేటప్పుడో తప్ప ఏకకాలంలో ఇద్దరూ కనబడరు.

సీతారామారావుని పలకరించేందుకు శివపార్వతులు తమలో తాము మాట్లాడు కున్నారు.

“నా మాట వినరు?” అన్నది పార్వతి.

“ఏం వినలేదు?” అన్నాడు శివుడు.

“భక్తులు పిలిస్తే దడదడా పది వరాలు జేబులో వేసుకొని ప్రత్యక్షం అవుతారు”.

“నేనేం చేసేది, నేను పుట్టిందే అందుకాయె!”

“అయితే మాత్రం వేళాపాళా ఉండక్కర్లా!” అన్నది పార్వతి.

“భక్తులు వేళాపాళా లేకుండా తపస్సు చేస్తుంటే నేనేం చేసేది?” అన్నాడు శివుడు.

“మీ ఇష్టం” అన్నది పార్వతి.

“యేం వరమిద్దాం? తర్వాత అడగలేదంటావు!” అన్నాడు శివుడు.

“మనం ఇచ్చింది తీసుకుంటాడా ఏమిటి?” అన్నది పార్వతి.

“ఏం చేస్తాడంటావు!” అడిగాడు శివుడు.

“తను కోరింది ఇమ్మంటాడు.”

“ఏం చేద్దాం?”

“అడగండి ఏం కావాలో”

శివుడు అడిగాడు “బిడ్డా నీ తపస్సు ఫలించింది. కండ్లు తెరిచే వున్నావు గనుక ఇక నీకేమీ కావలయునో కోరుకొనుము.”

సీతారామారావు శివుణ్ని తదేక ధ్యానంతో చూశాడు. కోరుకోవాలి.

వైశ్వానరుడు “బాంణ్” అన్నాడు.

“అన్నం” అన్నాడు సీతారామారావు.

పార్టీషన్‌గా వ్యవహరిస్తున్న నల్లగుడ్డ శివుని ముఖం కప్పింది. పార్వతి బయటపడి ఉలిక్కిపడింది. “నాథా! - ఇతని కోర్కెలను

నెరవేర్చకుడు అని ప్రార్థించింద. ఎంతో వినయంగా భయంగా అడిగింది.

"ఎందుకని?" శివుడు అడిగాడు.

"మీరు ఈ వరం ఇస్తే నన్ను వండి పెట్టమని అడుగుతాడు" అన్నది పార్వతి.

పార్వతి తనకు వరం ఇవ్వకుండా చేస్తుందేమో అని సీతారామారావుకు గాభరా పుట్టింది. యిలా అన్నాడు.

"మీరు నాకు వొండి పెట్టక్కర్లేదు. ఎవరూ వండకుండా నేను అడక్కుండా ఎప్పటికప్పుడు పంచభక్ష్య పరమాన్నాలతో నా కడుపు నిండుతూ వుండాలి."

నల్లగుడ్డ పార్వతిని కప్పింది శివుడు - "బిడ్డా నీ భక్తికి మెచ్చితిని. నీకు అసలు ఆకలి అనేది లేకుండా చేస్తాను" అన్నాడు.

"ఆకలి లేకుండా చేస్తే ఎలా దేవా? యిదేనా నీ ఆర్తజన రక్షణ పరాయణత్వం? నీ భక్తులను కాచు విధం? దీనజన పోషకుడవని పేరు గాంచితివే? ఆశ్రిత జనరక్షా దక్షుడవని పేరు మోపితివే? యీ పేర్లన్నీ యెందుకు దేవా? నీ భక్తులను మోసం చెయ్యటానికి తగిలించుకున్నవేనా?"

శివునకు భయం వేసింది, "బిడ్డా తొందరపడకు - నీ కోర్కెను సవినయంగా మనవి చేసుకో" అన్నాడు. "నాకు ఆకలి ఉండాలి - ఆకలి తీరే అన్నం వుండాలి."

"అటులనే జరుగుగాక" అన్నాడు శివుడు.

నల్లగుడ్డ శివుణ్ణి కప్పింది. పార్వతి "యిక వెళదాం" అంది. ఆమెకు తన భర్త స్వభావం తెలుసు యేం నోరు జారతాడో అని భయం.

"మరొక సంగతి దేవా!" అడిగాడు సీతారామారావు.

"ఒప్పుకోకండి" అన్నది పార్వతి.

"ఎందుకని?" అడిగాడు శివుడు.

"మరొక వరం ఇమ్మంటాడు" అన్నది పార్వతి.

"ఇద్దాం" అన్నాడు పార్వతి.

"ప్రేయసీ! బ్రహ్మ విష్ణు కంటే భక్తకోటిలో నాకే మంచ పేరు ఉండటానికి కారణం

తెలుసా? ఎక్కువ మంది భక్తులు నన్నే ప్రత్యక్షం కమ్మని ఎందుకు కోరుకుంటారో తెలుసా? తేలిగ్గా ప్రత్యక్షం అవుతానని, అడిగిన వరాలన్నీ అడగ్గానే యిస్తానని!"

"మీ యిష్టం. నా కంటే మీకు మీ భక్తుల మీదే ఎక్కువ ప్రేమ" అన్నది పార్వతి.

"కాదు మీ అందరి కంటే పేరు ప్రఖ్యాతుల మీద యెక్కువ ప్రేమ నాకు" అని సీతారామారావు వైపు తిరిగి "ఏమిటి బిడ్డా?" అని ప్రశ్నించాడు.

"నా వరం ఇంకొకళ్ళ కివ్వగూడదు."

"యివ్వను" అని మాట యిచ్చాడు శివుడు. అప్పుడే తన భర్త నోరు జారటం మొదలు పెట్టారనే భయం పార్వతికి యెక్కువయింది. వెళదామని భర్తని తొందర పెట్టింది.

"వెళ్దాం" అన్నది పార్వతి.

"వెళ్దాం" అన్నాడు శివుడు.

"యింకొక వరం అడుగుతాడు" అన్నది పార్వతి.

"అడగనివ్వు" అన్నాడు శివుడు.

"అడిగి అడిగి చివరికి మీ నెత్తినే చెయ్యి పెడతాడు. భస్మాసురుడ్ని జ్ఞాపకం చేసుకోండి నాథా" అన్నది పార్వతి.

భస్మాసురుడు పేరే త్తేటప్పటికి శివుడికి భయం వేసింది. అతని బారి నుంచి తప్పించుకోవటానికి తాను పడ్డ కష్టాలన్నీ జ్ఞాపకం వచ్చినై. వెంటనే సీతారామారావుని "బిడ్డా నీకు శుభమగుగాక!" అని దీవించి యిద్దరూ అంతర్ధానం అయ్యారు.

ఆకలి... ఆకలి..... ఆకలి పార్వతి పరమేశ్వరులు అంతర్ధానం అవగానే బ్రహ్మాండాన్ని నమల కుండా మింగాలనే అంత ఆకలి పుట్టుకొచ్చింది సీతారామారావుడి లోపలి వైశ్వానరుడు 'భాంఙ్' అని అరిచాడు.

ఆ అరుపుకి భూమి దద్దరిల్లింది. కొండలు పిండి అయినాయి.

కోతులు చెట్ల మీద నుంచి పండిన కాయలు రాలినట్లు రాలినాయి. పక్షులు అవ్వాయి చువ్వలకు మల్లే ఆకాశంలోకి చొచ్చుకుపోయినాయి. పాములు కుబుసం విడిచినాయి. నెమళ్ళ పింఛాలు తెగినాయి. తెల్లబడ్డ ఎలుగ్గొడ్డు ఎర్రరంగుకి తిరిగింది.

“భాంణ్”

ఆ ధ్వనిక సీతారామారావు చుట్టూ పెరిగిన పుట్ట చెల్లా చెదరై గడ్డం వూడి గాలిలో నాట్యం చేసింది. గోళ్ళు వూడి విచ్చుకత్తులై అడవిని నరికి పోగులు పెట్టినై.

“భాంణ్”

స్వర్గలోకం తూట్లు పడింది. ఆ తూట్లలో నుంచి ఊర్వశీ, రంభ, తిలోత్తమా మొదలైన అప్సరసలంతా పంచభక్ష పరమాన్నాలు పళ్ళాల్లో పెట్టుకొని సూర్యకిరణాలకు మల్లే కిందకు దిగారు. ఒకతె సీతారామారావు తొడ మీద కూర్చొని తినిపించడం మొదలు పెట్టింది. మిగిలిన వాళ్ళు హాయిగా పాడుతూ, కన్నుల పండుగ్గా నృత్యం చేస్తున్నారు.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

## 6 వ భాగం

క్షణంలో మహారణ్యం మారిపోయింది. ఎక్కడ చూచినా కోయిల కుహకుహరవాలే! సెలయేటి గుడగుడ ధ్వనులే! కుందేళ్ళు శార్దూలాల పాలు తాగుతున్నై, సింహాలు, లేళ్ళకు చన్నిస్తున్నై. పాములు ఏనుగుల తొండాలకు మారుగా వేళ్లాడుతున్నై, కోతులు ఎలుగొడ్డు మీద సవారి చేస్తున్నై. అంతా నిత్యకళ్యాణం పచ్చతోరణంగా వుంది. సీతారామారావుకి నయనానందకరంగా వుంది.

దురదృష్టవశాత్తూ సీతారామారావు మంచం మీద కదిలాడు. నిద్ర చెదిరింది. పై దృశ్యం అదృశ్యం అయింది. తను పడుకున్న మంచానికి దగ్గర్లో వున్న కొబ్బరి చెట్టు మొవ్వ, గాలికి ఓటి మోత మోగుతూ వుంది. మొండిగోడ మీది నుంచి ఎవ్వరో పిలుస్తున్నారు. పక్క యింట్లో ఎవ్వరో పోట్లాడుకుంటున్నారు. తన పక్కలో పడుకున్న నల్ల కుక్క లేచిపోయింది.

అతనికి లీలగా తన భార్య అప్పుడే పనిపాటలు మొదలు పెట్టినట్లు తెలిసింది. ఊహల తియ్యదనాన్నుంచి ఒక్కసారి నిత్య జీవితం మీదకు దృష్టి మళ్ళేటప్పటికి, అతనికి భరించలేని బాధ కలిగింది. తన భార్య మీద కోపం వచ్చింది. ఎప్పుడూ పనే..... పని......పని పొద్దున్న నాలుగు గంటలకు లేస్తుంది. రాత్రి పడుకునే వరకు ఏదో ఒక పని చేస్తూనే వుంటుంది. అదైనా శుభ్రంగా చెయ్యదు.

ఆకస్మాత్తుగా అతనికి తన భార్యకు తొమ్మిదో నెల అని జ్ఞాపకం వొచ్చింది. భార్య మీద కోపం ఎక్కువ అయింది. తొమ్మిదో నెల గదా, ఆ మాత్రం బుద్ధి ఉండక్కర్లా? బావిలో మంచినీళ్ళు కడవతో తనే తోడుతానంటుంది! ఏనుగంటి మంచాలు తనే బయటకు వేస్తానంటుంది. ఆ బరువులు మోసేటప్పుడు ఏ కాలో జారితే దానికేం! అది మంచం మీద మూలుగుతూ పడుకుంటుంది. డాక్టరు చుట్టూ మందుకనీ మాక్కనీ తిరగవలసిందే తనేగా? ఇంతకీ జీవితం నరకం చెయ్యటానికి పుట్టింది.

నెలలు నిండినా మొన్న పేరంటానికి వెళ్ళింది చూసిన వాళ్ళు ఏమనుకుంటారు? తనకు ఆ మాత్రం తెలియక్కర్లా? నిజంగా ఈ ఆడవాళ్ళకు సిగ్గులేదు. తనకు సంతానం కలగబోతున్న సంగతి అందరికీ తెలియాలీ అన్నట్లు తిరుగుతారు.

"నాన్నా, నాన్నా" పాప లేపుతూ వుంది.

"లే నాన్నా, పొద్దెక్కింది."

అతనికి లేద్దామనే వుంది కాని, బద్ధకం వొదల్లేదు. ఇంకొక భయం కూడా వుంది. లేచినప్పటి నుంచీ బియ్యం లేవు, పప్పు లేదు, కూరలు లేవు - ఇవేగా అది చెప్పే మాటలు.. వొళ్ళంతా నొప్పులుగా వున్నై. గాల్లో ఆరుబయట పడుకుంటే కామోలు, కాదు, రాత్రి, చంటిది మారాం చేస్తే, నవారు మంచం దానికిచ్చి నులక మంచం వేసుకున్నాడు. అబ్బా ఈ పిల్లలతో చచ్చే రోజు వస్తుంది. అన్ని మంచాలు ఊరబెడ్తారు, పైగా తన భార్య "పిల్లలునన తర్వాత......" అంటుంది.

“లే నాన్నా, అమ్మ లెమ్మంటోంది.”

“ఆ! అమ్మ లెమ్మంటుంది. లెమ్మనక ఏం చేస్తుంది? ఆర్డర్లు పురమాయించటం కూడా! ఏకల్లే వచ్చి మేకల్లే అయిందంటారే అట్టా వుంది. దీని వ్యవహారం తను అడగదు. అన్నీ కూతురి ద్వారా అడిగి వస్తూంది. ఈ మధ్య ఈ ఎత్తు ఒకటి ఎత్తుతూ వుంది.”

“లేవండి, కాఫీ ఆరిపోతూ వుంది” అన్నది భార్య.

ఒకప్పుడు దీన్ని ఎట్లా ప్రేమించానా అని ఆలోచిస్తూ కుళ్ళుకుంటూ లేచాడు... “అయితే నేను బ్రతకటం కూడా మీ అమ్మ చూడలేకుండా వుందా యేమిటి?” అని కూతుర్ని ప్రశ్నించాడు. ఆమె ప్రక్కనే వుంది.

“కాఫీ!” అన్నది భార్య గ్లాసు అందిస్తూ.

“లేవనివ్వు” అన్నాడు సీతారామారావు.

లేచాడు.

“కాఫీ!”

“కొంచెం మొహం కడుక్కోనిస్తావా?”

“అప్పుడు మళ్ళీ యిస్తాను!”

“మొహం కడుక్కో అక్కర్లా?”

“మీకు అలవాటుగా బెడ్ కాఫీ!”

“ఏం - అలవాటయితే తప్పా? మొహం కడుక్కోని తాగాలని భగవంతుడు నిర్ణయించాడా? కాఫీ తాగి మొహం కడుక్కుంటేనేం, మొహం కడుక్కొని కాఫీ తాగితేనేం? నా యిష్టం-”

“నేను కాదనటం లేదు. బెడ్ కాఫీ మీకు అలవాటు గనుక....”

“బెడ్ కాఫీయా, గాడిదగుడ్డు కాఫీయా?” అని భార్య చేతిలోని గాజు గ్లాసు తీసుకున్నాడు. వెంటనే వొద్దని తీసుకున్నట్లు జ్ఞాపకం వొచ్చింది. గ్లాసు గోడకు వేసి కొడదాం అనుకొని, గడగడా తాగేశాడు.

ప్రపంచంలో అన్ని శాఖాల్లోనూ హేమా హేమీలున్నారు. వీళ్ళంతా అందరికీ ముఖ్యమయిన అన్నం దొరికేటట్టు చెయ్యలేకపోవటం అతనికి ఆశ్చర్యంగా, విచిత్రంగా వుండేది. పైగా వీళ్ళంతా నా సంఘానికి అన్నం కావాలంటే, నా దేశానికి కావాలనీ కాట్ల కుక్కలకు మళ్ళే కీచులాడుకుంటూ వుంటారు. ఈ కీచులాడుకునే చోట్లకి పెద్ద పెద్ద పేర్లు పెడతారు.

అంతర్జాతీయ మహాసభలు అంటారు. ఈ మహాసభలకు ఒక్కొక్క దేశం నుంచి ఒక్కొక్క ప్రముఖమయిన వ్యక్తి హాజరై ఉపన్యాసం మీద ఉపన్యాసం దంచుతాడు. గుక్క తిరక్కుండా గంటల తరబడి మాటలు దొర్లిస్తాడు. ఎన్ని ఉపన్యాసాలు దంచినా, ఎన్ని మాటలు దొర్లించినా

అతను అడిగేదేమిటి?

"మా పొట్టలకు అన్నం లేదు. మలమల మాడి చస్తున్నాం. మీరు ప్రసాదించండి .. మీరు ప్రసాదించండి..... మీరు ప్రసాదించండి.." అని ఇతర దేశాలను ఆర్థించటం...

ఎంత నీచం!

ఇతనే ఇంత నీచంగా ప్రవర్తిస్తుంటే, మరొక దేశ ప్రముఖ వ్యక్తి లేస్తాడు...." ఛస్తే చావనివ్వండి గాని, ఆ దేశానికి అన్నం పంపటానికి వీల్లేదు" అని హుూంకరిస్తాడు.

కొన్ని దేశాలు తమకు అన్నం ఎక్కువయితే సముద్రంలో ఒలక బొయ్యటాని కయినా ఒప్పుకుంటయ్యిగాన, మరొక దేశానికి పంపటానికి ఒప్పుకోవు. మరొక దేశానికి కాదు - తమ దేశంలో వున్న బీదవాళ్ళకే పంచిపెట్టవు!

వీళ్ళిలా కీచులాడుకుంటూ వుంటే......

ఈ కీచులాట ఫలితం ఏమవుతుందో అని, అన్ని దేశాల ప్రజలూ గుంటకాడ నక్కలకు మల్లే కాచుకు కూచుంటారు. ఏ దేశానికి ఎంత కబళం దొరికిందో అని వార్తలకు ఎదురు చూస్తూంటారు. ఈ ప్రవర్తన చాలా నీచంగా, అసహ్యంగా కనిపించేది సీతారామారావుకి.

ఇంత మంది మేధావులున్నారు గదా ప్రపంచంలో - వీళ్ళలో ఒక్కరయినా అన్నం తేలిగ్గా దొరికే పద్ధతి ఎందుకు కనిపెట్టరు? ఏ వాసన చూట్టం వల్లో, ఏ గాలి పీలవడం వల్లో, ఏ నీళ్ళు త్రాగడం వల్లో ప్రాణాలు నిలిచేటట్టు ఎందుకు చెయ్యరు? ఈ యుద్ధాలూ, ఈ నాశనాలూ, బాధలూ, తాపత్రయాలూ అన్నీ తప్పుతాయిగా? అంతా సుఖంగా బతుకుతారుగా! వాళ్ళీ విధంగా ఆలోచించరు. సంఘానికి కొన్ని నియమాలున్నాయి. ఆ నియమాలనుబట్టే పోవాలంటారు. సంఘం స్వభావ సిద్ధంగా పొందే మార్పుకి దోహదం యివ్వాలంటారు. ఒక దశ తర్వాత ఒక దశ వస్తూ వుంటుందట! ఒకరి మీద ఒకరు విప్లవం చెయ్యాలట! అలా చేస్తే, ఎప్పటికో వర్గాలు లేని సంఘం ఏర్పడుతుందట! అప్పుడు అందరికీ అన్నం దొరుకుతుందట!

ఈ వాదం అతనికీ ఏ మాత్రం నచ్చలేదు.

ఏమిటిది?

అందరికీ అన్నం దొరికే ఏర్పాటు చెయ్యటానికి, ఇప్పుడు అన్నం బాగా దొరికే వాళ్ళు అంగీకరించరట! వాళ్ళు ఎదురు తిరుగుతారట. అందుకని వాళ్ళ మీద విప్లవం చేసి, అననం లేని వాళ్ళందరూ ఒకటయి, రాజ్యాధికారం స్వాధీనం చేసుకొని అందరిక అన్నం దొరికే విధానం ఆచరణలో పెట్టాలట!

"ఈ సిద్ధాంతం నేను ఒప్పుకోను" అన్నాడు సీతారామారావు.

"ఎందుకని?"

"అందరికీ అన్నం దొరకటానికి అన్నం వున్న వాళ్ళు ఎదురు తిరుగుతారేది ఒట్టి బూటకం. సంఘంలో ఎంత మంది అన్నం వున్న వాళ్ళు లేని వాళ్ళకు సహాయం చెయ్యటం లేదు? తమ ఆస్తిపాస్తులన్నీ నాశనం అయినా లెక్క చెయ్యకుండా సహాయం చేస్తున్నారే!"

"వాళ్ళు చేసేది కీర్తికోసం"

"దేనికోసమైనా కానీయి ఆర్థిక పరిస్థితే కాక మరొక గుణం కూడా మానవుని చేత మంచి పనులు చేయిస్తుందని అంగీకరిస్తున్నట్లేగా?"

"కీర్తి దాహం తీరగానే వీళ్ళు అన్నం లేని వాళ్ళను మోసం చేస్తారు."

"అన్నం లేని వాళ్ళు అన్నం దొరగ్గానే మిగిలిన వాళ్ళని మోసం చెయ్యరూ?"

"చెయ్యరు!"

"ఎందుకని?"

"....."

"అధికారంలోకి రావటానిక, ప్రజలను సుఖపడేటట్టు చెయ్యడానికి అన్నం లేకపోవటం అర్హత అనటంలో అర్థం లేదు. అన్నం లేక పోవడం అనేక అనర్థాలకు దారి తీస్తుంది. యిటు వంటి అనర్థకాలకు ఆటపట్టయిన వాళ్ళు మాత్రమే విప్లవం చేసి ప్రజల్ని సుఖ పెట్టగలరు అనటం - ప్రసవించటం కంటే గర్భస్రావం వల్లే మంచి పిల్లలు పుడతారన్నట్టు వుంటుంది."

అసలు యిందొక సంగతి! అన్నం లేకపోవడం వల్ల విప్లవం చేసే శక్తి, తర్వాత ప్రజల్ని సుఖపెట్టే ఉదారత్వం కలిగి, అన్నం వుంటం వల్ల కీర్తి దాహం హెచ్చి ప్రజల్ని మోసం చెయ్యటం జరిగితే అందరికీ అన్నం కావాలని కోరుకోవటం ఎందుకు?

అన్నం లేకపోవటమే మంచిదేమో!

ఈ విధంగా వాదించి, వాదించి "ఈలోగానే మనం చస్తాం, మనం చచ్చిం తర్వాత ఎవరేమైతే మనకేం" అనుకునే వాడు.

ఇలా ఆలోచించుకుంటూ వుండగా అతనికి ఆకస్మాత్తుగా ఆధ్యాత్మిక వాదం మీదికి మనస్సు పోయేది.

"మన మహాఋషులు ఈ సమస్యని పాశ్చాత్యులకు మల్లే కాకుండా, సక్రమమైన దృష్టితోనే చూశారు" అనుకునే వాడు. పాశ్చాత్యులకు మల్లే ఆకలిని తీర్చటం కాకుండా, ఆకలిని జయించటానికి ప్రయత్నించారు. పొగతాగి బతికే వాళ్ళని మన పూర్వ గ్రంథాలు చెపుతున్నాయి. "ఆ పద్ధతి ఏదన్నా వుంటే బాగుండును" అనిపించేది అతనికి.

కాని, వెంటనే మనం ఈ గడియ చచ్చినా చచ్చిపోవచ్చు గదా! యీ ఆరాటం మనకు ఎందుకు! అనిపించేది. వాళ్ళు చెప్పే నియమాలన్నీ పాటిస్తాం సర్వసంగ పరిత్యాగం చేస్తాం. మహారణ్యాల్లోకి పోయి ఘోరతపస్సు చేస్తాం. యీ పనంతా చెయ్యాలంటే కొన్ని సంవత్సరాలు పడుతుంది గదా! ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది గదా! యిన్ని అనుభవించి, ఫలితం పొందకుండా మరణిస్తే! యిన్ని సంవత్సరాలు బతుకుతామనే నిశ్చయం ఏమీ లేదయ్యే - ఈ లోగా ఏదో ఒకటి చెయ్యటానికి! ఏ సుఖమూ అనుభవించకుండా మరణిస్తే జీవితం వృథా అయిపోయనట్టేగా!

అతనికి పునర్జన్మలో నమ్మకం లేదు.

అప్పుడు అతనికి మరొక ఆలోచన తట్టేది. ఒక వంద సంవత్సరాలన్నా బతుకుతామనే గ్యారంటీ లేకపోతే యీ ప్రపంచంలో ఏమీ చెయ్యలేం. నువ్వు ఎప్పుడు చచ్చినా చావొచ్చు..... యిపుడు నాతో మాట్లాడుతూ చచ్చినా చావొచ్చు. కాని కొన్ని వందల సంవత్సరాలు బతుకుతావనే ఉద్దేశ్యంతో పని చెయ్యి అంటే యే తెలివిగల వాడికి చెయ్యబుద్ధి అవుతుంది?

ఎటు ఆలోచించినా, ఎంత లోతుకీ పార చూచినా .... "చచ్చేవరకు బతకటం తప్ప ఈ ప్రపంచంలో చేసేది ఏమీ లేదు" అనే నిశ్చయం అతనికి రూఢి అవుతూ వుండేది.

ఒక రోజు శీనయ్యని అడిగాడు.... "ఏం శీనయ్యా! నాలుగు రోజులు నుంచి ఎక్కడా కనబడటం లేదు!"

"నర్సారావుపేట వెళ్ళి వొచ్చానండీ!"

"ఎందుకు?"

"బండి మీద సామాను వేసుకు వెళ్ళాను."

పెళ్ళి కోసం అతను పడే కష్టం చూస్తే, సీతారామారావుక విచారం కలిగింది. శీనయ్య మనస్సుకి పెళ్ళి లేకుండా వుండటం, పిల్లలు కలగకుండా వుంటం, పని చెయ్యకుండా వుంటం అనే విచారణే రాదు...... అదృష్టవంతుడు...

“పెళ్ళి చేసుకుని ఏం చేస్తావు శీనయ్యా?”

అతనికీ ప్రశ్న అర్థం కాలేదు. తన తాత, ముత్తాత తాతా అంతా పెళ్ళి చేసుకున్నారు. తనూ చేసుకుంటాడు. తన పూర్వులు పిల్లల్ని కన్నారు. తనూ భగవంతుడి దయ వుంటే కంటాడు. తన పూర్వులు బతికారు. తనూ బతుకుతాడు. యిందులో “ఎందుకు?” అనే ప్రశ్నకు తావు లేదు. ఏం చేస్తావు? అనే ప్రశ్నే లేదు.

శీనయ్యకు యేమీ తోచక, అతన్ని చూస్తూ నుంచున్నాడు.

“పెళ్ళి చేసుకుని మళ్ళీ ఇక్కడకు వస్తావా శీనయ్యా?”

“రాను” ఖచ్చితంగా చెప్పాడు.

“ఎందుకని?”

“నాకిక్కడ ఏముంది? బందుగులూ అంతా ఆడే వున్నారు. కూలో నాలో చేసుకుంటే పొట్ట గడుస్తుంది.”

“మరి యిప్పుడెందుకు వచ్చావు.”

“ఆడ పొట్ట గడుస్తుంది గాని, డబ్బు మిగల్దు డబ్బు మిగుల్చుకు పోదామని వచ్చా.....”

వెళ్తాడు.... వెళ్ళి పిల్లల్నికని, కుటుంబయాత్ర సాగిస్తాడు, ఆ పిల్లలు ఎదిగి కూలో నాలో చేసుకుని బతుకుతారు. చచ్చేవరకూ చాకిరీ చేస్తూ ఎప్పుడో పుటిక్కిన రాలి పోతాడు. నిత్యం జరగవలసిన విషయాల్లో అతనికి “ఎందుకు?” అనే ప్రశ్నే రాదు. అలా జరుపుకుబోతూనే వుంటాడు.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

7 వ భాగం

ఏమీ తెలియని శీనయ్యా సుఖపడుతున్నాడు. అన్నీ తెలిసిన రామయ్య తాతా సుఖపడుతున్నాడు. మధ్య తనకు వొచ్చింది బాధ. అన్నం కోసం తాపత్రయ పడటం నీచం. అన్నీ తెలిసీ తెలియనట్టు బతకటం ఆత్మవంచన ... ఈ రెండూ తనకు పనికి రావు.

తాను ప్రయత్నించడు.... అన్నం తానంతట అది వచ్చి పడాలి. తను ప్రయత్నించడు. సుఖాలు వాటంతట అవే వచ్చి తన్ను ముసురుకోవాలి. కష్టాలు తన దగ్గరకు రాగూడదు. తను వూహించినవన్నీ జరగాలి. తను ప్రయత్నించడు.... ప్రయత్నించి నెరవేర్చుకోవటం కూడా గొప్పేనా? మూలన వున్న ముసలమ్మ చేస్తుంది ఆ పని. ఇక తన ప్రత్యేకత ఏముంది ఏ ప్రయత్నం లేకుండా అలా జరిగిపోవాలి జీవయాత్ర. లేకపోతే చస్తాం. అనేక కష్టాలు పడి చిల్లర విషయాలకు అనేక మందితో పోట్లాడి బ్రతికిందాని కంటే చస్తే యేం? ఆ పని మాత్రం మన చేతుల్లో వున్న పనే.

సీతారామారావు చెయ్యగలిగిన పనుల్లో ముఖ్యమైనది ఇదే!

-3-

"నాన్నా!" బయట నుంచి పరుగెత్తుకొచ్చి పిలిచింది పాప.

"ఊఁ" పలికాడు సీతారామారావు.

"నీ కోసం ఎవరో వచ్చారు."

"రానివ్వు."

"గదిలో కూర్చున్నారు."

"కూర్చోనివ్వు."

"రోజూ వస్తారే....."

"ఎవరు?" కుతూహలంగా అడిగాడు సీతారామారావు.

"మీ స్నేహితులు"

“స్నేహితులనే మాట వినేటప్పటికి సీతారామారావు గబగబా గదిలోకి వెళ్ళాడు.”

“సీతారామారావూ, స్నేహితులు మాట్లాడుకున్నారు.

“అసలు ప్రాణం అనేది ఎలా వచ్చింది?” అడిగాడు సీతారామారావు.

“అనాద పదార్థాలు రెండు - జడం, చేతనం” అన్నారొకరు.

“చైతన్యం ముఖ్యం. ప్రపంచాన్ని ఆడించేది అదే” అన్నారు ఒకరు.

“చైతన్యం శాశ్వతం. జడం పుడుతుంది. గిడుతుంది” అన్నారు మరొకరు.

“తప్పు, రెండూ అనాది పదార్థాలే” అన్నారు మొదటి వారు. “జడం రూపం మారుస్తూ వుంటుంది గనక అశాశ్వతంగా కనిపిస్తుంది గాని అదీ శాశ్వతమే? మనం మరణిస్తే శరీరాలు నశిస్తాయి. అంటే మట్టిలో కలుస్తుంది. మట్టిగా వుంటుంది. అందులోంచి మరొక రూపం పుట్టుకొస్తుంది.”

“శరీరానికి శవానికి భేదం ఏమిటి?” అడిగాడు సీతారామారావు.

“ఒకదానికి చేతనశక్తి వుంది? ఒక దానికి లేదు” అన్నారు ఒకరు.

“ఏమయింది?” అడిగాడు సీతారామారావు.

“శరీరాన్ని విడిచిపోయింది” అన్నారొకరు.

“ఎక్కడికి పోయింది”

“జీవాత్మ పరమాత్మలో కలిసింది”

“అయితే జడానికి సంబంధం లేకుండా, ప్రత్యేకంగా చైతన్యం వుండటానికి వీలుందనేనా?”

“ఎందుకు లేదు?” అన్నారొకరు.

“లేదు” అన్నారొకరు.

“అసలు చైతన్యం అనేది వేరుగా వుందని అనుకోవడం ఎందుకు?” అడిగాడు సీతారామారావు.

“లేకపోతే కదిలే వస్తువులు కదలకుండా ఎందుకు పోతయ్యో చెప్పలేం, మనిషి చావటం, బ్రతకటం ఎలా జరుగుతుందో చెప్పలేం....”

“కారు కదిలేటప్పుడు ఏ చేతనశక్తి ప్రవేశించింది? ఆగినప్పుడు ఏ చేతనశక్తి పోయింది?” అని అడిగాడు సీతారామారావు.

“మీరు అన్నది నిజం. మన వాళ్ళు చెప్పినవన్నీ పాత సిద్ధాంతాలు. తర్కానికి నిలవ్వు. పదార్థం అనుక్షణం పరిణామం పొందుతూ వుంటుంది. ఆ పరిణామాలలో ఒక దశలో ప్రాణం వచ్చింది. అంతేగానీ బయట నుంచి వచ్చిందీ లేదు, బయటకు పోయిందీ లేదు......” అన్నారు ఒకరు.

“ఎట్లా వచ్చిందీ?”

“కారుకి మల్లేనే... కొన్నిటి కలయిక వల్ల”

“ఈ కలయికకు కారణం వుందా?” అడిగాడు సీతారామారావు.

“లేదు” అన్నారు అంతా ఏకగ్రీవంగా సీతారామారావుగ్గాని, అతని స్నేహితులుగ్గాని భగవంతునిలో నమ్మకం లేదు.

“ప్రాణం ఒక ప్రయోజనాన్ని సాధించటానికి పుట్టిందా?”

“లేదు”

“ఎందుకు పుట్టింది?”

“నిర్నినిమిత్తం”

“నిర్నినిమిత్తంగా పుట్టి, పరిణామం చెందే దాని ఫలితం మనకు విదితం. అసలు దానికే ప్రయోజనం లేనప్పుడు మన జీవితానిక ఆదర్శం అనీ ప్రయోజనం అనీ ఎక్కడ నుంచి వస్తుంది. నిర్నిమిత్తంగా పుట్టం!” అని తేల్చేశాడు సీతారామారావు.

“కాదు, మానవుడిక ఆలోచించుకునే శక్తి, ముందుకు చూసే శక్తి వుంది. అందుకని తన జీవితానికి ఒక ఆదర్శం పెట్టుకొని, ప్రయోజన యుక్తంగా చేసుకుంటాడు” అన్నారు వకరు.

“ఎందుకు?”

“అంతా సుఖపట్టానికి”

“ఇప్పుడు మనం మాట్లాడిందాన్ని బట్టి సుఖం దుఃఖం అనేవి మానవ కల్పితాలే. కొన్ని ఉద్రేకాలకు ఆనందపడటం కొన్ని ఉద్రేకాలకు విచారించటం నేర్చుకున్నాం. మనం కావాలని తెచ్చి పెట్టుకునన వీటికి ఇంత ఆర్భాటం ఎందుకు?” అన్నాడు సీతారామారావు.

“అయితే ఏం చెయ్యమంటావు?”

“ఏదో ఒకటి చెయ్యమనాలని గానీ చెయ్యాలనిగానీ ఎక్కడుంది.”

“ఏమీ చెయ్యనక్కర్లేదని మాత్రం ఎక్కడుంది?” అని అడిగాడు వొకరు.

“లేదు” అన్నాడు సీతారామారావు.

“లేనప్పుడు ఏదో ఒకటి చెయ్యాలని, దురభిప్రాయ పడుతున్నాడు గనుక”

“మీరు నిరాశ వెదజల్లుతున్నారు” అన్నాడు వొకరు “అవును! మనిషికి పశువుకీ అదే భేదం. పశువుకి ఆశా లేదు - నిరాశా లేదు. మనిషికి రెండూ వున్నాయి” అన్నాడు సీతారామారావు.

“ఇంతకీ తేలింది ఏమిటి?”

“తేలటానికి ఏముంది? మనం నిర్నిమిత్తంగా పుట్టాం. నిర్నమిత్తంగా బ్రతకటానక వీలుంటే బ్రతకటం - లేకపోతే చావటం!” అని ముగించాడు సీతారామారావు.

అసమర్థుని మేనమామ

సీతారామారావు ఇంట్లో నుంచి బయటకు వొచ్చేటప్పటికి డ్రాయరు మీద కవరు వొకటి ఉంది. అది తన మేనమామ రాసిన ఉత్తరం అని గ్రహించుకున్నాడు. అంతకు ముందు వంద రూపాయలు కావాలని తను ఉత్తరం రాస్తే ఆయన జవాబివ్వలేదు దాని మీద అతనిక మండి ఇంకొక ఉత్తరం రాశాడు.

“నాకు వందరూపాయిలివ్వటం అంటే ఇప్పుడు నీకు కష్టంగా వుంది. ఒకప్పుడు నేను నీకు చేసిన సహాయం మరచిపోయినట్టున్నావు. నలభై వేల బాకీకి పది ఎకరాలు కట్టుకున్నాను. జ్ఞాపకం వుందా? నాకు మళ్ళీ ఒకప్పుడు డబ్బు కావలసి వస్తే ఆ పది ఎకరాలూ పదివేలకు నువ్వే కొనుక్కున్నావు. నువ్వు చేసిన పనులు నాకు తెలియక వూరుకోలేదు. పొలం అమ్మి పెట్టమని నేను నీకు ఉత్తరం రాస్తే ఎవ్వరూ మొగ్గి రావటం లేదనీ, ధరలు పడిపోయినయ్యనీ ఆ వంకా ఈ వంకా చెప్పి పదిహేను వందలు ఖరీదు చేసే ఎకరం, వెయ్యి రూపాయలకు కొనుక్కున్నావు - అన్నీ నాకు తెలుసు. ఎందుకులే, తింటే తిన్నాడులే, అని వూరుకున్నాను. నీకు యింత సహాయం చేసినా కాస్త విశ్వాసం అయినా చూపకపోయావు! నా డబ్బు ఇంత తిని, నాకు ఇబ్బందిగా ఉందని రాస్తే వంద రూపాయలు పంపటం నీకు కష్టంగా వుందా!

ఈ మధ్య మా ఇంటికి కుక్క వొచ్చింది. దానకీ నాకూ సంబంధం ఏమీ లేదు. ఏ జన్మలోనూ వుండి వుండదు. ఉంటే నీ ద్వారానే ఉండాలి. దానికి ఒక పూట అన్నం వేశాను. అప్పటి నుంచి అన్నం పెట్టినా పెట్టకపోయినా రోజూ వొస్తూ వుంటుంది. రాత్రి పూట ఇల్లు కాపలా కాస్తుంటుంది. కుక్క విశ్వాసం గల జంతువు.

నీకిచ్చిన డబ్బుకి ఎన్ని కుక్కలు వచ్చేవా? అని ఆలోచిస్తున్నా ప్రస్తుతం.''

ఇదీ మేనమామకి వ్రాసిన ఉత్తరం సారాంశం. ఆ ఉత్తరానికి మేనమామ రాసిన జవాబు ఆ కవరు. అది చూడగానే సీతారామారావు మిక్కిలి కుతూహలంతో తీసుకొని చించాడు. తన ఉత్తరంతో మేనమామకి బుద్ధి వచ్చ వుంటుందనుకున్నాడు. తను తెలివి తక్కువ వల్ల కాక మంచితనం వల్లే అతనికి సహాయం చేశానని తెలిసి వుంటుంది. ఇన్నాళ్ళూ మోసం చేశానని మురుసుకుంటూ వుండి వుంటాడు. తన ఉత్తరం అతని రోగం కుదిర్చి వుంటుంది, అనుకున్నాడు. క్షమించవలసిందని బతిమాలుతూ రాసి వుంటాడు, తప్పకుండా వంద రూపాయలు మనియార్డరు చేసి వుంటాడు, ఉత్తరం కంటే మనియార్డరు ఒక రోజు ఆలస్యంగా వస్తుంది.

ఇలా ఆలోచిస్తూ ఉత్తరం చదవటం మొదలు పెట్టాడు. ఉత్తరం చాలా పెద్ద ఉత్తరం మేనమామ ఇలా రాశాడు.

''నాయనా! నీ ఉత్తరం అందింది. ఇంతకు పూర్వం నువ్వు వంద రూపాయల కోసం వ్రాసిన ఉత్తరం కూడా అందింది. నీకు వంద రూపాయలు పంపటం ఇష్టం లేకపోవటం వల్ల, జవాబు వ్రాయటం అనవసరం అని వూరుకున్నాను. నీ రెండో ఉత్తరం ఇవాళే అందింది. నీ మనస్సులో వున్న ఉద్దేశాలు బయటకు వచ్చినందుకు చాలా సంతోషించాను. నా మనస్సులో వున్న ఉద్దేశాలను చెప్పుకోటానికి అవకాశం ఇచ్చావు.

నేను నీ విషయం చాలా రోజుల నుంచి కనిపెడుతూనే వున్నాను. నీ తండ్రి, తాత విషయం కూడా నేను పూర్తిగా ఎరుగుదును. మొత్తం మీద మీ కుటుంబంలో ఒక దుర్గుణము వుంది. మీది ప్రత్యేక సృష్టి అనీ, మిగిలిన వాళ్ళ కంటే గొప్ప వాళ్ళమనీ అనుకుంటుంటారు. పది మంది చేత పొగిడించుకోవాలనే వాంఛ మీ అందరికీ వుంది.

ఆ వాంఛ తీర్చుకోటానికి నీ కుటుంబం కొన్ని మంచి పనులు కొన్నిచెడుపనులూ చేసింది.

మీ దాతృత్వం వల్ల కొంత మందికి లాభించినా, మీ స్వాతిశయం వల్ల కొంత మంది ఎంత బాధపడేవారో మీకు తెలియదు. నీ చిన్నతనంలో నీ తల్లి వున్నప్పుడు నేను మీ ఇంట్లో ఉండే వాణ్ని. ఆస్తిపాస్తులు లెక్క చూసుకోవటం, జమా ఖర్చులు చూచుకోవటం, పొలం వెళ్ళి వ్యవసాయం చేయించుకోవటం, అజమాయిషీ కనుక్కోవటం మీ నాన్నకు తాను చేయవలసిన పనులుగా కనపడేవి కాదు. కొందరు కష్టపడటానికీ కొందరు సుఖపడటానికీ జీవితములో ఆనందముగా అనుభవించటానికి పుట్టారని మీ నాన్న అభిప్రాయము. మేము ఇటు వంటి పనికి

బాగా పనికి వస్తాము అనే నమ్మకముతో నన్ను పిలిపించి మేనేజిమెంటు ఒప్పచెప్పాడు.

మేము మీ ఇంట్లో అడుగు పెట్టినప్పటి నుంచీ పడిన బాధలూ అనుభవించిన కష్టాలూ ఇతర్లకు తెలియవు. అప్పుడు మేము, అంటే మా కుటుంబం, కొద్దిగా చిక్కుల్లో వుండటం వల్ల, నా చెల్లెల్ని వివాహము చేసుకోవటము వల్లే నీ తండ్రి ఔదార్యం

చూపాడనీ ఇక నన్ను తీసుకు వచ్చి ఇంట్లో పెట్టుకొని పోషించటము ఆయనకే తగిందనీ ఇతర్లు అనుకునే వారు. కాని, మీ ఇంటిలో నేను పడ్డ సుఖము చచ్చి ఏ స్వర్గాన ఉందో నీ తల్లి - ఆమెకు తెలుసు.

మమ్మల్ని నీ తండ్రి ఎన్నడూ తనతో సమానంగా చూచేవాడు కాదు. మేము ఆయన కళ్ళకు ఎప్పుడూ పరాయి వాళ్ళంగానూ, తక్కువ వాళ్ళంగానూ, ఆయన మంచి మీద బ్రతుకుతున్న వాళ్ళంగానూ, నౌకర్లంగానూ కనిపించే వాళ్లం. ఒక మాటతో, ఒక చూపుతో మేము తక్కువ వాళ్ళము అనే విషయం ఆయన అనుక్షణం జ్ఞాపకం చేస్తూనే ఉండే వాడు. అవన్నీ ఆయన తెలిసి చేశాడని నేను అనను. "నా వంశం" అనే అహంకారం ఆయనలో జీర్ణించుకుపోయి తెలియకుండానే చేశాడు. ఎట్లా చేస్తే ఏమి? పర్యవసానం గదా ముఖ్యం? పర్యవసానం రీత్యా మేము బాధపట్టమే.

ఒక్కసారయినా తన సహపంక్తిని నన్ను భోజనము చెయ్యనిచ్చాడేమో మీ వాళ్ళని అడుగు. అనేక మంది చుట్టాలు వస్తుండే వాళ్ళు వాళ్ళతో కూర్చొని సరదాగా మాటలు చెప్పుకుంటూ అన్నం తినే ప్రాప్తం నాకు ఎప్పుడూ లేదు. అప్పుడప్పుడూ నేనే వాళ్ళకు అన్నం వొడ్డించవలసి వచ్చేది. నేను పళ్ళెం తీసుకోగానే "చేతులు కడుక్కున్నావా?" అని అడిగేవాడు మీ నాన్న - ఆ మాటలో, ఆ మాట అడుగుతూ చూసే చూపులో ఎంత విషం, ఎంత అహంకారం, ఎంత పురుషత్వం ఉండేది? నా వళ్ళు భగ్గున భగభగమండేది. ఆ పళ్ళెం విసిరి పుచ్చుకొని మొహాన కొట్టి వెళ్ళిపోదామనిపించేది.

మీ వాళ్ళంతా అన్నాలు ముగించుకొనే వరకూ మేము అన్నం తినే ప్రాప్తం లేదు. మీ వాళ్ళ భోజనాలయిం తరువాత మీ మేనత్త కూడా భోజనం చేసింతర్వాత, వాళ్లందరికీ తమలపాకులు ఇచ్చి, అప్పుడు వచ్చేది నా చెల్లెలు, నన్ను పిలవడానికీ, ఏదో దొంగతనం చేస్తున్నట్టు భయపడుతూ "రా అన్నయ్యా" అని పిలుచుకుపోయి అన్నం పెట్టితే, దాని ఇంట్లోనే అది దొంగ కావలసిన కర్మం పట్టింది.

నేను మామూలుగా కంచంలో తినే వాణ్ని. ఒక రోజు ఎందుకనో విస్తరిలో వడ్డించింది మీ అమ్మ, మీ నాన్న చూచి "విస్తరి కావలసి వచ్చిందే యిక్కడికి వచ్చేటప్పటికి?" అన్నాడు. ఆ రోజు మీ అమ్మ ఎంత ఏడ్చిందో నీకేం తెలుసు? "మనం వెళ్దాం అన్నయ్యా" అని కుళ్లి కుళ్ళి ఏడ్చింది.

నేనే ఇతరులకు తెలిస్తే నవ్వుతారని ఊరుకోబెట్టాను.

అది మీ ఇంట్లో ఏం సుఖపడ్డది?

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

8 వ భాగం

అది ఏ రోజయినా పరిశుభ్రంగా వుంటే, “మా ఇంటికి వచ్చి ఎన్ని నేర్చుకున్నావే? పులిని చూచి నక్క వాత పెట్టుకొని, పుచ్చి చచ్చిందట” అంది నీ మేనత్త.

పనిపాటలు చేసి మురికిగా వుంటే “పుట్టుకతో రావాలిగాని, నేర్చుకుంటే వస్తయ్యా?” అనేది మీ మేనత్త.

తన ఇంట్లో తానే పరాయిదానికి మల్లే బతికింది నా చెల్లెలు - బతికిన నాలుగు రోజులు! బిచ్చగాడికి బిచ్చం వెయ్యటానికి గానీ, ఎవ్వరికైనా అన్నం పెట్టటానికి గానీ దాని ఇంట్లోనే దానికి చొరవలేదు. కూరలు యేమి వండవలసిందీ నీ మేనత్తను అడిగి వండవలసిందే. నీ మేనత్త ఎటువంటిదో నీకు తెలుసుగా! అయినా ఆవిడనని ఏం ప్రయోజనం? మీ వంశంలో అందరికీ వున్న గుణమే ఆవిడకీ వుంది.

ఆవిడకీ, ఆవిడ భర్తకీ తగాదా ఎందుకొచ్చిందో నీకు తెలుసా? దానిక మీ నాన్నే కారణం, “నా కుటుంబం గొప్పది, నీ కుటుంబం ఎందుకూ పనికి మాలింది, నీకిచ్చి నా గొంతు కోశారు.” అని ఎప్పుడూ నానా మాటలు అంటూ వుండేదట భర్తని. అతను యేం చెప్పినా చేసేది కాదట. “నేనెప్పుడయినా మా ఇంట్లో పని చేసి ఎరుగుదునా?” అనేదట. మాట్లాడితే అలిగి మీ ఇంటికొచ్చి కూర్చునేదట. అతడు యేమన్నా అంటే వొచ్చి మీ నాన్నకి చెప్పేది. మీ నాన్న వెళ్ళి అతణ్ని నానా దుర్భాలాషలూ ఆడి వచ్చేవాడు.

ఆ రోజుల్లో అతనిక మీ మేనత్తతో మాట్లాడుతున్నా, పోట్లాడుతున్నా మీ నాన్నతో మాట్లాడుతున్నట్లూ, మీ నాన్నతో పోట్లాడుతున్నట్లూ ఉండేదట! అప్పుడప్పుడూ పొరపాటున ఆమెను మీ నాన్న పేరే పెట్టి పిలిచేవాడట! అతను విసిగిపోయాడు, మీ మేనత్తతో కాపరం చెయ్యలేకపోయాడు.

ఒక రోజు మీ నాన్న తిడుతుంటే ఉండబట్టలేక - “నేను పెళ్లి చేసుకుంది నిన్నా, మీ చెల్లెలినా?” అని అడిగేశాడు.

“నోరుముయ్” అని గదమాయించాడు మీ నాన్న.

“ముందు చెప్పు. ఈ విషయం ఇవ్వాళ తేలవలసిందే. నేను ఎవరితో కాపరం చెయ్యాలో స్పష్టంగా తేలాలి?” అని నిగ్గతీశాడు. నీ మేనత్త మొగుడు.

“నువ్వు ఎవ్వరితోనూ చెయ్యక్కర్లేదు” అన్నాడు మీ నాన్న.

“ఎందుకని?”

"నువ్వు ఎవర్నీ పెళ్లి చేసుకోలేదు" అన్నాడు మీ నాన్న.

"నీ చెల్లెల్ని చేసుకుంది ఎవరు?"

"ఒక్క నీ చెల్లెల్తోనే పోనివ్వకు. నీవు, నీ పితామహులు, నీ అహంకారం అన్నీ కలిపి నన్ను పెళ్ళి చేసుకొని, భూతాలయి నన్ను వేపుకు తింటున్నాయ్. నా ప్రాణాలు తీస్తున్నాయి" అని అరిచాడు నీ మేనత్త మొగుడు.

అక్కడితో మీ నాన్న అనరాని మాటలన్నీ అని "నా చెల్లెలు నా దగ్గరే వుంటుంది" అని నీ మేనత్తను తీసుకు వచ్చాడు. తర్వాత కార్పణ్యాలు పెరిగినయి. మళ్ళీ వాళ్ళు కలవటానికి నీ వంశ గౌరవమే అడ్డొచ్చింది.

తన వంశం మీద ఇంత దురభిమానం వున్న ఆడవాళ్ళు ఎక్కడయినా కాపరం చేస్తారా నాయనా? వంశపారంపర్యంగా వచ్చే ఆచారాలు, అలవాట్లు, అభిరుచులు, భావాలు అన్ని కుటుంబాలలోనూ ఒకే రకంగా ఉండమంటే ఎట్లా వుంటాయి? ఎదుట వాళ్ళ భావాలంటే సానుభూతి వుంటే కుదురుతుంది గాని, వాళ్ళ సంస్కారం భిన్నంగా వుంది గనక, వాళ్ళని నీచంగా చూస్తూంటే ఇద్దరు వ్యక్తులు కలిసి ఎన్నాళ్ళు కాపురం చెయ్యగలరు?"

నీ మేనత్తగతి యింతే అయింది. భర్తని విడిచిపెట్టినప్పటి నుంచి మీ యింట్లోనే ఉండేది. చిన్నప్పుడే భర్త వొదిలి పెట్టడం మూలాన, కోర్కెలు తీరక కోపం, అసూయ, ద్వేషం పెంచుకొని ఎప్పుడూ రుసరుసలాడుతూ వుండేది. ప్రతి వాళ్లతోనూ గిల్లి కజ్జా పెట్టుకుంటూ ఉండేది. మేమేమీ అనకపోయినా, మేం ఎంత వొదిగి వొదిగి బతుకుతున్నా, మీ నాన్నతో ఎప్పుడూ ఏవేవో కొండాలు మా మీద చెపుతూనే వుండేది. మీ నాన్న వచ్చి మా మీద ఆవులు చేసే వారు. ఆవులు చేసినా ఫరవాలేదు. తప్పు చేస్తే - పెద్ద వాడు తాను ఏం చేసినా చెయ్యొచ్చు మేము పడవచ్చు. కానీ, ఆయన ఎంతసేపూ... "నా చెల్లెలికి మీరు ఎదురు చెపుతారా?" అనే అనేది. తన చెల్లెలు. తను పుట్టిన వంశంలో పుట్టింది కనక గొప్పది. మేము పరాయి వాళ్ళం. పరాయి వంశంలో పుట్టాం కాబట్టి తక్కువ వాళ్ళం. ఆమెను మేం ఏమీ అనగూడదు. అనటం మీ వంతు, పడటం మా వంతు!

ఇలా బతికాం మీ యింట్లో, చివరిక నువ్వు మీ అమ్మ కడుపున పడ్డావు! మీ అమ్మ దిగులు తీరింది. మీ అమ్మకు మళ్ళీ పూర్వపు కళాకాంతులు వచ్చినయ్. తన కష్టాలన్నీ మరిచిపోయింది. నువ్వు పుట్టింతర్వాత ఆమె మళ్ళీ కొత్త జన్మ ఎత్తినట్లు కనిపించేది. కాని నువ్వు పెరిగి వస్తున్న కొద్దీ మీ అమ్మకు మళ్ళీ విచారం ప్రారంభం అయింది. ఒక రోజు నాతో "వాడు మన వంటి వాడు కాదు అన్నాయి. అన్నీ వాళ్ళ నాన్న పోలికలే!" అని కన్నీరు పెట్టుకుంది.

ఆమె ఆ మాట అన్న తర్వాత నేను నిన్ను శ్రద్ధగా పరిశీలించాము. ఆమె అన్నమాట నిజమే! నీలో అన్నీ మీ నాన్న లక్షణాలే కనిపించినాయి. అంత చిన్నతనంలో కూడా నువ్వు మీ నాన్నని అనుకరించటానికి ప్రయత్నిస్తూ వుండే వాడివి. కుర్చీ ఎక్కి మీ నాన్న కూర్చున్నట్టు కూర్చొని కాలు ఆడిస్తూ వుండే వాడివి. ఇంట్లోకి వచ్చి మమ్మల్ని మీ నాన్నకు మల్లే ఆవులు చేస్తూ వుండే వాడివి.

ఒక్కొక్కప్పుడు మీ నాన్న పిచ్చి చూపులు చూస్తూండే వాడు. ఎప్పుడో ఆకస్మాత్తుగా ఒక్క క్షణం నీకూ ఆ చూపులే వచ్చేవి. మీ నాన్నకు - మాట్లాడుతూ మధ్య మధ్య మీసం కుడిచేత్తో దువ్వే అలవాటు ఉండేది. అంత చిన్నతనంలో నువ్వూ అలాగే చేస్తూండేవాడివి. మీ వాళ్ళంతా నిన్ను చూచుకొని మురుసుకుంటూ వుండే వాళ్ళు. "పులి కడుపున పిల్లిపిల్ల పుడుతుందా?"

అని

మీ నాన్న నిన్ను చూచి గర్వంగా మీసం దువ్వేవాడు.

"అచ్చంగా వాళ్ళ నాన్నే అన్నాయి...." అని నాతో చాటుగా చెప్పుకొని నీ తల్లి కన్నీరు పెట్టుకునేది.

అక్షరాలా ఆమె భయపడినట్లే జరిగింది. తల్లి గనక రాబోయే అపాయాన్ని ముందే పసిగట్టింది. ఆమె అదృష్టవంతురాలు. నీవు పెద్ద వాడయిం తర్వాత నీ జీవితం చూచి బాధపడకుండా దాటిపోయింది. నేను వచ్చేశాను.

నీకొక అనుమానం రావొచ్చు. మీ యింట్లో అంత కష్టంగా వున్నప్పుడు నేను అన్నాళ్ళు ఎందుకు ఉండవలసి వచ్చిందా! అని, నా చెల్లెలు కోసం వున్నాను. మీ యింటి పరిస్థితి చూచిం తర్వాత, దాన్ని విడిచి వుండటం ప్రమాదం అని బోధపడింది. నేను ఆమెతో పాటు మీ ఇంట్లో వుండకపోతే, ఆమె ఎక్కువ రోజులు బతికేది కాదు. అందుకని అది ఉన్నంతవరకూ అన్ని అవమానాలూ సహించి అంటిపెట్టుకున్నాను.

అనేకసార్లు మీ నాన్న చేతుల్లో, మీ మేనత్త చేతుల్లో నేను పడుతున్న అనుమానాలు చూచి, "నువ్వు వెళ్లిపో అన్నాయీ, ఇక్కడ ఉండొద్దు" అని బతిమాలేది నా చెల్లెలు.

"మరి నువ్వో అమ్మా!"

"నాకు తప్పదు."

"నువ్వు ఉన్నన్నాళ్ళూ నాకూ తప్పదు అనుకుంటా అమ్మా!" అనే వాణ్ని.

నేను మీ యింట్లో ఉండటం నా కంటే మీ కుటుంబానికే ఎక్కువ లాభం. నేను అహర్నిశలూ మీ పొలం మీద పని చేశాను, చేయించాను. బాకీలు ఒక్క దమ్మిడీ పోకుండా వసూలు చేశాను.

కాని ఏం లాభం? ఒక పక్క నేను రొమ్ములు పగలగొట్టుకొని డబ్బు కూడబెడు తుంటే, మీ నాన్న కాలు మీద కాలు వేసుకొని తన చిత్తం వచ్చినట్లు ఖర్చు పెట్టే వాడు నాకు అప్పుడప్పుడూ అనిపిస్తూ ఉండేది - "నాకు ఎందుకు వచ్చిన శ్రమ ఇది?" అని, "నేను ఎవరి కోసం కష్టపడుతున్నట్లు? అప్పుడు నా మనసు మారింది...

ఇదంతా పాత చరిత్ర. ఇక నీ ఉత్తరంలోని విషయాలకు వస్తాను....

ప్రస్తుత విషయాలను అర్థం చేసుకోవటానికి ఉపయోగపడుతుందని పాత చరిత్ర చెప్పవలసి వచ్చింది. వేరే ఉద్దేశ్యం ఏమీ లేదు.

నేను దూరంగా వున్నా, మీ నాన్న చచ్చిపోయిం తర్వాత నీ ప్రవర్తన ఒక కంట కనిపెడుతూనే వున్నాను. నీవు నీ చుట్టూ

చేర్చుకున్న వాళ్ళని బట్టి పేరు కోసం నువ్వు పడే తాపత్రయాన్ని బట్టి, ఆస్తి యేమీ మిగలదని తేల్చుకున్నాను. ఆస్తి ఎట్లాగూ మిగల్చని వానికి అప్పు వడ్డీతో సహా ఇచ్చినందువల్ల ప్రయోజనం యేమిటి? నేనే దండగ పట్టం తప్ప? మీ నాన్న ఉండగా ఒకసారి ఇటువంటి పొరపాటు చేశాను కాబట్టి, ఈ సారి ముందే జాగ్రత్తపడ్డాను. నిన్ను పిల్చుకొని బాకీ పరిష్కారం చేసుకున్నా, అప్పుడు ఏం జరిగిందీ, ఎలా జరిగిందీ నీకు తెలిసిన

విషయమే.

నువ్వు మాత్రం నేను అనుకున్నట్లుగానే, నీ తండ్రికి మల్లేనే నలభై వేలు చేసే పొలం పదివేలకు కట్టుకొని, నీ వంశ గౌరవం నిలబెట్టావు. ఈ చుట్టు ప్రక్కల అందరి చేతా పొగడ్తలు పొందావు.

కాని, నేను మాత్రం పది ఎకరాలు ఊరికే దానం చేసినట్లే భావించుకున్నాను. నువ్వు వ్రాసిన ఉత్తరంలో నలభైవేలకు గాను పది ఎకరాలు కట్టుకుని నాకేమిటో సహాయం చేశానని వ్రాశావు. నీవు కొంచెం జ్ఞాపకం తెచ్చుకుంటే, ఆ బేరంతో నీవు నష్టపడ్డావో, నేను నష్టపడ్డానో నీకే తెలుస్తుంది. ఆ రోజు మీ అత్త పిచ్చిదై నోరు జారింది గాని, లేకపోతే నీ వంశ గౌరవం నిలబెట్టటానికి ఏమీ యివ్వకుండానే చెల్లబెట్టే వాడ్ని. ఆ రోజే ఈ సహాయం పరాయి వాళ్ళకయినా చేస్తానని చెప్పావు. సంపాదించుకొనే అవకాశం లేకపోయినా చేస్తానన్నావు, ఇక నీవు నాకు చేసిన సహాయం ఏమిటి నాయనా? సహాయం చెయ్యటం నీకు వ్యసనం. నష్టపడుతూ యితరులకు సహాయం చేస్తున్నాననే ఆనందం కోసం చేస్తున్నట్టు నీ మాటలే స్పష్టపడుతున్నాయి. నీవు ఈ ఆనందం పొందటానికి నన్ను ఉపయోగించుకున్నావు. నీకు ఆనందం కలగటానికి నన్ను ఉపయోగించుకొని ఇప్పుడు "నీ కోసం అని చేసాను! నీకు విశ్వాసం లేదు" అని నన్ను నిందించటంలో అర్థం వుందా?

అదీకాక, ఒక ముఖ్యమైన సంగతి మనం విచారించవలసి వుంది. ఈ నలభై వేలు ఎవరివో తెలుసా? నీవు సంపాదించింది కాదు. నీ తండ్రి సంపాదించింది కాదు. మాది, నా చెల్లెలు వివాహానికి ఇచ్చిన డబ్బు వడ్డీ పెరిగి యింత అయింది. ఆమె వెళ్ళిపోయింది. మా డబ్బు మా దగ్గరే వుంది. ఇక నువ్వు ఇచ్చింది ఎక్కడ. నేను పుచ్చుకుంది ఎక్కడ? మేనల్లుడనని, పైగా నేనే నీకు పది ఎకరాలిచ్చాను. నా తల్లి డబ్బు నాది కాదా అంటావా? నీవే? ఆ డబ్బు దుర్వినియోగం చెయ్యకపోతే! నువ్వు వుంచుకోని పక్షంలో, అసలు మాది గనక వుంటమే న్యాయం అందులో ఈ డబ్బు మీ డబ్బు వంటిది కాదు నాయనా, కష్టార్జితం. చెమట వోడ్చి, తెలివి ఉపయోగించిన డబ్బు.

బాబూ! ఈ మధ్య నీ మామ వచ్చాడు. నీ పరిస్థితి, నీ ప్రవర్తనా విపులంగా చెప్పాడు. నీ మీద ఎలాంటి ఆశ పెట్టుకోవద్దనీ, నీవు లేనట్టుగానే ప్రవర్తించవలసిందనీ జవాబు చెప్పాను. ఆయన కూడా నీ సంగతి ఆలోచించటం లేదు. నీ దగ్గర వుంటే పిల్లలు కూడా చెడిపోతారేమో అని, భయపడుతున్నాడు. కాని పాపం యేం చేస్తాడు? పిల్లలను తీసుకొని వచ్చెయ్యమని చెపితే కూతురు వప్పుకోలేదట!

ఈ ప్రపంచంలోని విచిత్రాల్లో యిదొకటి, మంచి ఆడవాళ్ళు నీలాంటి పురుషుల భార్యలే అవుతారు. ఒడుదుడుకుల జీవితంలో వున్న ఆనందం, సాఫీగా జరగడంలో వుండదు కాబోలు? వాళ్ళ నాన్న చెప్పిందంతా విని, "నిజమే నాన్నా, నేను కాని వచ్చేస్తే ఆయన పని మరీ అధ్వాన్నం అవుతుంది. ఎట్లా జరగవలసిందో అట్లా జరగనివ్వు నాన్నా!" అన్నదట నీ భార్య.

"ఎందుకమ్మా నీకింత అభిమానం? అతను సుఖపడడు. ఇతరులను సుఖపడనివ్వడు" అన్నాడట మీ మామ.

"ఆయన చాలా గొప్పవాడు నాన్నా! గొప్ప వాళ్ళ జీవితాల్నీ అంతే, వాళ్ళని మామూలు మానవుల్ని కొలిచే బద్ధతో కొలిస్తే అర్థం కాదు" అన్నదట నీ భార్య.

చూశావా? నీవు గొప్పవాడవట! నువ్వు నమ్మగలవా ఈ మాట.

ఏం లాభం, నీలాంటి వాళ్ళ భార్యలు లేచిపోరు. నీలాంటి భర్తలు భార్యలను నీచంగా చూస్తారు. అందువల్ల వాళ్ళకు ఆత్మ విశ్వాసం ఛస్తుంది. భర్తలను సుఖపెట్టడానికి ప్రయత్నించటమే వాళ్ళకు జీవిత పరమావధి అవుతుంది. బానిస బ్రతుకుతో తృప్తిపడతారు.

భర్తల వల్ల సుఖపడే భార్యల దృష్టి వేరు. వాళ్ళకి తమ మీద తమకు చాలా సదభిప్రాయం ఏర్పడుతుంది. తమకు ఏ కష్టం కలిగినా తప్పు తమదే అనుకుంటారు. మరొకరైతే తమను ఎంత సుఖపెట్టేది ఊహించుకుంటారు. లేచిపోతారు.

కాని మనకు లేచిపోవడం తప్పు, బానిస బ్రతుకు బ్రతకటం గొప్ప. నీ భార్య నిన్ను విడిచి పెట్టదు. జీవిత పర్యంతం నీ చేతుల్లో కష్టాలనుభవిస్తూ నీతోనే ఉంటుంది. నీ గొప్పతనం చాటుతూ వుంటుంది. నేను నిన్ను విడిచి వూరుకున్నట్లే వాళ్ల నాన్న ఆమెను విడిచి వూరుకున్నాడు......

నాయనా, నా దగ్గర డబ్బు వుంది. కాని నేను ఇవ్వను. అసలు నీకు డబ్బు ఎందుకు. ముష్టి డబ్బు. డబ్బు లేకుండా వంశ గౌరవం నిలబెట్టలేవూ? మేము డబ్బు మనుషులం, మీరు కీర్తి మనుషులు. మీరు డబ్బు లేక పోయినా కీర్తి మీద బతకగలరు. మాకది లేకపోతే జీవితమే లేదు.

కుక్క విశ్వాసం గల జంతువు - అని వ్రాశావు. కుక్కలు అంతే.

నీకింకా అనుభవం తక్కువ. అందుకనే పెద్దలు "కుక్కబుద్ధి" అంటారు. చూస్తూ చూస్తూ కుక్క అనటానికి ఎవరు ఒప్పుకుంటారు?" అందులో నేను! మీ యింట్లో అన్నాళ్ళుండి, మీ నుంచి అంత జ్ఞానాన్ని పొంది, అటు వంటి పొరపాటు పని చేస్తానా? చెయ్యను.

నాయనా, ఎవరి బలహీనతలకు, ఎవరి అజ్ఞానానికి వాళ్ళే బాధలు పడాలి. నీ చర్యల ఫలితం నువ్వే అనుభవించాలి. ఇతరులను నిందించిన ప్రయోజనం ఏముంది? ఒకళ్లను చూచి ఈర్ష్యపడటం, నీ కష్టాలకు యితరుల సంకుచిత స్వభావం కారణం అనుకోవటం! నీ బలహీనతలను, నీ పొరపాట్లను సమర్థించుకోవటానికి కారణాలు వెతకటం, నీ అసమర్థత మూలంగా వొచ్చిన కోపానికి యితరులను గురి చెయ్యటం, నీ బోటి చదువుకున్నవాడు, విశాల హృదయుడు, కీర్తికాముడు చెయ్యవలసిన పని కాదు. నీ వంశప్రతిష్ఠకు, నీ కుటుంబ గౌరవానికి భంగం.

జీవిత ప్రవాహం ప్రచండ వేగంతో వెళ్ళిపోతూ వుంది. అందులో ఎవరెవరి సంస్కారాన్ని బట్టి వాళ్ళు తమ సుఖం కోసం పోట్లాడుకుంటున్నారు. ఇవొక మహా సంగ్రామం.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

9 వ భాగం

ఈ సంగ్రామంలో పిరికి వాళ్లకు, అసమర్థులకు చోటు లేదు.

టిక్కెట్లు యిచ్చే కిటికీ దగ్గర జనం విరగబడి - నేను ముందు టిక్కెట్టు తెచ్చుకోవాలంటే, నేను ముందు తెచ్చుకోవాలని త్రొక్కిసలాడుతూ వుంటారు చూడు - జీవిత సంగ్రామాన్ని తలుచుకున్నప్పుడల్లా ఆ దృశ్యం కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది నాకు, ప్రతివాడూ తను ముందు టిక్కెట్టు తెచ్చుకోవాలని తాపత్రయపడే వాడే గాని, మిగిలిన వాళ్ళ సంగతి ఏ ఒక్కడూ ఆలోచించడు.

కాళ్ళు నలుగుతాయ్, చొక్కాలు చిరుగుతాయ్, ఒక్కడూ ఇలా చెయ్యటం తప్పనుకోడు. చేయించుకోవటం అవమానం అనుకోడు. ప్రతి వాడి దృష్టి టిక్కెట్టు మీదే! ఒకడు ఇనపపాదాలతో వొస్తాడు. జనాన్ని కసాపిసా తొక్కుకుంటూ కిటికీ దగ్గరకు వెళ్తాడు. అందరికంటే వెనుక వచ్చినా, అందరి కంటే ముందే టిక్కెట్టు తెచ్చుకుంటాడు.

అసమర్థులు, భీరువులు, ఆ సంఘర్షణలోకి దిగలేక దూరంగా నిలబడి చూస్తూ వుంటారు. వాళ్ళూ రైలుకి వెళ్లవలసిన వాళ్లే. వాళ్ళకూ టిక్కెట్టు కావలసిందే. కాని, అందుకు ప్రయత్నించలేరు. పైగా టిక్కెట్టు కోసం తాపత్రయపడే వాళ్ళను చూచి, "నీచులు", "స్వార్థపరులు" "మోసగాళ్ళు" అని ఏమేమో అనుకొని తృప్తిపడతారు.

వాళ్ళు ఎవరన్నా గానీ, వాళ్ల స్వభావం ఎటువంటిదైనా గానీ, టిక్కెట్టు దొరికేది వాళ్ళకే. రైలు అందేదీ వాళ్ళకే. రైలుకు వెళ్ళటం ముఖ్యం అయినప్పుడు అందుకు అవసరం అయిన పనులన్నీ చెయ్యవలసిందే. ఆ పనులన్నీ మంచి పనులే అవుతాయి. అలా చెయ్యవలసిందే వాళ్ళు, వొచ్చే పొయ్యే వాళ్ళని చూస్తూ, టిక్కెట్టు తెచ్చుకునే వాళ్ళని చూచి ఈర్ష్యపడుతూ, రైలు వాళ్లని విమర్శిస్తూ, అలా నుంచోవలసిందే!

తమ ఉన్నతభావాలు తమకుంటే, రైలు దారిన రైలు వెళ్తుంది. నాయనా, పెద్ద వాణ్ణి - చెపుతున్నాను - ఇక నాకు ఉత్తరాలు రాయవద్దు. నీ తెలివితేటలు ఉపయోగపడే చోటు చూసుకో!"

ఉత్తరం చదువుకునేటప్పటికి సీతారామారావుకి అయోమయం అయింది. ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్టు అనిపించింది. ఇంకొకసారి ఆ ఉత్తరం వంక చూట్టానికే భయం వేసింది. ప్రతి అక్షరం బాకై అతని హృదయంలో గుచ్చుకొని బాధపెట్టింది. తన మేనమామ తనంటే ఎంతో ప్రేమగా అభిమానం చూపుతూ వుండే వాడే! ఆ ప్రేమా, అభిమానం వొట్టి నటనేనా? ఇన్నాళ్ళూ ఎంత విషం హృదయంలో పెట్టుకొని దాచ గలిగాడు తన మేనమామ!

అసలు మనుష్యులంతా ఇంతేనా? తన్ను పొగిడే వాళ్ళు, తనతో స్నేహం చేసే వాళ్లు, తనంటే లోపల ఒకటి పెట్టుకొని, పైకి వేరు విధంగా నటించే వాళ్ళేనా? ఇక ఎవరిని నమ్మేట్టు? ఎవరి మాట నిజం అనుకునేటట్టు?

ఒకసారి తను తన మేనమామ ఇంటి వద్ద వుండగా ఒక సంఘటన జరిగింది. అప్పటికే

అతను ఆర్థికంగా ఇబ్బందిపడి, మామ యివ్వవలసిన బాకీ క్రింద ఎకరాలు కట్టుకున్నందుకు పశ్చాత్తాప పడుతున్నాడు. అప్పటికే కొంత మంది తన్ను చాటు మాటుగా అసమర్థుని క్రింద జమకట్టి, హేళన చేస్తున్నారని తెలుసుకుంటున్నాడు. ఆ సందర్భంలో, ఆ మాటా, ఈ మాటా మాట్లాడుతూ "మీకు రాసి ఇచ్చింది ఉత్తరపొలం, మురుగు తగుల్తుంది. ఎకరానికి ఏ రెండు వందలైనా ఖర్చు పెడితే గాని బాగుపడదు... దక్షిణపు పొలం బంగారం తునక" అన్నాడు వాళ్ళ మామ శూద్ర నౌకరు.

అతనికి ఈ సంగతి తెలిసేటప్పటికి కష్టం వేసింది. మాట వరుసకైనా తన మేనమామ ఈ మాట తనతో ఎప్పుడూ అనలేదు. ఆయనకు తను ఎంతో సహాయం చేశాడు గదా! తన్ను మోసం చెయ్యాలని చూస్తాడా? అని ఆలోచించాడు.

మామయ్య రైతు గదా, ఇన్నాళ్ళూ పొలం మరామత్తు చేయించకుండా ఎందుకు వూరుకున్నాడు?" అని అడిగాడు. శూద్రనౌకర్ని, "ఏమోనండి. మిగిలిన పొలం అంటే పసిపిల్లని చూసినట్టు చూసేవారు. ఈ పొలం మాట ఎత్తేటప్పటికి కస్సుమని లేచే వారు!"

అతని కోసం  త్యాగానికి సిద్ధపడితే ఎంత నీచంగా ఆలోచించాడు. తన మేనమామ అనుకున్నాడు సీతారామారావు.

ఆ సాయంకాలం ఆ వూరి కరణం కలిశాడు. కరణానికీ, తన మేనమామకీ పచ్చి గడ్డి వేస్తే భగ్గున మండే అంత వైరం. కుశల ప్రశ్నలు అయిన తరువాత -"ఏమండీ ఉత్తరపు పొలం మీ మేనమామగారు మీకు బాకీ క్రింద కట్టినట్లున్నారు. ఎంతో మీకేమైనా జ్ఞాపకం వుందా?" అని అడిగాడు.

"లేకేం! పది ఎకరాలు" అన్నాడు తను.

"వ్రాయించుకునేటప్పుడు సర్వే చేయించారా?" అని అడిగాడు.

అతనికి ఆ గొడవ తెలియదు. "నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు. చేయించకుండా ఎందుకు వుంటారు? చేయించే వుంటారనుకొంటాను" అన్నాడు.

"అవున్లెండి చేయించకుండా ఎందుకు వుంటారు? మేనమామ మేనల్లుళ్ళ మధ్య అలాంటివి ఎందుకు జరుగుతవి గాని మొన్న ఏదో సందర్భంలో లెక్కలు చూడవలసి వస్తే తొమ్మిది ఎకరాల పది సెంట్లేనని తేలింది. అందుకే ఊరికే సంగతి తెలుసుకుందా మని అడిగాను" అన్నాడు.

అక్కడి నుంచి గ్రంథాలయానికి వెళ్ళాడు. అక్కడ చిరకాల స్నేహితుడొకడు కనిపిస్తే, ఇద్దరు కలిసి కాలువగట్టుకి షికారు కెళ్లారు. అతను తన మేనమామ గురించి మరి కొన్ని విషయాలు చెప్పాడు. "అబ్బాయీ - నా మాట విని నీ పొలం ఇంకెవరికన్నా కవులుకిచ్చి వెళ్ళు. నీ మేనమామ కింద వుంటే నీకు దమ్మిడీ రాదు. నీ శ్రేయస్సు కోరి చెపుతున్నాను. నా మాట విను" అన్నాడు.

"ఎందుకని? కారణం చెప్పు - అలాగే చేద్దాం" అన్నాడతను.

స్నేహితుడు చెప్పాడు.

తన మేనమామ మాట వినే వాళ్ళకీ, ఇంట్లో ఏదొచ్చినా పని చేసి పెట్టే వాళ్లకీ, ఊళ్ళో మద్ధతుగా వుండే వాళ్ళకి పొలం తక్కువ కౌలుకి యిస్తున్నాట్ట. వాళ్లు చేలు బాగు చేసినా చెయ్యకపోయినా పట్టించుకోవటం లేదట. ప్రతి సంవత్సరం బకాయిలు పెట్టి సరిగ్గా వసూలు చెయ్యటం లేదట. ఇటీవల నాలుగు ఎకరాలు సొంతానికి తీసుకొని చెఱకు వేసాడుట, చెరకు సొంత చేలో వేసుకోకుండా తన చేలో వేసి కవులు మాత్రం మామూలు కవులే యిస్తున్నాట్ట. ధర తక్కువలో వుండి డబ్బు అవసరం అయితే తన ధాన్యం అమ్ముకొని తక్కువ ధరలెక్కప్రకారం డబ్బు పంపుతాడట!

ఇలా తన మేనమామ తన్ను చేసే మోసాలు ఎన్నో చెప్పుకొచ్చాడు. అతను చెప్పే మాటలు వింటుంటే, సీతారామారావు వుడికి పోయాడు. డబ్బు నష్టపడ్డందుకు అతనికి దిగులులేదు. తనంతటి వాడు మోసపోయానే అనే చింత!

స్నేహితుడు చెప్పిన మాటలు అతని హృదయాన్ని గాయపరిచినై. అతని కళ్ళకు ప్రపంచం అంతా తారుమారయినట్టు కనిపించింది. ఆలోచించుకుంటూ, బాధపడుతూ తిరిగి మేనమామ యింటికి వచ్చాడు.

ఇంట్లో అడుగు పెట్టగానే అతని వైఖరిని కనిపెట్టి "ఏం బాబూ అలా వున్నావు?" అని అడిగింది అతని మేనత్త.

అతడు తను విన్న సంగతులన్నీ చెప్పి "ఇది న్యాయమా అత్తా!" అని అడిగాడు.

ఆమె భర్త మీద మండిపడి భర్త ఇంటికి రాగానే కస్సున లేచింది "కుర్రవాణ్ణి చేసి మోసం చెయ్యటం భావ్యం కాదు." అంది. "వాడికి పెట్టవలసింది పోయి వాడి డబ్బు తింటామా!" అంది. "వాడు అమాయకుడు - అర్భకుడు, మనం అడిగిన సహాయం చేశాడు. వాడు యిప్పుడు ఎంత క్షోభపడుతున్నాడో చూడండి వాడి మనస్సు కష్టపెట్టడం శ్రేయస్కరం కాదు" అంది.

భర్త అన్నిటికీ ఏవేవో జవాబులు చెప్పాడు. "మాటలు అనవసరం. గిట్టని వాళ్ళు అనేకం చెపుతారు. స్పష్టంగా దమ్మిడీ దగ్గర నుంచీ ఎకౌంటు రాసే వుంది చూచుకోమను" అని ఎకౌంటు పుస్తకాలు, ముందు వేశాడు.

కాని తాను చూసుకునేదేమిటి? తనకు డైరీ రాసుకునే అలవాటైతే వుంది గాని ఎకౌంటు రాసుకునే అలవాటు లేదు. ఎంతెంత తీసుకున్నాడో జ్ఞాపకం లేదు. ఎకౌంటు ఎట్లా వెరిఫై చెయ్యటం! కూచున్నాడు.

"చూడు" అన్నాడు మేనమామ.

"ఏముంది చూట్టానికి!" అన్నాడు సీతారామారావు.

"ఊళ్ళో వాళ్ళు మాటలు నమ్మి నీ డబ్బు తిన్నాననంటివిగానీ నీ తల్లి చచ్చిపోయిన తరువాత ఈ పొలం కాపాడటానికి ఎన్ని తిప్పలు పడ్డానో నీకేం తెలుసు? వూళ్ళో అవతల పార్టీ వాళ్ళని పట్టుకొని పొలం స్వాధీనం చేసుకోవాలని నీ తండ్రి ఎంత

ప్రయత్నించాడో ఎవరినన్నా అడుగు. ఈ పొలం కూడా నీకు ఎక్కడ లేకపోతుందో అని నేను నిలబడి నీ వాళ్ళందరికీ విరోధం అయి, కాపాడాను" అన్నాడు మేనమామ!

"ఆ మాట నిజమే నాయనా, నీ కోసం అనేక నిందలు మోశారు" అన్నది మేనత్త.

"నేను కాదన్నానా అత్తా...." అన్నాడు సీతారామారావు.

"మరెందుకీ గోల అంతా! ఈ రోజు మొదలుకొని నీ పొలం నువ్వే చూచుకో" అన్నాడు మేనమామ.

"చాల్లెండి యిదొక బెదిరింపు! మీరు చూచి పెట్టకపోతే యిక చూచే వాళ్ళు లేరనా! ఏదో వూళ్ళో వాళ్ళు అడిగారని చెపితే యింత రభస! రా నాయనా.... ఆయనతో మనకెందుకు? మా నాయన వచ్చిన తరువాత ఒక్క గారె ముక్కయినా వండలేదు. మధ్యాహ్నం చెయ్యాలి" అని సీతారామారావుని లోపలికి తీసుకు వెళ్ళి తలంటు పీట మీద కూర్చోపెట్టి పప్పు నీళ్ళలో పోసింది.

ఆ రోజు అత్తవంటి ఉత్తమురాలు లేదు అనుకున్నాడు సీతారామారావు కాని యిప్పుడు ఆలోచించి చూస్తే అది అంతా కూడా కపట నాటకమే అనిపించింది. ఇద్దరూ కలిసే తన్ను మోసం చేశారు. రాత్రిళ్ళు ఎవ్వరు ఎట్లా మాట్లాడుకోవాలో కూడబలుక్కునేదీ, తెల్లవారి మాట్లాడేదీ!

వెనక్కి చూచుకొని, యిదంతా ఆలోచించుకొనేప్పటికి అతనికి రోషం వచ్చింది. ప్రపంచంలో వున్న ప్రతి వాడూ తన్ను మోసగిస్తూనే వున్నాడు. చదువుకోని వాడికి, తెలివి తక్కువ వాడికి, చవటకి.... అందరికీ తను లోకువే అనుకున్నాడు. తన మేనమామకి ఘాటైన ఉత్తరం రాయాలని కలం కాగితం తీసుకున్నాడు. కాని ఏమని రాసేట్లు? ఆయన ఉత్తరానికి జవాబేముంది.

తన మామ వెళ్ళి మేనమామతో మాట్లాడటం అతనికి మరీ మంటగా ఉంది. అయితే తనేం చెయ్యగలడు?

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

10 వ భాగం

అసమర్థుని ప్రతాపం:

మేనమామ ఉత్తరం సీతారామారావు హృదయాన్ని అగ్ని గుండంగా మార్చింది. తన మీద తనకే ఏవగింపు కలిగించింది. గిల్లికజ్జా పెట్టుకోవటం మొదలు పెట్టాడు.

"ఏం అక్కడ నిలబడ్డావేం?" అని అడిగాడు సీతారామారావు, గడపలో నుంచున్న కూతుర్ని చూచి - "స్నానానికి నీళ్ళు లేవు నాన్నా! అమ్మ రెండు కడవలు పొయ్యిమంది" అంది పాప భయపడుతూ.

"లేకపోతే మానుకోమను"

"అమ్మ ఎప్పుడో స్నానం చేసింది నాన్నా.... నీకు తోడ్డానికి నీళ్ళు మసలిపోతున్నాయి......"

తన స్నానానికి అంటే తోడతాడనీ! మిగిలిన వాళ్ళకైతే తోడడనీ ఆ పిల్ల అనుకోవటం అతని కోపానికి కారణం అయింది. కాని ఏం అనగలడు!

"అన్నిటికీ నేనే దొరికినా?" అన్నాడు.

"శీనయ్య పొద్దున పోసిపోయాడు నాన్నా.... అయిపోయినై......"

తన కోపం సకారణంగా బయటపడ్డానికి అప్పటికి అతనికి అవకాశం దొరికింది "మీకు కావలసిందల్లా తోడించుకున్నారన్నమాట. నాకు కావలసినయి మాత్రం నేనే తోడుకోవాలన్నమాట! ఇంతేనా?" అని గుడ్లు ఉరుముతూ అడిగాడు.

"కాదు నాన్నా... ఇవ్వాళ అమ్మకి వంట్లో బాగాలేదు - నీళ్ళు తోడలేక పోయింది పంపేమో చెడిపోయి నాలుగు రోజులైంది.."

"ఏడ్చావులే, మాట్లాడితే యిదొక్కటి నేర్చుకున్నావు. అమ్మని వెనుక వేసుకు రావటం! దొరికింది నీకే గా ఒక అమ్మ....." అంటూ లేచాడు.

అతడు బావిలో నీళ్ళు తోడి రెండు కడవలూ రెండు చేతుల్లో పట్టుకొని వంట యింట్లోకి తీసుకు వెళ్ళాడు. అక్కడ అతని భార్య పొయ్యి మీద వున్న అన్నం ఉడికిందో లేదో అని తెడ్డుతో నాలుగు మెతుకులు తీసి వేళ్ళతో పట్టి చూస్తూ వుంది.

“ఎక్కడ పొయ్యను” వగర్చుకుంటూ అడిగాడు.

“స్నానాల గదిలో దింపండి” అంది భార్య.

అక్కడ నుంచి మళ్ళీ స్నానాల గదిలోకి వెళ్ళటం కష్టం అనిపించింది. బరువు పట్టుకొని నుంచోవటం వల్ల గూళ్లు నొప్పి పుడుతున్నాయి. సరాసరి స్నానాల గదిలోకి వెళితే అంత కష్టం అనిపించేది కాదు. “ఆ మాట ముందే ఏడవగూడదూ ..... తీరా యిక్కడికి వచ్చిం తర్వాత ఏడవక పోతే?” అన్నాడు.

“పాప చెప్పింది అనుకున్నాను”

నిజమే! అప్పుడతనికి జ్ఞాపకం వచ్చింది. పాప చెప్పినట్లు, తప్పు తనదే అని అంగీకరించాల్సి వచ్చేటప్పటికి అతనికి ఆగ్రహం వచ్చింది “పాప చెప్పితే మళ్ళీ నువ్వు యింకొకసారి చెప్పగూడదా? ఇంతలోకే అరిగిపోతావా? నీ నోటి ముత్యాలు రాలిపోతాయ్యా” అంటూ గబగబా స్నానాల గదిలోకి కడవలు తీసుకు వెళ్ళాడు. లోపలకు వెళుతుంటే మండిగం తలకు తగిలింది. గంగాళంలో నీళ్ళు గుమ్మరించి బయటకు రాగానే కాకి తన్నింది.

ఆ కాకి పక్క నున్న కొబ్బరి చెట్టుమీద గూడు కట్టుకుంది. ఆ గూడు ఎక్కడ తీసి వేస్తారో అని దాని భయం.

కాది అది మాత్రం అందర్నీ తంతూ వుందా? తన భార్య ఎన్ని సార్లు అటూ ఇటూ తిరిగినా ఏమీ అనదు. పాపని ఏమీ అనదు. తనను మాత్రం వీలు చిక్కినప్పుడల్లా తన్నక ఊరుకోదు. మొన్న ఏనాది వాణ్ని తన్నింది. తనను గురించి అది ఏమి అనుకుంటూ వుంది. తను ఎవరు అనుకుంటూ వుంది!

పిట్టల్ని కాల్చుకు తింటానికి బల్లెంతో గూళ్ళు పొడిచే వాడు అనుకుంటూ వుందా? తనకు చొక్కా లేదని అప్పుడు జ్ఞాపకం వచ్చింది. అయినా తనకీ ఏనాది వాడికీ చొక్కాయేనా భేదం?

తన హృదయం తెలుసుకోక పోయినందుకు కాకి మీద అతనికి కోపం వచ్చింది. గూడు తీసి వేసి దాని రోగం కుదుర్చుదాం అనుకున్నాడు గాని తనకు కొబ్బరి చెట్టు ఎక్కడం చేతగాదు.

కాకి మళ్ళీ తల మీద తన్నింది. అతనికి పట్టరాని కోపం వచ్చింది భార్య మీద, “ఛీ! దరిద్రపు కొంప - ఈ కొంపలో బతకడమే కష్టంగా వుంది. ఒక్క క్షణం కూడా మనస్సుకి శాంతి లేకుండా పోయింది” అన్నాడు బిగ్గరగా ఆమెకు వినపడేటట్టు, అంటూనే, మళ్ళీ కాకి ఎక్కడ తంతుందో అని అక్కడినుండి కదిలి గబగబా సందులోకి వెళ్ళాడు.

కూతురు ఎదురుగా పరుగెత్తుకుంటూ వచ్చి అతన్ని చూచి బిక్క మొహం వేసి ఠక్కున ఆగిపోయింది. ఆ పిల్ల వెనక పక్క గుడిసెలో కాపరం చేస్తున్న ఎరుకల్ది గల గల మంటూ వచ్చింది..... “చూడండ అయ్యోరూ! మా పిల్లని ఎట్లా బాదిందో! లేనోళ్ళం అని గూళ్ళిరగపొడుత్తారా! మేమూ మడుసులమే” అంది.

దాన్ని చూస్తే సీతారామారావుకి భయం వేసింది. దాని నోరు చెడ్డది. దాన్ని చూస్తే తనకే కాదు, ఆ వాడకట్టులో అందరికీ

భయమే. ముందు నోరు పారేసుకుంటుంది, తర్వాత ఏమనుకొంటే ఏం లాభం పైగా దానిక పెద్దా చిన్నా తారతమ్యం లేదు.

ఇటు వంటి వాళ్ళతో చిక్కులు తెచ్చి పెడుతున్నందుకు కూతురు మీద కోపం వచ్చింది "ఎందుక్కొట్టావు!" అని అడిగాడు.

కూతురు గడ గడ వొణికపోతూ వుంది. నోటమాట రాలేదు.

"చెప్పూ?" అని గద్దించాడు.

కూతురు కళ్ళప్పజెప్పి నుంచుంది. ఆ పిల్ల చూపులు చూస్తే అతను అడుగుతున్న

ప్రశ్నల మీద మనస్సు ఉన్నట్లు లేదు. రాబోతున్న అపాయాన్ని ఊహించుకొని కొయ్యబారిపోతూ వుంది.

తన కూతురు దిగులు చూపులూ, నిస్సహాయత్వం చూస్తే అతని హృదయం కరిగింది. "నవ్వుతూ అన్నానమ్మా భయపడతావేం" అని కావలించుకో బుద్ధి అయింది.

కాని ఏం చేసేటట్టు? ఎరుకల్ది చూస్తూ అక్కడే నుంచుంది. దానికి ఏం చెప్పేటట్టు? దాన్ని శాంత పర్చకపోతే ఇప్పుడే బజార్న పడుతుంది. ఏమేమీ అంటుందో! ఇంత బతుకూ బతికి దాంతోనా పోట్లాడటం? పోట్లాడాక మాటలు పడేది ఎట్లా?

"మాట్లాడవేం? ఎందుకు కొట్టానంటే చెప్పవేం? చెపుతావా? చెప్పవా" అని దెబ్బ వేశాడు. ఆ దెబ్బకి హడలిపోయింది కూతురు. కాని పెదవి విప్పలేదు. అలాగే చూస్తూ నుంచుంది.

తను కొట్టాడు. కాని ఆ పిల్ల ఏడవలేదు. యెందుకు యేడవదు? కొట్టకు నాన్నా! అని ఎందుకు యేడవదు? అతనికి నిజంగా కోపం వచ్చింది. అతనిలో వున్న పశుత్వం విజృంభించింది. "చెప్పు..... చెప్పుతావా, లేదా? వాళ్ళ జోలికి వెళ్ళకుండా వుంటావా, ఉంటావా, ఉంటావా?" అని దెబ్బ, దెబ్బ మీద దెబ్బ వేశాడు.

ఆ దెబ్బలు కూతురు భరించలేకపోయింది. మాటలు పెకిలించింది "ముందు నన్నే కొట్టింది నాన్నా".

ఆ మాటకు అతడు త్రుళ్ళిపడ్డాడు. తను అనవసరంగా కొట్టాడా ఇన్ని దెబ్బలూ తను అనవసరంగా వేశాడా? తను కొట్టడం తప్పా? ఐతే ఆ మాట ముందే ఎందుకు చెప్పదు? ముందుగా చెప్పక తన్నీ పశుకృత్యంలోకి దింపినందుకు కూతురు మీద కోపం వచ్చింది.

"ఆ మాట ముందే ఎందుకు చెప్పలేదు? అడగ్గానే ఎందుకు చెప్పలేదు?" అని మళ్ళీ కొట్టాడు.

ఎరుకల్ది అక్కడే నుంచుని చూస్తూ వుంది. దానికి తప్పు తన మీదకు వొస్తుందేమో అని అనుమానం కలిగింది "అమ్మో యేలెడు లేవు ఎన్ని అబద్ధాలాడుతావమ్మా! నేను చూస్తుండలా? జుట్టు పట్టుకొని వంగదీసి దబదబా గుద్దితివే? నేనొచ్చే తలికి వుడాయించుకొస్తివే?" అంది.

“కాదు నాన్నా, నేను బజార్న వస్తున్నా..... అది మన దొడ్లో సపోట కాయలు ఎత్తుకుపోతోంది. నేను అడ్డం వెళ్లా.... కొట్టింది.....” అన్నది కూతురు.

“దొంగతనాలు కూడా కడుతున్నావా అమ్మా! యిన్నాళ్ళూ మీ కూడు తినే మేం బతుకుతున్నాం అమ్మా? లేకపోతే మాకు కూడు ఎక్కడిది?” ఎత్తుకుంది ఎరుకల్ది.

అతనికి భయం వేసింది దాని నోటికి అడ్డూ ఆపూ లేదు. ఏం చెయ్యడం? దాన్ని ఎలా ఆపడం?

“కొడితే మాత్రం మళ్ళీ కొడతావా?” అని మళ్ళీ కొట్టాడు కూతుర్ని. ఎరికల్ది. యింకా

అక్కడే నుంచుంది. ఇప్పట్లో కదిలేటట్టు లేదు. ఇంకా తన కూతుర్ని కొట్టించాలని దాని కోర్కె కాబోలు? వెంటనే అతనికి ఎరికల దాని మీద కోపం వచ్చింది. తన కూతుర్ని అన్యాయంగా తన చేత కొట్టించినందుకు కడుపు మండింది “ఇంకా నుంచున్నావేం! కొట్టాగా ఇక వెళ్ళు” అన్నాడు.

“అయ్యో పిల్లని నే కొట్టమన్నానా? నా పిల్లని కొట్టిందని సెప్పాను. అయ్యో రాత... మాకేం నీ ఈడకు రాటానికి.. మా పిల్లని కొడితే సెబుదామని వొచ్చా...” గింజుకుంటూ వెళ్ళింది ఎరికల్ది.

ఇంకా అక్కడే వుంటే దాని నోటి వెంట వచ్చే మాటలు ఏమీ వినాల్సి వస్తుందో అని అతడు ఇంట్లోకి వెళ్ళాడు. వెళ్ళే వాణ్ని గుమ్మం దగ్గర పట్టుకొని కాకి మళ్ళీ తన్నింది.

-2-

కోపం తగ్గగానే కూతుర్ని కొట్టినందుకు అతనికి పశ్చాత్తాపం కలిగింది. ఆ దృశ్యం ఊహించుకుంటే అతని గుండెలు చెదిరినాయి. ఆ పిల్ల ఏమీ చెయ్యలేక నిశ్చేష్టురాలయి నిలబట్టం, తాను దెబ్బ మీద దెబ్బ వెయ్యటం, ఆ పిల్ల గుడ్ల నీరు కుక్కుకుని కిక్కురు మనకుండా నిలబట్టం... అతనికి ఘోరంగా కనిపించింది.

తన మీద తనకే అసహ్యం వేసింది. పిల్లి ఎలుకను చెర పట్టినట్టుంది. తన కూతురు తప్పేం వుంది? ఎరికల దానికి భయపడి కూతుర్న కొడతాడా? తను ఏం చేసినా పడి వుండటమే దీనికి కారణం? ఎదురు తిరగలేదనే తనలా ప్రవర్తించటం!

అతనికి జాలి వేసింది. కూతుర్ని హృదయానికి హత్తుకోవాలనిపించింది. తను అకారణంగా పెట్టిన బాధకు తగిన పరిహారం చెయ్యాలనుకున్నాడు. కూతుర్ని పిలిచాడు. ఆ పిల్ల నెమ్మదిగా కళ్ళు తుడుచుకుంటూ భయం భయంగా వొచ్చింది. కళ్ళు ఎర్రబడి వున్నాయి. తల్లితో చెప్పుకుని ఏడుస్తూ వుందని గ్రహించాడు. సీతారామారావు పక్కలో పడుకో పెట్టుకున్నాడు.

“ఏవమ్మా అడగ్గానే ఎందుకు చెప్పలా?” అని అడిగాడు.

ఆ పిల్ల మాట్లాడలేదు. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినయ్.

"చెప్పమ్మా, ఏమీ చెయ్యను చెప్పు" అని ప్రేమ పూర్వకంగా అడిగాడు.

"నువ్వు కొడతావని భయం వేసింది. నాన్నా..." అంది కళ్ళు తుడుచుకుంటూ.

అతనికి ఏమీ తోచలేదు. పిల్లలను ఇలా భయపెట్టి తాను ఎందుకు బతకవలసి వచ్చిందో అతనికి అర్థం కాలేదు. తాను తన పిల్లలకే కంటకం అయిపోతున్నాడు.

"పోనీ, నాతో చెప్పకపోయావా, మళ్ళీ కొట్టటం ఎందుకమ్మా?" అన్నాడు తండ్రి మంచితనం చూచి ఆ పిల్లకి కొంచెం ధైర్యం వచ్చింది. తండ్రి మొహం చూస్తూ, "మొన్న చెపితే, నాతో చెప్పటం ఎందుకు? కొడితే మళ్ళీ కొట్టు అని చెపితివిగా నాన్నా!" అంది.

నిజమే, అతనికి పిల్లల కష్టాల్లో జోక్యం కలిగించుకోవటం చాలా అయిష్టం. కిందా మీదా

పడుతుంటారు. ఆ విషయం పెద్దవాళ్ళు పట్టించుకోవడం తప్పు అనుకునే వాడు. పిల్లవాళ్ళు వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడటం నేర్చుకోవాలి. అప్పుడు గాని పెద్ద వాళ్ళయిం తరువాత జీవిత సమస్యల నెదుర్కొనే ధైర్యం వాళ్ళకుండదు.

చిన్నప్పటి నుంచీ పెద్ద వాళ్ళ మీద ఆధారపడటం నేర్పితే పెద్ద వాళ్ళయిం తరువాత స్వంతంగా ఆలోచించి పనులు చేసుకొనే శక్తి వుండదు. అందుకని ఎవ్వరైనా కొడితే మళ్లీ కొట్టమని మొన్న కూతురికి సలహా ఇచ్చాడు. ఇవ్వాళ తన సలహా అనుసరించినందుకు దండించాడు.

అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగినయి.

అతనికి ఏమీ అర్థం కాలేదు. ఒక క్షణం - ఒకటి మంచిదనీ ఇంకొప్పుడు ఇంకొకటి మంచిదనీ అనిపిస్తుంది. ఒక క్షణంలో తాను చెప్పిందానికే మరుక్షణం విరుద్ధంగా ప్రవర్తిస్తూ వుంటాడు.

మొదట్లో పిల్లల్ని కొట్టడం తప్పనుకున్నాడు. ఘోరపాపం అనుకున్నాడు. కొంత మంది తల్లిదండ్రులు పిల్లల్ని ఎట్లా కొట్టగలుగుతున్నారో అతనికి ఆశ్చర్యం వేసింది. "పసిపిల్లలకు ఏం తెలుస్తుంది? వట్టి అమాయకులు. వాళ్ళను కొట్టి ఏం ప్రయోజనం? హృదయం వున్నవాడెవడూ ఆ పని చెయ్యలేడు అనుకునే వాడు. ఇటీవల పిల్లల్ని కొట్టవలసిందే అనుకుంటున్నాడు.... ఇందుకు తన ప్రవృత్తిని సమర్థించుకోవటానికి కారణాలు కూడా పోగు చేశాడు "పిల్లలు మాటలకు లొంగరు. వాళ్ళను సక్రమ పద్ధతుల్లో పెంచాలంటే భయపెట్టాలి. భయపెట్టటానికి ఒక్కటే మార్గం. దండం ఉపయోగించని తల్లిదండ్రులు పిల్లలకు అపకారం చేసిన వాళ్ళవుతున్నారు. వాళ్ళ ఇష్టం వచ్చినట్టు పెరగనిస్తే ఎందుకూ పనికి రాకుండా పోతారు, గాలి వాళ్ళవుతారు, చెట్టు వంకలు మొక్కగా వున్నప్పుడే తియ్యగలంగాని, ముదిరితే లాభం లేదు" అనిపిస్తూ వుంది అతనికి.

పెద్దల అభిప్రాయాలు కూడా ఇలాగే వున్నట్టు వున్నాయ్, సోషలిజం కావాలనే నాయకులు తమ ప్రత్యర్థుల్ని బాధపెట్టి, హింసించి, చంపి తమ సిద్ధాంతాలను ఆచరణలో పెడుతున్నారు. పెద్ద వాళ్ళ విషయంలో ఇది తప్పు లేనప్పుడు పిల్లలను హింసించడం తప్పేమి ఉంది?

ఈ సిద్ధాంతం ప్రకారం ప్రతి బలహీనుణ్ణి బలవంతుడు దండించవచ్చు. భార్యనీ భర్త దండించవచ్చు. జ్ఞాని అజ్ఞానిని దండించవచ్చు. కాని ఈ దండన వాళ్ళ మంచికే జరగాలని ఎక్కడుంది? తమ స్వార్థం కోసం జరిగితే వాళ్ళు ఏం చెయ్యగలరు? ఇప్పుడు తన కూతురు ఏం చెయ్యగలిగింది.

"పాపా!" పలకరించాడు.

"ఎందుకు నాన్నా?"

"కదులుతున్నావేమమ్మా?"

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

11 వ భాగం

"చెయ్యి నొప్పిగా వుంది నాన్నా" అని చెప్పింది కూతురు. ఆ చేతి మీదే అతను దెబ్బలు వేసింది.

అతను కొంచెం సేపు మాట్లాడలేకపోయాడు. నెమ్మదిగా చెయ్యి సవరదీస్తూ ఇలా అన్నాడు "చూడమ్మా! ఆ.... చిల్లర వాళ్ళు తగని వాళ్ళు, వాళ్ళ నోళ్ళు మంచివి కావు. మనకు తగ్గ వాళ్ళతో ఆడుకోవాలిగాని, వాళ్ళతో తిరగకూడదమ్మా! చెడ్డ అలవాట్లు పట్టుబడతాయి. మనం ఏమన్నా వాళ్ళకు లెక్క ఉండదు. వాళ్ళేమన్నా మనం పీక్కు చావవలసి వస్తుంది. వాళ్ళతో తిరక్కు...."

"తిరగను నాన్నా"

కాని తన మాటలు ముగించాడో లేదో అతనికి వెంటనే ఒక విషయం జ్ఞాపకం వొచ్చింది. మొన్న భార్య అల్లరి చిల్లరి వాళ్ళతో తిరగవద్దని కూతుర్ని మందలిస్తుంటే, తాను "తిరిగితే నేం? వాళ్ళు మాత్రం మనుషులు కాదూ? అందరితోనూ తిరగ వలసిందే! అన్నీ తెలుసుకోవలసిందే! చిన్నప్పుడే అనుభవం సంపాదించటం, రకరకాల మనస్తత్వాలు తెలుసుకోవటం చాలా మంచిది" అన్నాడు.

ఇందులో ఏది తన అభిప్రాయం? తన కూతురు ఏ విధంగా ప్రవర్తించటం మంచిది; "ఉష్, భగవంతుడా!" అని వేడి ఎక్కిన కణతలు వొత్తుకున్నాడు.

అతనికి ఆలోచించిన కొద్దీ జాలికీ, కోపానికీ చాలా దగ్గర సంబంధం వున్నట్టు కనిపించింది. తన హృదయం మెత్తనిదవటమే తన బాధకూ, ప్రవర్తనకూ కారణం అనుకున్నాడు. శిలా హృదయులు వుంటారు. వాళ్ళకు కోపతాపాలు వుండవు. సంతోష వికారాలూ వుండవు. వాళ్ళకసలు ఆవేశలూ, ఉద్రేకాలూ వుండవు. అన్ని పనులూ ఒకే రకంగా చేసుకుంటూ పోతారు.

తను వేరు. ప్రతి ఆవేశానికీ వశుడౌతాడు. ఈ ఆవేశం పైకి ఎన్నిసార్లో కనిపించినా, పునాది ఒకటే - తనది మెత్తని హృదయం, జాలిపడే గుణం, ఇతరుల కష్టాలను చూసి ఓర్వలేకపోవటమే తన జాడ్యానికి మూల కారణం.

తన కూతురు ఆడుకుంటూ పడి ఏడుస్తూ వుంటుంది. ఆ ఏడుపు సహించలేడు. ఏడుస్తూ వున్న ఆ పిల్ల మొహం చూడలేడు. లోపల రంపాలు పెట్టి కోస్తున్నట్టు బాధ పుడుతుంది. కోపం వస్తుంది. ఏడుపు చూసే వరకూ కొడతాడు.

కొట్టటానికి కారణం ఏమిటి? ఏడుపు సహించలేని తన మెత్తని హృదయమా? కాఠిన్యమా? కొట్టడమే చూసే వాడికి తన కఠినత్వమే కనిపిస్తుంది. దాని వెనుక వున్న జాలీ, బాధా కనుపించవు.

తన భార్య రాత్రింబగళ్ళు పని చేస్తుంది. జబ్బు తెచ్చుకుంటుంది. చేతులారా తెచ్చుకున్నానని చెడామడా తిడతాడు. ఆ

తిట్టటమే విన్నవాళ్ళు "ఎంత కఠినుడు" అనుకుంటారు. కాని తనకు అంత కోసం రావటానికి కారణం తన మెత్తని హృదయమే.

తనకు మెత్తని హృదయం ఉండటం, ఇతరుల కష్టాలు ఓర్వలేక పోవటం - ఇదే తప్పయిపోయింది. తన మంచితనమే తనకు శత్రువైంది. తన కుటుంబానికి శత్రువైంది. అతనికి వెంటనే మరొక ప్రశ్న తట్టింది - "మెత్తని హృదయం అంటే ఏమిటి?"

"నరాల బలహీనత" అని ఒక స్నేహితుడు చెప్పాడు "నరాల్లో పటుత్వం తప్పితే బయట జరిగే ప్రతి చిన్న విషయానికి మానవుడు చలిస్తూ వుంటాడు. దీన్నే మన వాళ్ళు హృదయం అన్నారు. "నరాలు ఎంత బలహీనపడితే అంత మృదుల హృదయం అవుతుంది అన్నారు."

ఈ మాటలు అతనికి ఆశ్చర్యం కలిగించినయ్. కొంత మంది తను కళ్ళ ఎదుట ఏ అన్యాయం జరిగినా బొట బొట కన్నీరు కారుస్తారు. దీనికి కారణం వాళ్ళ నరాల బలహీనతేనా? మంచితనం కాదూ? మరి తను ప్రతి చిన్న విషయానికీ ఎంతో బాధపడతాడే! మధనపడతాడే! రాత్రింబగళ్ళు నిద్రాహారాలు లేకుండా ఘర్షణపడతాడే!

ఈ బాధ, ఈ యాతన, ఈ కోత ఇదీ నరాల బలహీనతవల్లేనా? తన మెత్తని హృదయం వల్ల కాదూ? పోనీ పరిస్థితులకు మించిన తెలివితేటలు వుండటం వల్లయినా కాదూ!

అతనికి కోపం వచ్చింది "నా నరాలు ఎందుకు పటుత్వం తప్పినయ్?" అని కసిగా ప్రశ్నించుకున్నాడు.

"ఆలోచన వల్ల"

"నాకిన్ని ఆలోచనలు ఎందుకు రావాలి?"

"ఏ పనీ చెయ్యకుండా కూర్చోవటం వల్ల."

"నాకు ఎందుకు చెయ్యబుద్ధి పుట్టడం లేదు?"

"పరిస్థితుల వల్ల."

"ఇక నా బాధ్యత ఏమిటి" అని కఠినంగా ప్రశ్నించుకున్నాడు.

"పరిస్థితులు మార్చుకో"

"ఎలా మార్చను? పరిస్థితులని మార్చుకోవాలంటే ముందు మార్చుకోవాలనే బుద్ధి కలగాలి. అలా బుద్ధి కలగాలంటే పరిస్థితులు మారాలి - నేనేం చెయ్యను? దీనికి దారి యేదీ? ఎట్లా బయటపడాలి? ఈ పద్మవ్యూహాన్ని ఛేదించటం ఎట్లా?...."

అతనికి ప్రపంచం ఏకమై తన్ను హింసిస్తున్నట్లు అనిపించింది. ప్రపంచం భారమంతా తనొక్కడే మోస్తున్నట్లు అనిపించింది. భావాల బరువుతో పాతాళానిక కుంగిపోతున్నాడు. తన్ను రక్షించే వాళ్ళే లేరు. తన మొర అలకించే వాళ్ళే లేరు, తన్ను అర్థం చేసుకునే వాళ్ళే లేరు. అతనికి దుఃఖం వొచ్చింది.

తన భార్య అంకంలో తల పెట్టి, పసిపిల్లవాడికి మల్లే ఏడవాలనిపించింది. తన భార్యతో తన బాధ, ఆరాటం, కష్టసుఖాలూ అన్నీ వెళ్ళబోసుకోవాలనిపించింది. తన ప్రవర్తనకు క్షమాపణ కోరుకోవా లనిపించింది. "నాకు బాగా బతకాలని ఉంది. నిన్ను సుఖపెట్టాలని ఉంది. కాని చేత కావటం లేదు." అని చెప్పుకోవాలనిపించింది. తన హృదయం విప్పి ఆమె ముందు పెడితే

శాంతి లభిస్తుందనే ఆశ కలిగింది. ఆ ఆశతో కొంత బలం వొచ్చింది.

"పాపా" పిలిచాడు.

"ఏం నాన్నా?"

"నొప్పిగా ఉందా అమ్మా?"

"తగ్గింది నాన్నా"

"ఇంత దెబ్బ తగుల్తుందనుకోలేదమ్మా, ఏదో కోపం వచ్చి......"

"పోనీలే నాన్నా"

"కొంచెం లేవగలవా అమ్మా."

"ఎందుకు లేవలేను నాన్నా?"

"అమ్మతో అన్నం వడ్డించమని చెపుతావా అమ్మా?"

"ఎందుకు చెప్పను నాన్నా?"

భోజనం దగ్గర కూర్చొని తన భార్యమీద తనకున్న ప్రేమని బహిర్గతం చెయ్యాలని ప్రయత్నించాడు. కాని ఎలా మొదలు పెట్టాలో అతనికి తెలియదు, ఆమె యధాప్రకారం ఎక్కువ మాట్లాడకుండా, వొడ్డించుకు పోతూ వుంది "ఇవ్వాళ బీరకాయ కూర బాగుం" దన్నాడు. తలవొంచుకుని భోజనం చేస్తూ,

ఆమె మాట్లాడలేదు. ఆమె అటు ఇటూ తిరగటం అతను గమనిస్తూనే వున్నాడు.

"కొత్తరకంగా వండినట్టు వున్నావే?" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"రోజూ ఇలా వొండగూడదూ?" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"మాట్లాడవే" అన్నాడు.

"రోజూ వొండినట్టే వొండాను" అంది.

అతనికి కష్టం వేసింది. అంత ముక్తసరిగా మాట్లాడకపోతే కొంచెం నవ్వుతూ మాట్లాడితే తన సొమ్మేం పోయిందో! కూరలు బాగున్నాయి అన్నాగదా, కొంచెం సంతోషించగూడదూ! దీని దగ్గర వున్న రోగమే ఇది ప్రతి దానికీ తనకేమీ సంబంధం లేనట్టు ప్రవర్తిస్తుంది.

"ఇవ్వాళ ఇస్త్రీ చీర కట్టావే!" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ, ఆమె మాట్లాడలేదు.

పైగా మొహం చిట్లించుకున్నట్లు అనుమానం కలిగింది. మొహం చిట్లించుకున్న వాళ్ళని చూస్తే తనకు కంపరం అని ఆమెకు తెలుసు. తెలిసి కూడా అలాగే వుంటుంది చెయ్యాలని చేస్తుందేమో! అప్పటికి సంభాళించుకొని "వొంట్లో బాగా లేదా ఏమిటి?" అని అడిగాడు.

"బాగాలేకేం? బాగానే వుంది" అంది.

"మరి అట్లా వున్నావేం?......" అతనికి విసుగు పుడుతూ వుంది.

"ఎట్లా వున్నాను"

అతనికి కోపం వస్తూంది. ఆమె ఎప్పుడూ ఇంతే. తాను ఎంత మంచిగా ఉందామన్నా పడనివ్వదు. తాను ఎంత దగ్గరగా రావటానికి ప్రయత్నిస్తూ వుంటే అమాంతం అవుతూ వుంటుంది. తను ఎంత బాగా వుందాం అనుకున్నాడు! మాట్లాడటానికి అవకాశమే ఇవ్వదు. పైగా కడివెడు చన్నీళ్ళు అమాంతంగా నెత్తి మీద గుమ్మరిస్తుంది. ఇప్పుడు తను చేసిన తప్పేముంది! ఎందుకట్లా చిట్లించుకుంటుంది! ఎందుకు అట్లా పెడరసంగా మాట్లాడుతుంది.

"సుస్తీగా వున్నంట్టుంటేనూ...."

“నాకేం సుస్తీ? బాగానే వున్నాను, మామూలుగానే వున్నాను” అంది.

అతనికి కోపం వచ్చింది. ఈ ఆడవాళ్ళతో మంచిగా వుండటానికి ప్రయత్నిస్తే లోకువ అవటం కంటే ఏమీ జరగదు అనుకున్నాడు. మొదట అలుసు ఇచ్చినందుకు ఇప్పుడు అనుభవిస్తున్నాడు చాలు. మొదట్లో స్వాతంత్ర్యం, సమానత్వం అనుకొని నెత్తిని ఎక్కించు కోకపోతే ఇట్లా తయారయ్యేదా? అందరికి మల్లేనే ఉంది. ఎట్లా నడవమంటే అట్లా నడుస్తూ వుండేది. ఏం చెయ్యమంటే అది చేస్తూండేది. మాట వినకపోతే మక్కెలు విరగదన్నే పని.

“కొంచెం బీరకాయ కూర వొడ్డిస్తాను” అంది.

“అక్కర్లేదు.”

“బాగుందంటిరిగా!”

“బాగుందని పొట్ట చెక్కలయ్యేట్టు తినాలా? అది మాకు చేత గాదు. మీ నాన్న చేసే పని - నువ్వు చేసే పని” అని కోపంగా అన్నాడు.

ఆమెకు ఏమీ అర్థం కాలేదు. కాని అనవసరంగా తన తండ్రి మాట ఎత్తితే కష్టం వేసింది - “ఇప్పుడు ఆయన సంగతి ఎందుకు లెండీ” అంది.

“నా ఇష్టం, నా ఇష్టం వచ్చినప్పుడల్లా ఎత్తుతాను. నువ్వెవరవు అడ్డు పెట్టటానికి?” అన్నాడు మరింత కోపంగా.

ఆమెకు అతని కోపకారణం తెలియలేదు. తనేం చేసింది? తను కంటపట్టమే తప్పయి పోయింది. తన బతుకే దుర్భరం అయింది. అతనికి కోపం వచ్చినప్పుడు ఎదుట లేకుండా వెళ్లటం ఆమెకు అలవాటు. ఇప్పుడూ అట్లాగే వెళ్ళిపోయింది.

“ఇక్కడ నుంచోటమే నీకు కష్టమయిందా? ఇంత అన్నం నా మొహాన వేస్తే అయిపోయిందా? నాకు అన్నం వద్దు నేను - తినను” అని బిగ్గరగా అరచి పళ్ళెం గభాలున నెట్టివేసి లేచాడు.

ఆమె నిర్విణ్ణురాలయి నిలబడింది.

“యేం అట్లా చూస్తావేం? నేను దయ్యాన్నా భూతాన్నా? రాక్షసినా?” అని అరిచాడు.

ఆమె మాట్లాడలేదు.

“మాట్లాడవేం?” అన్నాడు.

“ఏముంది మాట్లాడటానికి?”

అతనికి మండింది. శివం ఎక్కింది "ఏముందా? ఏమీ లేదూ! నాతో మాట్లాట్టానికి ఏమీ లేదూ? లేకపోతే సరే. ఈ మాటే జ్ఞాపకముంచుకో" అని పరవళ్ళు తొక్కి గబగబా వెళ్ళిపోయాడు.

ఆమె అక్కడే చతికిలబడింది.

అతనికి అంతా అయోమయం అయింది. తను ఎందుకు వెళ్ళాడు? ఏం చేసుకొచ్చాడు? ఏమనుకున్నాడు? ఏం చేశాడు? తన భార్యతో మంచిగా ఉందాం అనుకున్నాడు. తన కష్టసుఖాలన్నీ చెప్పుకుందాం అనుకున్నాడు. ఈ విశ్వప్రపంచంలో ఒక్కర్నయినా తన వైపుకి తిప్పుకుందాం అనుకున్నాడు. ఆ పని చెయ్యలేకపోగా పోట్లాడి వచ్చాడు. ఎక్కడ జరిగిందీ పొరపాటు? ఎవర్లో ఉంది తప్పు అలాగే ఆలోచిస్తూ పడుకున్నాడు.

గోడ మీద బల్లి పాకుతూ వుంది. లేచి దాని కెదురుగా నిలబడి అడిగాడు!

"నీకు సుఖంగా ఉందా?"

బల్లి ఆగింది.

"నాకు లేదు" అని బల్లికి చెప్పాడు.

బల్లి కదిలింది.

"నీకు కోపం వస్తుందా?"

బల్లి ఆగింది.

"నాకు వస్తుంది" అని బల్లికి చెప్పాడు.

బల్లి కదిలింది.

"బల్లీ!" అన్నాడు.

బల్లి ఆగింది.

"నీకు బాధలున్నాయా?"

బల్లి కదిలింది.

“నాకున్నాయ్” అని బల్లితో చెప్పాడు.

బల్లి ఆగింది.

నీకూ నాకూ సంబంధం వుందోయ్ బల్లి. ఒకప్పుడు నేనూ నీకు మల్లే హాయిగా పురుగుల్ని పట్టుకొని కాలక్షేపము చేశా. ఇప్పటి కీ గతి పట్టింది. కాని నీలో నేనున్నా, నాలో నువ్వున్నావు.

బల్లి కదిలింది.

“బల్లీ?”

బల్లి ఆగలేదు.

“సోదరీ!”

బల్లి పరుగెత్తింది.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

12 వ భాగం

వెంటనే సీతారామారావుకి భయం వేసింది.

ఆకలి వేస్తూంది. తన భార్య వచ్చి బతిమాలుతుందనే ఆశ వుంది. కాని ఎంత సేపు చూచినా రాలేదు ఆకలిగా వుంది. ఎవ్వరూ పిలవకుండా ఎట్లా వెళ్ళేటట్టు? తనంత తాను తిననని వచ్చే! మళ్ళీ వెళ్ళి ఎట్లా అడిగేటట్టు? తనే వెళ్ళి అడిగితే! తన భార్య ఏమనుకుంటుంది? ఎందుకు ఈ విషమ పరిస్థితిని తెచ్చి పెట్టుకున్నట్టు?

ఇది వరకయితే ఇంత నిర్లక్ష్యంగా ఊరుకునేదా? వచ్చి బతిమాలేది. "మీరు తినకపోతే. నేనూ తినను" అనేది. కళ్ళ వెంట నీళ్ళు పెట్టుకునేది. అన్నం తినిపించేది కూడా. ఇప్పుడు పూర్తిగా మారిపోయింది. ఏం చేస్తూ వుందో!

తను తింటం లేదు గదా!

మంచి నీళ్ళ కోసం వెళ్ళినట్టు వెళ్ళాడు. వంట ఇంట్లోకి. తను నెట్టి వేసిన పళ్ళెం అట్లాగే వుంది! గది అంతా అట్లాగే వుంది. తన భార్య గడపలో కూర్చుని వుంది. ఆమె భోజనం చెయ్యలేదు. భోజనం చెయ్యనందుకు ఆమె మీద కోపం వచ్చింది. తన మీద కసి తీర్చుకోటానికే భోజనం చెయ్యలేదు.

నిండు నెలలు గదా? ఆరోగ్యం సంగతి ఆ మాత్రం తెలియక్కర్లా! అవున్లే. తెలిస్తే ఆడది ఎట్లా అయ్యేది? మోగాడిగానే పుట్టేది.

గబగబా వెళ్ళి గ్లాసుతో మంచి నీళ్ళు ముంచుకొని తాగాడు. గ్లాసు నేల కేసి కొట్టి "మంచి నీళ్ళివ్వటం కష్టం అయిందా? మంచి నీళ్ళక్కూడా నేను లేచి వంట యింట్లోకి వచ్చి, గ్లాసు తీసుకొని, కుండలో నీళ్ళు ముంచుకుని తాగి, మళ్ళీ ఎక్కడ గ్లాసు అక్కడ పెట్టి వెళ్ళాలన్నమాట!" అన్నాడు.

ఆమె ఒక నిట్టూర్పు విడిచి లేచి పాత్రలు సర్దటం మొదలు పెట్టింది. అతనికి కోపం ఎక్కువ అయింది.

"అయితే నేను అన్నం తినకపోయినా ఫరవాలేదన్నమాట?" అన్నాడు.

"........"

"నేను తినకపోవటమే నీకు మంచిది."

"............"

"అసలు నేను సుఖపడాలని నీకు ఉంటేగా!"

"......."

"నేను ఛస్తే మరీ మంచిది. ఖర్చు తప్పుతుంది. కష్టం వుండదు. పిల్లల్ని పెట్టుకొని, హాయిగా వుండొచ్చు. అనే వాళ్ళుండరు."

ఈ మాట క్కూడా, ఆమె జవాబు చెప్పకపోయేటప్పటికి, అతను కస్సున రేగాడు - "నేను అన్నం తినను"

"......"

"తిననంటే తినను."

ఆమె మెదలకుండా పాత్రలు సర్దుతూ వుంది. అతని మాటలు ఆమెకు తగుల్తున్నట్టే లేదు, ఆమె వైఖరి చూస్తే అతనికి భయం వేసింది. ఆమె ఏమనుకుంటుందో తెలియక ఆరాటపడ్డాడు.

"అప్పుడే సర్దుతున్నావేం తిని ఒక్కసారే సర్దుకోరాదూ?"

"............"

"ఇది పాతివ్రత్యంలో ఒక భాగమా ఏమిటి?"

"......."

"ఇంకేం, నేను వెళ్తాలే, చాటుగా తిను."

"........"

"అవున్లే - అన్నం తింటే, నేను నిన్ను కష్టపెడుతున్నట్టు అందరికీ తెలిసేది ఎట్లా?"

ఆమె వడ్డన సామాగ్రి సర్దుతూ వుంది. ఆమె జవాబు చెపితే, లోపల వున్న కుళ్ళు అంతా బయటకు వెళ్ళగక్కడానికి అతనికి అవకాశం వుండేది అతని కసి తీరేది. అలా జరక్కపోయేటప్పటికి, కసి తీర్చకోటానికి వీల్లేక, నిప్పురవ్వలు వెదజల్లుతూ లోలోపలే గుండ్రంగా తిరుగుతూ కాల్చటం మొదలు పెట్టింది కోపం.

కాని ఆమెను ఏం చెయ్యాలో, ఎలా కదిలించాలో దారి దొరకలేదు. ఆమెను అన్ని పాత్రలూ సర్దనిచ్చాడు. అలాగే చూస్తూ నుంచున్నాడు. అన్నీ సర్దింతర్వాత "నేను అన్నం తింటాను" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"నీకే చెప్పేది?" అన్నాడు.

ఆమె మెదలకుండా నుంచుంది.

"ఒడ్డించవా?" అని అడిగాడు. "అవున్లే, నువ్వు నాకు ఎందుకు వొడ్డిస్తావు?" అన్నాడు.

ఆ క్షణం అతని కోపం పటాపంచలైంది. తన మీద తనకే జాలి కలిగింది. తను అడుగుతున్నాడు. ఆమె మాట్లాట్టంలే.

తనకు కోపం రావటం లేదు. అభిమానం చచ్చిపోయింది. మాట్లాడనప్పుడు వెళ్ళిపోగూడదు? పోనీ ఒక పూట అన్నం తినకపోతేనేం! బజారు వెళ్ళి కాఫీ తాగవచ్చు. ఆకలి తీర్చుకోటానికి భార్య చేతి అన్నం ఒకటే మార్గం కాదు కదా? అతని మనస్సు ఒక ప్రక్క ఇట్లా ఆలోచిస్తూనే వుంది. అతనికి మాత్రం అక్కడ నుంచి కదలబుద్ధి అవటం లేదు.

"ఆకలి అవుతూ వుంది. నన్ను చూస్తే నీకు జాలి వెయ్యటం లేదూ?" అన్నాడు. అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు తిరిగినై.

ఆమె మాత్రం మాట్లాడలేదు. అతని కోపం, కరుణ, ప్రేమ, శోకం అన్నీ ఆమెకు ఒకే రకంగా కనిపిస్తున్నాయి. రూపం మార్పేగాని వీటన్నిటికీ పునాది ఒకటేనని ఆమె గ్రహించి

వుంటుంది. అందుకని అతని ఉద్రేకాలకు విలువ ఇవ్వకపోవటం, ఆమెకు అలవాటు అయినట్టే ఉంది. లేకపోతే అతనితో ఆమె కాపరం చెయ్య గలిగేది కాదు.

"వడ్డించవ్!" అన్నాడు సీతారామారావు కంఠం వొణికింది.

ఆమె మళ్ళీ వడ్డించడం మొదలు పెట్టింది.

"కాళ్ళకి నీళ్ళిస్తావా? నన్నే ముంచుకో మంటావా?" అని అడిగాడు.

ఆమె చెంబు కోసం వెళ్తూ వుంది.

"నేనే ముంచుకుంటాలే నీకెందుకా శ్రమ!" అని ఆమె కంటే ముందు వెళ్ళి చెంబు తీసుకొని, గంగాళంలో నీళ్ళు ముంచుకొని, కాళ్ళు కడుక్కొని వచ్చి కూర్చున్నాడు.

ఆమె అన్నం వొడ్డించింది. అతను ఇటు తోసి, అటు తోసి నాలుగు ముద్దలు తిని లేచాడు. అతనికి మళ్లీ కోపం వస్తూ వుంది. ఆమెకు తను లోబడ్డాడు. ఆమె జయించింది. తను లోబడినట్లు కనపడకుండా పరువు కాపాడుకోవటానికి ఏం చెయ్యాలా అని

ఆలోచించాడు. తాను అన్నం తిన్నది తన కోసం కానట్టూ ఆమె కోసం అయినట్టూ -

"ఇంకేం, నీ పంతమే నెగ్గిందిగా! నీ యిష్టం వొచ్చినట్టే చేశాగా కళ్ళు చెమ్మగా వున్నాయా?" అంటూ చెయ్యి కడుక్కుని విసురుగా వెళ్ళిపోయాడు.

ఆమె పెదవి కదల్చలేదు, యేమి ఆలోచిస్తూ వుందో! అసలు ఆలోచిస్తూ వుందో లేదో తెలియటం లేదు. యంత్రం లాగు పాత్రలు సర్దుతూ వుంది.

-4-

"ఏమిరా నువ్వు చేసింది?" అని తనను తాను ప్రశ్నించుకున్నాడు సీతారామారావు. తను చేసిన పని అతనికే బాగుండలేదు. యేదన్నా పని చేసేటప్పుడు తను చేసే పని మంచిది కాదని తనకు తెలుస్తూనే వుంటుంది. కాని మానుకోలేడు.

ఒక పక్కన మంచిది కాదని అనుకుంటూనే వుంటాడు. ఒక పక్కన చేస్తూనే వుంటాడు. తను చేస్తూ వుంది మంచిది అనుకోలేడు. తాను మంచిది అనుకుంది చెయ్యలేడు. ఎందుకని? యేమిటీ విచిత్రం? దీనికీ కారణం ఏమిటీ? పదార్థానికీ ఆత్మకీ చిన్న సంఘర్షణా? తానెవ్వరూ? పదార్థమా? ఆత్మా? భిన్న మార్గాల్లో ఆలోచించే రెండూనా? చూడగా, ఆత్మ కంటే పదార్థమే బలం కలదిగా కనిపిస్తూ వుంది. ఆత్మ ఎప్పుడూ మూల నున్న ముసలమ్మలకు మల్లే గొణుగుతూ వుంటుంది. కాని దాని గొణుగుడు వినేదెవరు? పదార్థం తన పని తాను చేసుకుపోతూ ఉంది.

అతను ఆలోచిస్తున్నాడు. ఒక పద్ధతిని చేతగాని వాళ్ళు ఆలోచనక్కూడా పద్ధతి వుంటుంది. పద్ధతికి కట్టుబడని ఆలోచనలు వుండవు. ఎందుకంటే ఆలోచనలు పెట్టడానికి, పెరగటానిక ఆ పద్ధతే కారణం. ఇష్టం వొచ్చినట్లు ఆలోచించవచ్చు అనుకుంటారు కొందరు, ఎంత అజ్ఞానులు! తమ ఇష్టం తమ చేతుల్లో వుందా? తమ యిష్టానికి మాత్రం ఒక పద్ధతి లేదూ?

అతని ఆలోచనలు ఒక దాంట్లోంచి ఒకటి, ఒక దాంట్లోంచి ఒకటి పుట్టుకొస్తునై. మేడ మెట్ల ఎక్కినట్టు ఒక మెట్టు మీద నుంచి ఇంకొక మెట్టు మీదకు ఎక్కుతున్నాడు. ఎందుకు

ఎక్కుతూ వుందీ అతనికి అర్థం కాదు. గమ్యస్థానం లేదు. ఎక్కే కొద్దీ ఇంకా మెట్లు కనిపిస్తూనే వున్నాయి. అలసిపోయి, ఎక్కలేక వూరుకోవలసిందేగాని, యెక్కిన వాళ్ళకి ఎక్కినన్ని మెట్లు, కొంత మందికి మెట్లు ఎక్కడమే ఆహ్లాదకరంగా వుంటుంది.

వాళ్ళకు గమ్యస్థానం గొడవేలేదు. ఎందుకు ఎక్కుతున్నామా అనే ప్రశ్నేలేదు. సీతారామారావు విషయం వేరు. అతనికి ఆయాసంగా ఉంటుంది. కాని అలసట దీర్చుకోటానికి ఆగలేడు. పైగా ఆయాసం ఎక్కు వైన కొద్దీ, ఎక్కువ వేగంగా పరుగెత్త బుద్ధి అవుతుంది.

"ఏమిరా నువ్వు చేసింది?" అద్దంలో తన బొమ్మని ప్రశ్నించాడు సీతారామారావు. "ఎందుకురా నువ్వు అట్లా చేసింది?" అని కిటికీలోంచి బయటకు చూస్తూ తన్ను తాను ప్రశ్నించుకున్నాడు.

“ఎంత నీచుడవురా నువ్వూ?” అని తన్ను చూచుకొని తానే ఆశ్చర్యపడ్డాడు. “నువ్వు చేసిన పనికి నీ రోగం కుదురుస్తా ఉండు.” అని రొమ్ము మీద దబదబా గుద్దుకోవటము మొదలు పెట్టాడు - మొదట వొంటి చేత్తో, తర్వాత రెండు చేతుల్తో గుద్దు, గుద్దు మీద గుద్దు. గుద్దు మీద గుద్దు. అతనికి ఆకస్మాత్తుగా ఇంట్లో అలికిడి అవటం లేదని తెలిసింది. వెంటనే తన బాధ సహించలేక భార్య ఆత్మహత్య చేసుకుందేమో అని భయం కలిగింది. బావి దగ్గరకు వెళ్ళి చూద్దాం అనుకున్నాడు, కాని ఆమె ఏదన్నా పని చూసుకుంటూ అక్కడే వుంటే!

తను గాభరాపట్టం చూసి ఏమనుకుంటుంది? తను ఎంత లోకువ అవుతాడు? తన బలహీనత ఆమెకు తెలిస్తే బతకనిస్తుందీ? ఒక్క క్షణం తను కాపురం చెయ్యగలుగుతాడూ? తన జీవితానికి గూడు కట్టుకున్న కాకి మల్లే శాంతి వుండదు. ఇలా ఆలోచిస్తూనే లేచి “అందుకు కాదు” అన్నట్లు ఈల వేసుకుంటూ బావి దగ్గరకు వెళ్ళాడు.

కానీ బావిలోకి చూట్టానికి భయం వేసింది. పక్క నున్న సీతాఫలం చెట్టుని పరీక్షిస్తూ నుంచున్నాడు. అది తన తండ్రి వేసింది. ఆ చెట్టు సర్వకాల సర్వావస్థల్లోనూ కాస్తుంది. ఆ చెట్టు కాయలు ఒక విధంగా లేవు. కొన్ని చిన్నవీ, కొన్ని పెద్దవీ, రకరకాలుగా వున్నాయి - మానవ సంతానానికీ మల్లే చెట్టుకి పడ్డ పిందె అంతా నిలవదు. కొన్ని రాలిపోతై, కొన్ని ఉడతలు కొట్టి వేస్తాయి. చెట్ల క్కూడా గర్భస్రావాలు ఉంటయ్యేమో!

లేనిపోని నవ్వు తెచ్చుకున్నాడు. కాని, అప్పటికీ బావిలోకి చూట్టానికి ధైర్యం చాలలేదు. అతనికి ఆడవాళ్ళ మీద అసహ్యం వేసింది. ఎట్లాగూ చావదలచి వాళ్ళ బావిలో పడి, కిరసనాయిలు పోసుకుని చావకపోతే, సరిగ్గా చావగూడదూ? ఎన్ని సులభమైన మార్గాల్లేవు? విద్యుచ్ఛక్తి అందుబాటులోకి వొచ్చింది గదా!

బావిలోకి దూకటం, ఎవ్వరో ఒకరు జుట్టు పట్టుకొని పైకి లాగటం, ఒడ్డున వెయ్యటం, ఎటు పడిన కాలు అటుగా, ఎటు వేసిన చెయ్యి అటుగా ఉంచుకొని వెల్లకిలా పడుకొని, ఆకాశం వైపు నక్షత్రాలు లెక్కపోడుతున్నట్టు చూస్తూ వుండటం ఎంత ఘోరం! ఎంత అసహ్యం! ఎంత నీచం, చచ్చిం తరువాత ఏమైతేనేం, మేము చూడొచ్చామా అనుకుంటే చచ్చి సాధిద్దామనేగా ఈ

ప్రయత్నం. భర్తల్ని ప్రపంచం ఏవగించుకొనేటట్ట చెయ్యాలనీ, బజార్న వెళ్తుంటే, “వాడే, వాడే” అని ఇతరులు చెప్పుకునేటట్టు చెయ్యాలనీ - అదేగా వీళ్ళ అభిలాష? మానవులు పశువులకు ఎంత దగ్గర్లో వున్నారో అనుక్షణం జ్ఞాపకం చేస్తుందీ ఆడజాతి!

ఆడవాళ్ళ మీద కోపంతో అతనికి ధైర్యం వొచ్చింది. తటాలున బావిలోకి తొంగి చూశాడు. బుడగలు కనిపించాయి. అతని గుండె దడ దడ కొట్టుకుంది. నీళ్ళలో జుట్టు తేలుతున్నట్టు కనిపించింది. అది పిల్లలు వేసిన గడ్డి, గడ్డికీ, ఆడవాళ్ళ జుట్టుకీ అంత దగ్గర సంబంధం ఉందని అతనికి ఎప్పుడూ తోచలేదు.

అతనికి భార్య మీద కోపం వొచ్చింది. తన్ను అనవసరంగా ఎంత క్షోభ పెట్టింది. దొడ్లో నుంచి తన భార్య వస్తూ వుంది. ఆమె కంట పడేటప్పటికీ వొళ్ళు చురచురా మండిపోయింది. తన్నింత కష్టపెట్టి ఏమీ ఎరగనట్టు నంగనాచికి మల్లే, అడుగులో అడుగు వేసుకుంటూ వొస్తూంది. ఇంట్లోనే ఉంది, చెక్కు చెదరకుండా వుండి తన్నెంత వేదన పెట్టింది. పాప వెంట వస్తూంది.

ఎదురుగా వెళ్ళాడు - "ఏం చేస్తున్నావిక్కడ?" అని అడిగాడు.

ఆమె మాట్లాడలేదు.

"చెప్పవేం?" అన్నాడు.

"ఏముంది చెప్పటానికి? ఇంట్లోకి వెళ్తున్నాను" అంది. అతన్ని నఖశిఖ పర్యంతం చూస్తూ నిలబడింది.

ఆ చూపులు అతనికి తను పెంచిన కుక్కను జ్ఞప్తికి తెచ్చినయి. ఆ కుక్క అలాగే చూసేది. చూపుల్లో అర్థం వుండేది కాదు. తన్నేదో పరీక్షిస్తున్నట్టూ, తన హృదయంలో వున్న రహస్యాలు తెలుసుకోటానికి ప్రయత్నిస్తున్నట్టూ చూసేది.

"ఎందుకట్లా చూస్తావు?" అని అడిగాడు. పాప గజగజలాడుతూ తల్లి వెనక నక్కింది.

ఆమె మాట్లాడలేదు. తన కుక్క కూడా ఇంతే! కసిరినా తన్ను విడిచి పెట్టేది కాదు. చూపులు మానేది కాదు. "నీ సంగతి నాకు తెలుసులే" అన్నట్లు చూసేది. కొడితే "కుయ్యో - కుయ్యో" అనేది. మళ్ళీ అట్లాగే చూసేది.

"ఏం, కొడతావా?"

"నేనేం కొడతాను?" అంది. ఎందుకంట నిస్పృహ - తన కుక్కా అంతే, అతనికి వొళ్ళు మండింది.

"అయితే నేను కొడతాను" అని చెంప మీద ఛడేలున కొట్టాడు. పాప కెవ్వుమన్నది. కాని ఆమె అలాగే చూస్తూ నిలబడి పోయింది.

అతను కొట్టాడు, తన భార్యను కొట్టాడు. అతని శరీరం భయంతో వణికిపోయింది. ఆయాసం ఎక్కువై వగర్పు పుట్టింది తను కొట్టాడు. చుట్టూ వున్న వస్తువులు ఏదీ అతనికీ కనపట్టం లేదు. అంతా అయోమయం అయింది. లోపల నరాలు చిటేలు చిటేలున విరుగుతున్నట్టు అనిపించింది.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

13 వ భాగం

తను భార్యను కొట్టాడు. భార్య మీద చెయ్యి చేసుకున్నాడు. బజార్లో జట్కాలు తిరుగుతూనే వున్నాయి. మనుష్యులు ఎవ్వరి పనులు వాళ్ళు చేసుకుంటూనే వున్నారు. ప్రపంచం యధాప్రకారం నడుస్తూనే వుంది. సూర్యుడు పడమటే అస్తమిస్తాడు. తూర్పునే ఉదయిస్తాడు. తను భార్యని కొట్టడంలో ఈ ప్రపంచానికి ఏమీ సంబంధం లేదా-?

అతనికి గింగిర్లు ఎత్తినయి. శరీరం అంతా సూదులు పెట్టి గుచ్చుతున్నట్లు ఉంది. అక్కడ వుండలేకపోయాడు.

అసమర్ధుని అంతం

సీతారామారావు ఇంట్లో వున్న ప్రతి వస్తువూ తన్ను ఎక్కిరిస్తున్నట్టూ, తన్ను చూచి వికట్టాహాసం చేస్తున్నట్టూ కనిపించింది. పెళ్ళిలో తనూ, తన భార్య తీయించుకున్న ఫోటో గోడకు వేలాడుతూ వుంది. ఆమె కుర్చీలో కూర్చొని వుంది. తను ప్రక్కన నుంచొని వున్నాడు. ఆ రోజు అతనికి బాగా జ్ఞాపకం వుంది.

ఆమె నుంచొని వుండగా, కూర్చోడానికి చలా సిగ్గుపడింది. తన భార్యని కూచోబెట్టి తాను ఎందుకు నుంచున్నాడు? నుంచున్న తను సంతోషంగానే వున్నాడు గాన, కూర్చున్న తన భార్య చాలా విచారంగా వున్నట్టు కనిపించింది. మూడో క్లాసు టిక్కెట్టుతో పురుషుల బండిలో కూర్చోవలసి వొచ్చిన బంట్రోతుకు మల్లే. సర్కస్‌లో పెద్ద పులి వీపు మీద నుంచున్న మేకకి మల్లే - ఆమె కుర్చీలో కూర్చుని వుంది.

మరొక ఫోటోలో హార్మోనియం ముందు పెట్టుకుని కూర్చొని వుంది. గడ్డి మాటలు ముందు పెట్టుకుని కూర్చున్న మాల వాళ్ళు అతనికి జ్ఞాపకానికి వచ్చారు. ఇవన్నీ ఒకప్పుడు తన్ను ఎలా ఆకర్షించాయో ఆమె సర్వస్వం అని - తను ఎలా అనుకోగలిగాడో అతనికీ అర్థం కాలేదు. అప్పుడు తనే స్థితిలో వున్నాడు? తన సంసారం, అభిరుచులు ఎలా వుండేవి? తనను గురించి తనకు తెలుసుకోవాలని పించింది.

తాను రాసుకున్న డైరీ తీసి చదువుకోవటం మొదలుపెట్టాడు. అతనికి ఆశ్చర్యం వేసింది. ఏదో, ఎక్కడో జరిగిన నవల చదువుతున్నట్లు అనిపించింది. అందులో వున్న వ్యక్తి కథానాయకుడిగా కనిపించాడు గాని, సాధారణ మానవుడిగా కనిపించలేదు. తనేనని తోచనే తోచలేదు. చదువుతూ పేజీలు తిరగవేస్తున్నాడు.

జులై 2:

అతనూ, అతని భార్యా సముద్రం ఒడ్డున కూర్చొని సూర్యాస్తమయాన్ని చూశారు.

అప్పుడు తను తన భార్యని అడిగాడు - "మొదట్లో నీవు నన్ను ఎప్పుడు ప్రేమించావు?"

ఆమె సిగ్గుపడింది.

"చెప్పు, ఇందీ, నాతో చెప్పవూ!" అని దగ్గరకు తీసుకుంటూ అడిగాడు.

ఆమె తల వాల్చింది.

"ఏదీ, ఇటు చూడు.... చెప్పు...."

"ఎప్పుడూ ప్రేమిస్తూనే వున్నాను" అని సిగ్గుతో మొహం చేతుల్తో కప్పుకుంది.

ఆ జవాబు అతనికి తృప్తినివ్వలేదు -"అలా కాదు. మరీ మొదట్లో ఓం ప్రథమంలో -" అని అడిగాడు.

"పోనిద్దురూ" అంది చిరునవ్వు నవ్వుతూ.

"చెప్పు నాతో చెప్పడానికి సిగ్గెందుకు?"

చివరకు ఆమె చెప్పింది. ఒక రోజు ఆమె గురుకులానికి వెళుతూ పుస్తకాలు చంకలో పెట్టుకుని చకచకా నడిచి వెళ్తున్న అతన్ని చూచిందట. చూచీ చూట్టంతోనే ప్రేమించిందట!

"అప్పుడు నేను ఏ చొక్కా వేసుకున్నాను?"

"పక్క గుండాల సిల్కు లాల్చీ వేసుకున్నారు."

తను వేసుకున్న చొక్కా కూడా జ్ఞాపకం వున్నందుకు సంతోషం వేసింది - "అప్పుడు నీ మనస్సులో ఏమనుకున్నావు?"

ఆమె చిరునవ్వు నవ్వుతూ ఓర చూపు చూసింది.

"ఆయన నా భర్త అయితే బావుండును" అనుకున్నావు కదూ. దొంగా!" అని చక్కలిగింతలు పెట్టాడు.

జులై 3:

సాయంకాలం అతనూ అతని భార్యా పుష్పవనంలో ఒక పూల చెట్టు కింద కూర్చున్నారు........ చల్లని గాలి వీస్తూ వుంది. ఆమె ముంగురులు గాలికి చెదురుతూ వున్నాయి.

"నన్ను ఏం చూసి ప్రేమించావు ఇందీ?" అని అడిగాడు.

ఆమెకు చెప్పటం చేతకాలేదు. ఆమె అతన్ని నఖశిఖ పర్యంతం ప్రేమించింది.

"చెప్పు?"

"కోటేరు వంటి మీ ముక్కు."

అతనికి ఆ జవాబు నచ్చింది.

"అంత బాగుంటుందా?" అని అడిగాడు.

"మరే!" కనురెప్పలు ఆర్పింది.

ముంగురులు సవరించింది.

అతడు ఆప్యాయంగా దగ్గరకు తీసుకొని, ముద్దు పెట్టుకున్నాడు "ఇందీ, నా ఇందీ" అంటూ

జులై 4:

ఒక డింగీలో కృష్ణానదిలో ప్రయాణం చేసి, ఒక లంక జేరారు. అక్కడ వున్నంతసేపూ అతనికీ ప్రపంచంలో ఎవ్వరికీ అందని ఉన్నత స్థాయిలో తాము వున్నట్టు అనిపించింది.

"మనం అదృష్టవంతులం."

"నేనూ ...."మొదటి అక్షరం వొత్తి పలికింది.

"నేను మాత్రం కాదూ? మనలాగే నిష్కల్మషంగా, పవిత్రంగా నిర్మలంగా, అమితంగా ప్రేమించుకునే వాళ్ళీ ప్రపంచంలో లేరు" అన్నాడు.

"నిజమేనండి" అని నిట్టూర్పు విడిచింది.

"అండి అనకు, నేనే నీవు నీవే నేను."

"ఏమనుకుంటారు, మరి?"

"పేరున పిలువు"

“అబ్బా! మీ పేరు పెద్దదండీ?”

“రామూ అని పిలువూ”

ఆమె సిగ్గు పడింది.

“నేను ‘ఇందీ’ అని పిలవటంలా?”

“........”

“అయితే నేను ఇందిరా దేవిగారూ అని పిలుస్తాను”

“వొద్దు - వొద్దు” అని బతిమాలింది. “చూశారు గదూ?” అని అలిగింది.

“మరి నేను పేరున పిలిస్తే”

ఆమె పిలిచింది. అతని హృదయం ఆనందంతో నిండిపోయింది.

“మళ్ళీ” అన్నాడు.

ఆమె పిలిచింది - “రామూ!”

“ఇంకొంచెం బిగ్గరగా!”

ఆమె పిలిచింది. తన కంఠధ్వనికి తానే సిగ్గుపడి అతని వొళ్ళో తల దాచుకుంది. అతడు ఆమె తల నిమురుతూ పరవశత్వం పొందాడు. ఇంత ఆనందం ప్రపంచంలో ఎవ్వరు అనుభవిస్తున్నారు?

ఆనందో బ్రహ్మ.

జులై 5:

అతడు చెప్పాడు -

“మన జీవితం ఎల్లపుడూ ఇలాగే జరగాలి”

ఆమెకు భయం వేసింది.

"మన శరీరాలు వేరయినా, ఆత్మలు ఒక్కటే అన్నాడు."

ఆమె తల వూపింది - ఆమెకు గురుకులంలో అందరి ఆత్మలూ ఒకటేనని చెప్పారు.

కాబట్టి మన మధ్య రహస్యాలుండకూడదు" అన్నాడు.

ఆమెకు భయం వేసింది - ఈ మాట ఎందుకు అంటున్నాడో తెలియక.

అతడు గ్రహించి - "ఇప్పుడున్నాయని కాదు. ఎప్పుడూ ఉండకూడదు. జరిగే విషయం

కాకుండా, మనస్సుల్లో కలిగే భావాలను కూడా ఒకరి కొకరం చెప్పుకుందాం - ఎటు వంటి భావం అయినా సరే. మనకి ఒకరి మధ్య ఒకరికీ భయం ఎందుకు? అన్ని విషయాలూ నిండు హృదయాలతో చర్చించుకుందాం. అప్పుడు మన నిర్మల ప్రేమ నిర్విఘ్నంగా సాగిపోతుంది" అన్నాడు.

ఆమె అంగీకరించింది.

ఇక చదవలేకపోయాడు. హృదయంలో బాకులు కదిలినయ్. ఎవరీ వ్యక్తి? తనేనా? అప్పటి ఆమేనా తన భార్య? ఆ జీవితం తాము గడిపినదేనా! ఆ ప్రేమ, ఆ భావాలు తాము వెలిబుచ్చినవేనా! ఆ ఆదర్శాలు ఆ ఆశయాలు తనవేనా?

తను ఎంత మారిపోయాడు! అనుక్షణం మారుతూ వుండటం వల్ల తనలో వచ్చిన తీవ్రమైన మార్పు తనకు తెలియదు; కాని వెనక్కి తిరిగి చూసుకుంటే, అప్పటి తనతో ఈనాటి తనను పోల్చి చూసుకుంటే, గుండె గుభేలు మంది. ఒకప్పుడు తనలో అన్ని ఉన్నత భావాలు వుండేవా? తన హృదయం అంత పవిత్రంగా వుండేదా? తాను అంత మారాడా? అధఃపాతాళానిక పోతున్నాడా?

గబగబా వెళ్ళి, అద్దంలో తన మొహం చూచుకున్నాడు. అతని గుండెలు పగిలినయి. సన్నని భయంకరమైన మూలుగు అతని కంఠంలో నుంచి బయటపడింది.

నిజంగా తను మారాడు - భావాలతో పాటు ఆకారం కూడా మారింది. కళ్లు గుంటలు పడినయ్. నల్లని గడ్డుని తెల్లపొర కప్పుతూ వుంది. నుదురు మీద అరలు ఏర్పడినయ్. పెదిమల పక్క గీతలు కనిపిస్తున్నాయి. కింది పెదవి బరువు ఎక్కువయి, పట్టు తప్పి, వదులు వదులుగా ఉంది. దవడ కింది భాగం ముందుకు పొడుచుకుని వచ్చింది. అతనికి ఆకస్మాత్తుగా నెమరు వేసే గేదె జ్ఞాపకం వచ్చింది. వేదనతో ఉడికి పోయాడు. తన పెళ్ళినాటి ఫోటో చూశాడు. అద్దంలో అప్పటి తన ముఖం చూశాడు. "ఇందులో ఎవర్ని నేను? ఎవర్ని? ఆ సౌమ్యమూర్తినా? ఈ పిశాచాన్నా ఎవర్ని? ఎవర్ని?"

ఈ ప్రశ్నకు జవాబు లేదు. సౌమ్యమూర్తి విచారంగా చూసింది. పిశాచం భయపెట్టింది. అతనికి తన శరీరం పెరుగుతున్నట్టు

అనిపించింది. ఇల్లు యిరుకైంది. కత్తుల బోనయింది. తన శరీరం పట్టటం లేదు. బయటకు వెళ్ళాడు. ఎక్కడకు వెళితే ఏం? వెళ్ళకపోతే ఏం? అసలు ఎక్కడికో ఒక చోటికి వెళ్ళాలని ఎక్కడుంది? వెళ్ళటమే కావాలి. ఎక్కడికి అనేది అనవసరం అయిన ప్రశ్న. అతడు వెళుతున్నాడు. నడుస్తున్న అతనికీ ఆకస్మాత్తుగా తన దుఃస్థితికి తన స్నేహితులే కారణం అనిపించింది. వాళ్ళంతా తనలాంటి వాళ్ళే. జీవిత ప్రవాహంలో కలవలేక, వెనకపడి ఎవరిక వాళ్ళే ఒక చిన్న ప్రపంచంగా, ద్వీపకల్పంగా తయారయి తమ పాపాలను తామే మొయ్యలేక బాధపడుతున్న వాళ్ళే!

అతను ఒక్కొక్కళ్ళను గురించి ఆలోచించాడు. బజార్నపడి నడుస్తూనే వున్నాడు. ఆలోచిస్తూనే వున్నాడు. అతనికి మట్టుకి నడుస్తూన్నట్టు లేదు. ఆలోచిస్తున్నట్టు లేదు.

అతని స్నేహితులలో ముఖ్యుడయిన సూర్యారావు ఒకప్పుడు కథలూ, వ్యాసాలూ రాస్తూండే వాడు. కొన్ని తిరిగి మళ్ళీ అతని దగ్గరికే వచ్చేవి. భూమి గుండ్రంగా వుండటమే దీనికి కారణం అనుకునే వాడు. వాదించే వాడు, నిరూపించే వాడు.

ప్రస్తుతం రాయటం మానుకున్నాడు. మన దేశంలో పేరున్న రచయితలు ఇతర దేశ రచయితల నుంచి ఏమేమి కాపీ కొట్టి పేరు గడించారో పరిశోధనలు చేస్తున్నాడు. ఏ పుస్తకం బాగుందన్నా అతను సహించలేడు. వెంటనే ఏ ఇంగ్లీషు పుస్తకం కాపీయో చెప్పేస్తాడు. అలా పుస్తకం పేరు చెప్పటానికి యేదయినా యిబ్బంది కలిగితే "నేను ఎక్కడో చదివినట్టుంది యిది తప్పకుండా కాపీ యే! లేకపోతే మన వాళ్ళు యింత బాగా రాయకేం!" అంటాడు. "పోనీ నువ్వు బాగా రాసి చూపరాదా!" అంటే "రచన వేస్తే ఉత్తమ రచనే చెయ్యాలి" అంటాడు.

"అలాగే చెయ్యి"

"అది నా పని కాదు. ఈ కుర్చీ బాగా లేకుంటే ఇంత కంటే మంచిది చేసి చూపమనటం కేవలం వెర్రి. అది నా వృత్తి కాదు" అని జవాబు చెపుతాడు.

ప్రస్తుతం మన సారసత్వం "నానాటికి తీసికట్టు నాగంబొట్టూ" గా వుండటానిక కారాణాలు పోగు చేస్తున్నాడు. ఈ విషయం మీద తాను విసుకోక్కుండా శ్రోతలను విసిగిస్తూ రోజులు తరబడి మాట్లాడగలడు.

"మన రచనల్లో తెలుగు నుడికారం, తెలుగు జీవితం, తెలుగుతనం, తెలుగు జాతీయత వుట్టి పడుతుండాలి, అప్పుడే మనం ఉత్తమ రచనలు చెయ్యగలుగుతాం..." అంటాడు.

"అంటే ఏమి చెయ్యాలి?"

అతను యే మాత్రం తడుముకోకుండా జవాబు చెపుతాడు! "మనకు కృష్ణమ్మ తల్లి వుండగా యమునా నదిని గురించి వ్రాయటం యెందుకు? మనకు వేమన వుండగా భక్త తుకారాం గురించి వ్రాయటం యెందుకు? మనకు తెలుగు యోధులు అనేక మంది వుండగా, శివాజీని గురించి వ్రాయటం ఎందుకు?" అని కరతాళ ధ్వనుల కోసం ఎదురు చూస్తాడు.

ఇలా గంటల తరబడి మాట్లాడి, చివరికి "ఏమీ లాభం లేదు. విదేశ ప్రభుత్వం పోతే కాని మనం ఉత్తమ రచనలు చెయ్యలేం"

అని తేలుస్తాడు.

అతనిలో వున్న సుగుణం ఏమిటంటే చనిపోయిన రచయితను పొగుడుతాడు. రచయిత గొప్పదనం మరణించడం మీద ఆధారపడి వుంటుంది.

రెండో అతను శాతవాహనుడు. మాటల్లో విచిత్రతా ఇడ్లీ మీదికి కారప్పొడీ ఇతనికి యిష్టం. ‘‘నేను సుఖపడను, యితరులను సుఖపడనివ్వను’’ అంటాడు.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

14 వ భాగం

ఈ విషయాన్ని గురించి అతనొక గేయం రాశాడు......

"అనురాగం అంబరమైతే

ఆనందం అర్ణవమైతే

మేం తోకచుక్కగా వస్తాం

బడబానలమై మండిస్తాం

ప్రపంచం మొక నందనవనమై

జీవితమొక గులాబి ఐతే

మేం ముళ్ళ తొడుగుగా ఉంటాం

సుస్వప్నం భంగపరుస్తాం

జీవితమను కేళీగృహములో

సుఖమే ఒక విరిపాన్పయితే

మేం కాల సర్పమై వస్తాం

విషాద విషజ్వాలలు తెస్తాం

మీ నిద్రా సుఖ సమయంలో

స్వాప్నిక ప్రశాంతి నిలయంలో

మేం పీడకలలుగా వస్తాం

రౌరదృశ్యము చూపిస్తాం

మీ స్వప్న లోక యాత్రల్లో

మీ హేమాసవ పాత్రల్లో

కన్నీటి ధార నింపేస్తాం

మీ బాటను జారుడు చేస్తాం

పానకపు పుడకగా వొస్తాం

టీ కప్పులో ఈగై చస్తాం."

మీ శాంతిని భగ్నం చేస్తాం

మీ శాంతిని భగ్నం చేస్తాం"

"ఏమిటీ వేషం?" అని అడిగితే జవాబు గేయంలోనే చెప్పేవాడు.

"కాషాయం విషాన్నం

నీ కోసం కాదీవేశం"

"ఎందుకిల్లా వూరికనే తిరుగుతావు" అని అడిగితే జవాబు ఇలా చెబుతాడు..

"తిరుగుడా మూర్ఖుడా

తిరుగుళ్ళో అరుగుడుందే

అదేగా లోకానికి విరుగుడు!'

ఇతనికి పిల్లలంటే అసహ్యం. కళ్ళబడితేనే ఉలిక్కిబడతాడు. వాళ్ళలో తన ప్రతిబింబం నగ్నంగా కనిపిస్తుందో ఏమో? వాళ్ళకూ తనకు మల్లేనే విచిత్రత అంటే ఇష్టం. తాను యెంతో ఆలోచించి గేయ రూపంలో పెట్ట గలిగింది వాళ్ళు ఏ ఆలోచనా లేకుండా మాట్లాడగలరు, "ఎందుకు పసిపిల్లలంటే నీకింత కంటకం?" అని అడిగితే అతను చెపుతాడు -

"పళ్ళు లేని పసిపిల్లలు

కళ్ళు లేని కబోది పక్షులు

జగన్మాత విదిలించిన మసిబొగ్గులు.....

ఒంటేలికి పోస్తే తంటా లేదంటావా?"

ఈ విచిత్ర వ్యక్తిలో మరీ విచిత్రం ఏమిటంటే, యిన్ని చెప్పే ఇతను, జీవితాన్ని ఎంతో నిర్లక్ష్యం చేసే ఇతను ఆకలికి దాసుడు. ఆకలి ముందు స్నేహితులు అగరు, కవిత్వం ఆగదు. తన అనార్కిస్ట్ సిద్ధాంతం ఆగదు.

ఇడ్లీ మీదకు కారప్పొడో భోజనంలోకి కొబ్బరి పచ్చడో లేకపోతే ఇంత మొహం చేసుకొని కొట్లాడతాడు. ఇక తన జీవితంలో ఈ కారప్పొడి, పచ్చడి తినే భాగ్యం ఇప్పట్లో రాదు అన్నట్లు ప్రవర్తిస్తాడు. తన జీవితంలో సుఖపడే పెద్ద అవకాశం ఆ కాఫీ హోటలు సర్వరూ, ఇంట్లో తన తల్లీ పొట్టన పెట్టుకున్నట్టు బాధపడతాడు.

బాల కృష్ణుడు తండ్రి కొడుకు. ప్రతి చిన్న విషయానికి "మా నాన్న వున్నాడు చూశారూ......" అంటూ వుంటాడు. వాళ్ళ నాన్న చెప్పని విషయం లేదు. ఈ ప్రపంచంలో జరిగేవన్నీ ఇంట్లో కదలకుండా కూర్చుని ముందే చెప్పేస్తూ వుంటాడు. అవన్నీ అతను చెప్పినవి చెప్పినట్టు అక్షరాలా జరుగుతూ వుంటాయి.

ఈ సంవత్సరం రోహిణి కార్తెలో ఎండలు ఉండవని ఆయన గత సంవత్సరం రోహిణికే చెప్పాడు. ఇక ముందు పుట్టబోయే పిల్లలకు ముక్కులుండవని ఆయన పది సంవత్సరాల కిందే చెప్పి అట్టి పెట్టాడు. యుద్ధానంతరం కలరా ఎక్కువగా వుంటుందని ఆయన యుద్ధం రాక ముందే చెప్పాడు. "చూడండి! అక్షరాలా జరుగుతున్నాయి" అంటాడు బాలకృష్ణుడు. "మా నాన్న వున్నాడు చూశారూ, ఆయన దివ్యదృష్టి అమోఘం!" అంటాడు.

అతడు తండ్రికి బానిస. తన తండ్రి గొప్పతనానికి దృష్టాంతరాలను పోగు చేస్తూ, ఇతరులకు నిరూపించి చెపుతూ జీవితం గడుపుతున్నాడు. "మా నాన్న వున్నాడు చూశారూ..." అంటాడే గాని తను ఏమన్నది ఎప్పుడూ చెప్పడు. తను ఏమీ అనడు.

తను ఒకప్పుడు ఏమన్నా అన్నా అది ఎప్పుడో వాళ్ళ నాన్న మాట్లాడిన విషయమే అయి ఉంటుంది. వాళ్ళ నాన్న దగ్గరకు అనేక మంది వస్తుంటారు. సలహాలు తీసుకుంటూ వుంటారు. ఆ సలహాలు ఆచరణలో పెట్టి గొప్ప వాళ్ళవుతారు. ఈ విధంగా గొప్ప వాళ్ళయిన వాళ్ళన్ని శాఖల్లోనూ వున్నారు. కాని ఒక్కరూ కృతజ్ఞత చూపరు. పైగా ఎప్పుడయినా తన తండ్రి కలవటం తటస్థిస్తే ఎరగనట్టు నటిస్తారు.

"ఏమిటి కారణం?"

"మా నాన్న ముందు తమ తక్కువతనాన్ని కప్పి పుచ్చుకోటానికి అది వొక ఎత్తు".

"పోనీ! ఎల్లకాలం ఇతర్లను గొప్పవాళ్లు చేస్తూ కూర్చోకపోతే తనే గొప్పవాడవగూడదూ?"

"అదే మా నాన్న గొప్పతనం. తన సంగతి ఎప్పుడూ ఆలోచించడు"

అతని మాటలు వింటూ వుంటే, సీతారామారావుకి ఒక్కొక్కప్పుడు కోపం వస్తుండేది. ఒక్కొక్కప్పుడు ఈర్ష్య కలుగుతూ వుండేది. ఇతరుల తండ్రులు శుంఠలు అయినట్లూ, తనకూ తండ్రి అంటే భక్తే. కాని బయటకు చెప్పకోటానికి బాలకృష్ణునికి

వున్న ధైర్యం తనకు లేదు. తనకు లేని ధైర్యం అతనికి వున్నందుకు ఈర్ష్య.

ఒక రోజు బాలకృష్ణుడు మాట్లాడుతుంటే ఆగలేక "మీ నాన్న గొప్పవాడా, మా నాన్న గొప్పవాడా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు బాల కృష్ణుడు నిరుత్తరుడయ్యాడు. తెరిచిన నోరు ముయ్యకుండా చూస్తూ కూర్చున్నాడు. ఏమీ మాట్లాడలేదు.

కాని బయటకు వెళ్ళి "అదేమిటోయ్, సీతారామారావు తండ్రిని పొగుడుకుంటాడు" అని ఎరిగిన వాళ్ళందరికీ చెప్పాడు. ఒక్క చెప్పటమే కాదు! అలా తండ్రిని పొగుడుకోవటం పశు లక్షణమనీ, సంస్కారం వున్న వాళ్ళెవరూ ఆ పని చెయ్యరనీ నిరూపించి, అందర్నీ ఏకగ్రీవంగా ఒప్పించాడు.

శివరావు మరొక రకం. తన్ను గురించి ఎవళ్ళెవళ్ళు గొప్పగా చెప్పుకుంటుందీ ఏకరువు పెడతాడు. వాళ్ళ అభిప్రాయాలకు విలువ రావటానికి ముందు తన్ను పొగుడుతున్న వాళ్ళు ఎంత గొప్ప వాళ్ళో నిరూపించి, తరువాత తనని గురించి వాళ్ళిచ్చిన అమూల్యాభిప్రాయాలను బయట పెడతాడు.

ఒకతనికి ప్రపంచంలో ఎవరన్నా పడదు. తనంటే మాత్రం అతడు పడి ఛస్తాడు.

ఒక గొప్పవాడు తను రెండు రోజులు కనబడకపోతే ఉద్యోగానికి సెలవు పెట్టి తన్ను వెతుక్కుంటూ వస్తాడు.

మరొకడు అతి గోప్యంగా ఉంచవలసిన కుటుంబ వ్యవహారాలు కూడా తనతో చర్చిస్తాడు. తన దగ్గరకు వచ్చి "ఏమోయ్ - నా భార్య సంగతి నాకు అనుమానంగా వుంది ఏం చెయ్యమంటావు?" అని అడుగుతాడు.

ఇక ఆడవాళ్ళని గురించి అతను కోసే కోతలు, వేసే అపవాదులు ఆహ్లాదకరంగా వుంటాయి. చెవులు కోసుకుని వినబుద్ధి అవుతుంది. ఊళ్లో ఆడవాళ్ళంతా తన్ను చూచి ఆగలేకపోతున్నట్లు మాట్లాడుతాడు.

"అదేమిటోయ్, బజార్న నడవనివ్వరేం?" అని అడుగుతాడు.

"వద్దు వద్దన్న కొద్దీ డబ్బు గిరాటు వేసి పోతారేమిటోయ్?" అంటాడు.

చేతి ఉంగరం చూపిస్తూ "మనం కొనకేం? నిన్న బజార్నుంచి ఇంటికి వెళ్ళేటప్పటికి ఒకామె ప్రత్యక్షం ...... ఒద్దన్న కొద్దీ వేలికి తగిలించి పోయింది. అబ్బా, రాత్రంతా నిద్రలేదోయ్....." అని ఆవలిస్తాడు.

విచారంగా మొహం పెట్టి "ఆడవాళ్ళని తగిలించుకోవడం తేలికే. వదిలించుకోవడం బ్రహ్మ ప్రళయం" అంటాడు.

అతను మాట్లాడేవన్నీ అబద్ధాలేనని మిగిలిన వాళ్ళందరికీ తెలుసు. కాని, ఆ కథలే అతనితో మళ్ళీ మళ్ళీ చెప్పించుకొని ఆనంద పడుతుండే వాళ్ళు. అపవాదుకున్న ఆకర్షణ ఈ ప్రపంచంలో ఆడదానికి లేదు, అపవాదు ఇచ్చే ఆహ్లాదం మరొకటి ఇవ్వలేదు.

వీళ్ళంతా జ్ఞాపకం వచ్చేటప్పటికి సీతారామారావుకి కంపరం పుట్టింది. ఒకప్పుడు తన స్నేహితులు కూడా తనకు మల్లే జీవిత క్లేశాలను లెక్క చెయ్యక సంఘానికి ఎదురు తిరిగే వాళ్ళేనని, ఎవర్నీ లెక్క చెయ్యని స్వాతంత్ర్య ప్రియులేనని సంతోషించాడు. ఇప్పుడొట్టి మాటల పోగులుగా కన్పిస్తున్నారు వీళ్ళు.

ప్రపంచం నిర్లక్ష్యం చేస్తుంటే, మాటలతో దాని దృష్టిని ఆకర్షించటానికి ప్రయత్నిస్తున్నారు. తమ అసమర్థతను మాటల తొడుగుతో కప్పిపుచ్చటానికి ప్రయత్నిస్తున్నారు. జీవితాన్ని అనుభవించలేక, జీవితపు లోతులను తడివి చూపలేక, మాటలతో ఆత్మవంచన చేసుకుంటున్నారు.

మాటల్ని నమ్ముకొని, అమ్ముకొని తృప్తి పడుతున్నారు. మాటలు - మాటలు - మాటలు - ఎడతెరిపి లేని మాటలు అంతులేని సంభాషణ, విరామం లేని చర్చలూ - వాగ్వివాదాలూ - మాటల్తో ఒకర్నొకరు గెలవాలనే తాపత్రయం ఇదీ తాము నిత్యం చేస్తున్న పని. పైగా ఏదో ఒక పని చేస్తున్న వాళ్ళని విమర్శించటం నిందించటం, ఏదో ఒక పని చేసే వాళ్ళల్లో తప్పులు దొరుకుతాయి.

ఏ పనీ చెయ్యని వాళ్ళలో తప్పులేముంటాయి? కాబట్టి తాము తప్పులు చేస్తున్న వాళ్ళ కంటే అనేక రెట్లు గొప్పవాళ్ళమనుకునే వాళ్ళు.

ఇవన్నీ జ్ఞాపకం వచ్చి రోడ్డు మీద నడుస్తూ వున్న సీతారామారావు టపాలున ఆగిపోయి, అరికాలుతో రోడ్డుని శక్తి కొద్దీ ఒక తన్ను తన్ని "నా పతనానికి వీళ్ళే కారణం. నా స్నేహితులే కారణం, సంవత్సరాల తరబడి వీళ్ళు తప్ప నాకు ప్రపంచం లేదు. వీళ్ళని బట్టి నా స్వభావం మారిపోయింది. వీళ్ళ మూలంగానే నేను పనికిమాలిన వాడినయ్యాను!" అని బిగ్గరగా అరిచాడు.

అరవటం మరొక సంగతి జ్ఞాపకం రావటం - రెండూ ఒకేసారి జరిగినయ్ సీతారామారావుకి.

వాళ్ళ మూలాన నేను చెడిపోయాననుకోటానికి ఎట్లా వీలు? నా మూలానే వాళ్ళు చెడిపోయారేమో? వాళ్ళీ స్థితికి రావటానికి నేనే కారణం ఏమో? వాళ్ళకీ ఇన్నేళ్ళుగా నేనే ప్రపంచం అయి, నా సంపర్కం వల్లే వాళ్ళు లోకానికి పనికి రాకుండా పోలేదు గదా!

ఇంత మంది జనాభాలో వాళ్లకి నేనూ, నాకు వాళ్లూ ఎందుకు తటస్థపడాలి? వాళ్ళకీ నాకూ ఏమిటి సంబంధం? ఒకరి కొకరికి ఎందుకు స్నేహం ఏర్పడింది?

మా అందరికీ ఒకే గుణం వుండి వుండాలి. అంతా ఒక రకం గనకే స్నేహం ఏర్పడింది.

ఇక ఒకరి వల్ల ఒకరు చెడటం ఏమిటి? చెడే కలిశాం. కలిసే చెడ్డాం." అనుకున్నాడు.

దీని కంతా తమ బలహీనత తను అల్పత్వమే కారణం అనిపించేట్టికి సీతారామారావుకి ఎదురు గుండా వస్తున్న పెద్దమనిషి అగ్గి పెట్టి నెపంతో ఆపి కాలికి మెలిక వేసి, పడేసి, మొహం రక్కాలనిపించింది. వెంటనే మహారణ్యాల్లోకి వెళ్ళి దారులు కొట్టి బతకాలనిపించింది. ...... ఆ మహారణ్యంలో జీవితం ఎంత స్వేచ్ఛగా ఉంటుంది......

అర్థరాత్రి రెండెండ్లబళ్ళు వస్తుంటాయి. ఆ బళ్ళల్లో మొగవాళ్ళు ఆడవాళ్ళు, పిల్ల జెల్లలు - అంతా కిక్కిరిసి కూర్చునుంటారు. ఎడ్ల మెడలకున్న గంటలు గణగణ గణగణ మోగుతుంటాయి. ఆ బళ్ల తొట్లలో కూర్చుని బళ్ళు తోలుతున్న వాళ్ల భయం పోగొట్టుకోడానికి ఆంజనేయ దండకం పఠిస్తూ వుంటారు!

"శ్రీ ఆంజనేయం

ప్రసన్నాంజనేయం

ప్రభాదివ్య కాయం

ప్రశస్త ప్రకారం....."

అంటూ వుంటారు. ఎలుగెత్తి, బళ్ళలో వున్న ఆడవాళ్ళు భయపడుతూనే దొంగల కథలూ, దెయ్యాల కథలూ చెప్పుకుంటూ వుంటారు. దెయ్యాలు మహాకంత్రీవి... ఒక పల్లకీ భుజాన పెట్టుకొని "ఏగోకం బైగోకం" అని బోయీలకు మల్లే శబ్దాలు చేసుకుంటూ ప్రయాణీకులను మోసం చేస్తాయి.

అంతలో దొంగలతోపు వస్తుంది. ఆ తోపు దొంగలకు ప్రసిద్ధి. ఆ చుట్టు ప్రక్కల గ్రామాలకు ఆ పేరు వింటేనే హడల్. బళ్ళల్లో వాళ్ళు ప్రాణాలు బిగపట్టుకుని కూర్చుని వుంటారు. ఎడ్లు కూడా చెవురి రిక్కించి భయం భయంగా ముందుకు అడుగులు వేస్తూంటాయి. ముందుకు చూడకుండా పక్క పొదలవైపుకి చూస్తూ నడుస్తుంటాయి.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

15 వ భాగం

బళ్ళలో వున్న మొగుళ్ళు లేని ఆడవాళ్ళు -

“రాముడేమన్నడే

భద్రాచల రామూడేమన్నాడే”

అని పాడుతూ వుంటారు. అప్పుడు సమయం కోసం పక్క పొదల చాటున వుండి ఎదురు చూస్తున్న తాము ఒక్కసారి దారిలోకి దూకి.....

“ముండల్లారా

మూటల్తెమ్మన్నాడే”

అంటారు.

ఎడ్లు నిలబడిపోతాయి. తొట్లలో కూర్చున్న వాళ్ళ ప్రాణాల ఎగిరిపోతాయి. ఆడవాళ్ళ పిల్లలు “బే” అంటారు. తమ హృదయాలు మాత్రం కరగవు ఎందుకు కరగాలి? ఒక్కొక్కరి నిలబెట్టి దోపిడీ చేస్తారు. ఎవరయినా ఎదురు తిరిగితే యిష్టం వచ్చినట్లు తన్నొచ్చు. అనే వాళ్ళుండరు. ఎక్కడ తమ గౌరవానికి భంగం వస్తుందో అని భయపడవలసిన పని లేదు, తాను ఆ మహారణ్యానికి కంటక కిరీట ధారి - ప్రస్తాన భేరి!

-2-

రోడ్డు మీద నడుస్తున్న సీతారామారావు బిగ్గరగా నవ్వుకున్నాడు. ఈ ఆలోచన అతనికి అమితానందాన్నిచ్చింది. సంఘంలో వున్న కట్టుబాట్లు, నియమాలు ఆచారాలు, న్యాయ శాస్త్రాలు ఏమీ లేకుండా వుండటం అతనికి హాయిగా వుంది. ఇంకా ఆలోచించాడు.

నిలువు దోపిడీ అయిం తర్వాత అతనికి ఒక పని చెయ్యబుద్ధి అయింది. ఆ బళ్ళలో మంచి వయసువున్న పిల్ల ఒకతే వుంటుంది. కాని ఆ అందరికీ మల్లే ఉండదు. అతి నిర్మలంగా, కోమలంగా ఉంటుంది.

కాని ఆ పిల్ల కూడా భయపడుతూ వొణికిపోతూ, కన్నీరు కారుస్తూ ఉంటుంది. దూరంగా ఒక చెట్టుకింద నిలబడి వుంటుంది. తను ఆమెను చూస్తాడు. దగ్గరకు వెళ్తాడు. ఆమెను ఒకసారి నఖశిఖ పర్యంతం చూస్తాడు. ఆమె రెప రెప కొట్టుకుంటూ

వుంటుంది. తన వైఖరిని చూచి మానభంగం అయిందే అనుకుంటుంది. మాన భంగాన్ని గూర్చి అనేక ఊహలు ఊహించుకుంటుంది. అనేక కథలు - తాను విన్నవి - జ్ఞాపకం తెచ్చుకుంటుంది. ఆ ఊహల వల్ల ఆమెకు ఎదురు తిరిగి శరీరం, అందుకు సిద్ధపడుతుంది. నరాలు సడుతుతాయి. శరీరం పాకానికి వొస్తుంది. రక్షించమని పట్టుకుంటుంది.

"ఊరుకో" అంటాడు తను. ఆమెకు ఆ ధ్వని మేఘగర్జనలాగు వినబడుతుంది. ఏ క్షణం ఏమి జరుగుతుందో అని ఆపేక్షగా ఉపేక్షిస్తూ వుంటుంది - పింఛం విప్పుకొని.

తను ఏమీ చెయ్యడు "జాన్" అంటాడు. తన అనుచరులు అంతా చెట్లా చాటుకు వెళ్ళిపోతారు. మానభంగాన్ని గురించి అనేక రకాల ఊహాలను ఊహించుకున్న ఆమెకు భయంతో అనేక దృశ్యాలను కలగన్న ఆ పిల్లకు ఏమీ జరక్కపోయేటప్పటిక ఆశాభంగం అవుతుంది. తీవ్రమైన ఆవేదన బయలుదేరుతుంది. డస్సిపోయి కూలబడుతుంది. ఇంత జరిగిన తర్వాత జన్మజన్మలకూ తన్ను మరచి పోగలుగుతుందా. ఆ పిల్ల? మరచిపోలేదు.

అతని ఆలోచన ఆగిపోయింది. ఎక్కడికి వెళుతున్నాడు తను! చుట్టూ చూశాడు. రామయ్య తాత యిల్లు దగ్గరలో వుంది. అతనిక రామయ్య తాత దగ్గరకు వెళ్ళబుద్ధి అయింది. అతను ఇప్పుడు ఏం చేస్తూ వుంటాడు?

అతను వెళ్ళేటప్పటిక రామయ్య తాత మనుమడితో ఆడుకుంటున్నాడు. మనుమడు వీపు మీద ఎక్కి "గుళ్ళం గుళ్ళం చల్ చల్" అంటున్నాడు.

అంత పెద్దవాడు పసిపిల్ల వాడికి మల్లే ప్రవర్తించటం, తన్ను తాను మరచిపోయి, తన వయస్సు మరచిపోయి తన భావాలు మరచిపోయి తనూ పిల్లవాడికి మల్లే ఆడుకోవటం అతనిక ఏమీ బాగాలేదు. ప్రపంచం ఇంత క్షోభ పడుతుంటే రామయ్య తాత శాంతంగా కాలం గడపటం అతనికి అసహ్యం వేసింది. ఆ క్షణం రామయ్య తాత అతని కళ్ళకు మరుగుజ్జుగా మట్టిపిడచగా, మర్యాద రామన్నగా కనిపించాడు.

రామయ్య తాత అతన్ని చూచి, పిల్లవాణ్ణి దించి, "ఈ జీవితం వుంది చూశావూ-" అని ఉపన్యాసం మొదలు పెట్టాడు.

సీతారామారావుకి వొళ్ళు మండింది. ఈ గుర్రమా తనకు నీతులు ఉపదేశించేది! జీవితాన్ని గురించి వ్యాఖ్యానం చేసేది! ఈ గుర్రానికి రావత్తు కూడా లేదే, తనకు తోడు ఇంకొకళ్ళకి హితోపదేశం కూడానా!

"ఆ చూశాను, చూడకేం? పిచ్చి వాడి రూపం ధరించి ముడ్డి మీద తంతూ వుంది" అన్నాడు.

ఈ మాటకు రామయ్య తాత ఉలిక్కిపడ్డాడు. సీతారామారావుని నిశితంగా పరిశీలిస్తూ, "అందర్నీ తంతూనే వుంది బాబూ! కాని, ఎంత తన్నినా కొంత మందికి బుద్ధి రాదు" అన్నాడు.

అతనికి ఆకస్మాత్తుగా తన భార్యను కొట్టినందుకు ఎత్తి పొడుస్తున్నాడనిపించింది. ఇతనికి అప్పుడే ఎట్లా తెలిసింది? తెలిస్తే మాత్రం ఇతనెవ్వరు తన్ను ఎత్తిపొడవటానికి? అతన్ని ఏదో ఒక విధంగా అవమానపరచాలని బుద్ధి కలిగింది. "రామయ్య తాత - వీడు నీ కూతురు బిడ్డేగా!" అని అడిగాడు.

“అవును బాబూ” అన్నాడు.

“ఒక్కసారి నీ కూతురు బిడ్డ ముక్కు తుడువు తాతా, చూడాలని వుంది. నువ్వు ఆ పని చేస్తే చూచి చచ్చిపోవాలని వుంది” అన్నాడు సీతారామారావు.

రామయ్య తాత అతన్ని పరీక్షగా చూశాడు.. ఇట్లా అన్నాడు! “చావదలచిన వాళ్ళకి కోర్కెలు వుంటం మంచి కాదు బాబూ! కోర్కెలు వున్న వాడు చావటానికి అర్హుడు కాడు. చావు బ్రతుకులు రెండూ సమాన దృష్టితో చూడగలిగిన వాడే ఏ పనైనా చెయ్యగలుగుతాడు. చస్తాను, చస్తాను అని బెదిరించి భయపెట్టి, సంఘదృష్టినీ సానుభూతినీ సంపాదించదలచిన వాడు చావలేడు బాబూ!” అన్నాడు.

“మరి నువ్వెందుకు బతుకుతున్నట్టు తాతా? నీకేమి కోర్కెల్లేవుగా, మనుమడి ముక్కు తుడవటానికా?” అని అడిగాడు.

అతనిక ఎందుకనో రామయ్య తాతని చూస్తున్న కొద్దీ కోపం ఎక్కువ అవుతూంది. గిల్లి కజ్జా పెట్టుకుని కింద పడేస డొక్కల్లో తన్నాలనిపస్తూంది... “అయితే తాతా రాముల వారు

భగవంతుడే అయినప్పటికీ అనేక తప్పులు చెయ్యటానికి కారణం ఏమంటావు? మానవుడుగా వున్నంత కాలం మానవమాత్రుడిలాగే ప్రవర్తించాలని కాదూ నువ్వు చెప్పేది? ఎంత తెలివి గలవాడైనా పరిస్థితులను సమన్వయం చెయ్యగలగటమే గొప్ప వాని లక్షణం. అంతే కాదూ - మొన్న నువ్వు నాకు చెప్పింది?” అని అడిగాడు.

అతను ఏదో విధంగా తగాదా పెట్టుకోడానికి ప్రయత్నిస్తున్నాడని తాత గ్రహించాడు. సంభాషణ పెంచకూడదుకొని తల వూపాడు.

“ఇక నా భార్యను కొట్టడంలో తప్పేముంది తాతా! నా భార్యని కొట్టటం తప్పని నాకు తెలుసు. ఆమె తప్పేమీ లేదనీ, నా మనో వికారమే కారణమనీ నాకు తెలుసు. తెలిసినప్పటికీ మానవులు చేసే పనే నేను చేశాను. నా ఆలోచనలు నీవు అన్నట్టు పరిస్థితులకు అతీతంగా వుండకుండా చూచుకున్నాను తాతా! తాతా-రాముల వారు సీతాదేవిన చితి ఎక్కించటానికి, మహారణ్యాల పాలు చెయ్యటానికి కారణం ఇదేగా తాతా. నేను కూడా అవతార పురుషుణ్ని కాదు కదా?” అని అడిగాడు.

రామయ్య తాత కొంత సేపు ఏమీ మాట్లాడలేదు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు కనపడ్డాడు. క్షణక్షణానికీ ముఖకవళికలు మారుతున్నాయి. కళ్ళు ఎరుపెక్కినయి, కనుబొమలు ముడిపడినాయి, కొంత సేపు అయిం తర్వాత, సీతారామారావుని గుచ్చి చూస్తూ - “నా మనుమరాలిన కొట్టావా బాబూ?” అని అడిగాడు. అతని గొంతులో సహజంగా వుండే మార్ధవం, చూపులలో సహజంగా వుండే సానుభూతీ ఇప్పుడు లేవు.

“అవును తాతా!” అన్నాడు సీతారామారావు “పెద్దలు నడిచిన దారినే నడిచాను. ఆ శ్రీరామచంద్రమూర్తే నాకదర్శం...” అన్నాడు చిరునవ్వు నవ్వుతూ, తాత ఉడుకుతున్నాడని, ఇంకా ఉడికించాలని అభిలాష కలిగింది. దేనికీ తొణకని తాతని - కదిలించి, కోపం తెప్పించి, అతని లోని సామాన్య మానవుని లక్షణాలను చూడటం అతనికి ఆ క్షణం ఆనందాన్నిస్తూ వుంది.

తాత కళ్ళు చింతనిప్పులయినయ్. "మూర్ఖుడా! శ్రీరామచంద్రమూర్తితో పోల్చుకుంటున్నావా!" అన్నాడు.

సీతారామారావుకి తాత ఉగ్రనరసింహమూర్తిగా కనిపించాడు. ఇందాకటి నుంచీ నిప్పుతో చెలగాటమాడుతున్నట్లు అప్పుడతనికి బోధపడింది. తాత తను అర్థం చేసుకున్న తాత కాదు. ఇన్నాళ్ళూ ఆయనతో తను కలిసి మెలసి వుంటున్నా, అనేక విషయాలు మాట్లాడుతున్నా, తాతని అర్థం చేసుకోలేదు. తాతలో ఎన్నడూ వూహించి ఎరగని కొత్త మనిషి కనబడేటప్పటికి అతనికి భయం వేసింది.

"గొప్ప వాళ్లని ఆదర్శంగా పెట్టుకొని, వాళ్ళకి మల్లే ప్రవర్తించటానికి నువ్వు ఎన్నడూ ప్రయత్నించలేదు. పైగా నీ దుర్మార్గాలను, అవినీతి ప్రవర్తనను, నీ నీచ స్వభావాన్ని సమర్థించుకోడానికి వాళ్ళలో నీ రూపాన్నే చూస్తున్నావు. మహనీయుల్ని నీ స్థితికి గుంజి తృప్తి పడుతున్నావు. రామచంద్రమూర్తి భార్యను కష్టపెట్టిందీ, నీవు నీ భార్యను హింసించిందీ

ఒక్కటేనా నీచుడా? రామచంద్రమూర్తి సీతమ్మ తల్లిని ఎందుకు చితి ఎక్కించాడు? ఎందుకు మహారణ్యాలకు పంపాడు? ఒక ఆదర్శం కోసం. తన ఆదర్శాన్ని త్యజించటమా, భార్యను త్యజించటమా అనే విషమ సమస్య వచ్చినప్పుడు శ్రీరామచంద్రమూర్తి భార్యను త్యజించి ఆదర్శప్రాయుడైనాడు. మరి నీవో? ఏ ఆదర్శంతో నీ భార్యను హింసిస్తున్నావు? లోక కళ్యాణం కోసమా? శారీరక తృప్తి కోసం, పశువాంను తీర్చుకోటానికీ, నీ అసమర్థతను కప్పిపుచ్చుకోటానికీ చేస్తున్నావు.

ఇంకా సిగ్గులేక, నీ దుర్మార్గాన్ని కప్పిపుచ్చుకోటానికి కారణాలు వెతుకు తున్నావా... మూర్ఖుడా? తను చేసిన తప్పుకి పశ్చాత్తాప పడే వాళ్ళకి ముక్తి వుంది గాని, దాన్ని సమర్థించుకోటానిక కారణాలు వెతికే నీచులకు ముక్తి లేదు. చివరికి నీ చదువు, నీ తెలివి, ఇందుకు - ఈ దుర్మార్గానికి రంగు పూసి లోకాన్ని మోసం చేసి బ్రతికేందుకు - ఉపయోగపడుతూ వున్నాయా? నీ అంతం దగ్గరకు వచ్చింది.

నీ ముత్తాత తాతతో ప్రారంభం అయిన ఈ నాటకం ఆఖరి అంకం నీతో ప్రారంభం అయింది. ప్రస్తుతం ఆఖరి ఘట్టం జరుగుతూ వుంది. తెర ఏ క్షణం పడినా పడొచ్చు.

నీ వంశం యిట్లా అంత మొందుతుందనీ, ఇంత నీచస్థితికి వస్తుందనీ నేను ఎప్పుడూ అనుకోలేదు. నీ వంశ చరిత్ర అంతా నేను ఎరుగుదును. నీ తాత, నీ తండ్రి అందర్నీ నేను ఎరుగుదును. అంతా ఒక్కటే రకం. ఒక్కడయినా బుద్ధిగలవాడు పుట్టక పోతాడా అని ఆశ పుడుతూ వుండేది. నేటితో ఆ ఆశా తీరిపోయింది..." అన్నాడు.

"అయితే మేము తెలివితక్కువ వాళ్ళం అంటావా తాతా?" అని అడిగాడు సీతారామారావు.

"ఇప్పుడు ఆ విషయం అప్రస్తుతం" అన్నాడు రామయ్య తాత.

"సరే ..... నువ్వు తెలివిగలవాడవయి ఉద్ధరించిన ఉద్ధరింపు ఏమిటో కొంచెం చెపుతావా? నీ తండ్రి ఇచ్చిన ఆస్తి ఆస్తిగానే ఉంచి అయివేజు మీద బ్రతుకుతున్నా నంటావు. అదేనా? మనుమడికి గుర్రానివై కళ్ళెం కావాలని కోరుకోవటమేనా నీ గొప్పతనం? రామయ్య తాతా! నువ్వు అంటే ఏమిటో అనుకున్నాగాని నువ్వూ మాలాంటివాడివే!"

“నోరుముయ్!”

“నేనే లోకాన్ని తాతా, నా నోరు మూత పడదు. ఆచంద్రతారార్కం గణగణ మోగుతూనే వుంటుంది.”

“ఇక్కడ నుంచి బయటకు వెళతావా గెంటించమంటావా?”

“అనుకుంటాంగాని గెంటే వాడొకడూ, గెంటించుకునే వాడు వొకడూ వున్నాడా తాతా? గెంటించే వాడే గెంటించుకుంటున్నాడు. గెంటించుకునే వాడే గెంటుతున్నాడు. యీ వేదాంతం యెట్లా వుంది తాతా? చమ్మగా వుందా?”

“నీకేమన్నా పిచ్చెక్కిందా?”

“ఏమిటి తాతా?”

“నీకు పిచ్చా?”

“ఆ ఏమిటి?”

“నువ్వు పిచ్చివాడివి!”

“నేను పిచ్చివాణ్నా?”

“ఆ అవును ముమ్మాటికీ?”

“పిచ్చివాడెవ్వడు?”

“నువ్వే”

“పిచ్చి అంటే ఏమిటి?”

“ఇదే”

“నేను పిచ్చి వాణ్నా తాతా?”

“అవును.... ఇవ్వాళే పిచ్చివాడివని నీ భార్యతో పిటీషన్ పెట్టిస్తాను. ఈ భార్య పిల్లల్ని నీ నుంచి రక్షించటం కంటే ఇక చేసేది ఏమీ లేదు” అన్నాడు రామయ్య తాత.

తాను పిచ్చివాడా? అనేక విషయాలు ఆలోచించాడుగాని, ఈ విషయం ఎప్పుడూ ఆలోచించలేదు. పిచ్చి వాళ్ళు ఏం చేస్తారు? ఇట్లాగే ఆలోచిస్తారా? పిచ్చి వాళ్ళు తాము పిచ్చివాళ్ళో కాదో చర్చించుకుంటారా? అసలు పిచ్చి అంటే ఏమిటీ? మేం పిచ్చి వాళ్ళం కాదు - అని కూడా చెప్పబుద్ధి అవుతుంది కాబోలు పిచ్చివాళ్ళకి.

"పిచ్చి మాటలు మాట్లాడతావే తాతా?"

"వెళ్ళు.... బయటకు వెళ్ళు.....పద......." అంటున్నాడు తాత.

"నీకేం పిచ్చి తాతా. పిచ్చి వాళ్ళకి పిచ్చిగానీ?"

రామయ్య తాతని కోపంగా చూట్టానికి ప్రయత్నించాడు. కాని అతని చూపులు నిలవటం లేదు. రామయ్య తాత ఉండ్రాళ్ళు తిని పొట్ట సవరించుకుంటున్న వినాయకుడి మల్లే కనిపించాడు.

"ఎలిక ఏది తాతా?" అని అడిగాడు. వినాయకుడి పొట్టలో పొడిస్తే ఎన్ని ఉండ్రాళ్ళు వుంటయ్యో! తాను చిన్నప్పుడు ఒకసారి క్వారీ తిరునాళ్ళకు వెళ్ళాడు. తిరుమాలిగ అంటే ఏమిటి? కత్తితో రామయ్య తాత పొట్ట రెండుగా కోస్తే!

రామయ్య తాత బయటకు వెడుతున్నాడు.

"ఉండు తాతా......."

రామయ్య తాత మనుమడి చేతిలో కత్తి వుంది. కత్తిపీటతో దోసకాయలూ, కత్తితో పొట్టలూ కోస్తారు. ఆ కత్తి తనకు కావాలి. చెయ్యి జాపాడు. ఎంత జాపినా అందటం లేదు.

"తాతో! రామయ్య తాతో!"

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

16 వ భాగం

ఏమిటి రామయ్య తాత అంటున్నాడు? మనుమడి చేతిలో కత్తి అతని చేతిలోకి ఎట్లా వచ్చింది. పొడుస్తాడా ఏమిటి?

"ఓరి పిచ్చి వెధవా?" అన్నాడు. గిరుక్కున తిరిగి బయటకు పరుగెత్తాడు, సీతారామారావు.

రామయ్య తాత ఒక నిట్టూర్పు విడిచి దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. మనుమడు "కల్లెం లేని గుల్లం" అన్నాడు.

-3-

సీతారామారావు బజార్నపడ్డాడు. అతనికి బజార్న పడ్డట్లు తెలుసు. తనకు గమ్యస్థానం లేనట్టు తెలుసు. బజారు వెళ్ళటం అనవసరం అని తెలుసు. కాని తన ప్రమేయం లేనట్టుగా కాళ్ళు మోసుకుపోతున్నాయి.

"ఆలోచిస్తున్నది తలలో వున్న మెదడు, నడుస్తున్నవి కాళ్ళు, మెదడు చెప్పినట్లు చెయ్యాలని ఎక్కడుంది?" అని అనుకున్నాడు. అతని అవయవాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చింది. దేని ఇష్టం దానిదే! ఒక దాని మీద ఒక దానికీ పెత్తనం లేదు. మెదడు దారిన మెదడు ఆలోచిస్తూంది. చేతులు దారిని చేతులు ఊగుతున్నాయి.

కళ్ళ దారిన కళ్ళు చూస్తున్నాయి. తన ప్రమేయం లేకుండా, ఆజ్ఞల కోసం తన్ను బాధ పెట్టకుండా, ప్రతి చిన్న విషయానికి తన్ను ఆలోచించేటట్లు చెయ్యకుండా వేటి పని అవి చేసుకుపోతుంటే అతనికి హాయిగా వుంది. పైకి మాత్రం ఇది వరక్కంటే.... గబగబా నడవటం కంటే - ఎక్కువ మార్పేమీ కనబట్టం లేదు.

"ఎక్కడికి?" అని అడిగాడొక పరిచయస్తుడు.

"కాళ్ళనడుగు, నాకు తెలుసా ఏమిటి చెప్పటానికి?" అన్నాడు ఆగకుండా నడుస్తూనే. అతను ఆగుదామని ప్రయత్నించాడు. కాని కాళ్ళు అతని మాట వినలేదు. ఒడ్డుకు చేరాలని ప్రయత్నిస్తూ ప్రవాహ వేగంలో కొట్టుకుపోతున్న వాడికి మల్లే కనిపిస్తున్నాడు.

"ఎక్కడా కనపట్టం లేదే!" అని అడిగారు ఒకరు.

"బ్రేకుల్లేవు, నన్నేం చెయ్యమంటావు?" అని ఎదురు అడిగాడు. ఎత్తు మీద నుంచి పల్లానికి దిగే సైకిలుకు మల్లే వెళ్తున్నాడు. ఎదురుగ వస్తున్న మనిషితో "పోతున్నాను" అని చెప్పాడు ఆగకుండానే.

రోడ్డు ప్రక్కన పిల్లలు బిళ్ళంగోడు ఆడుకుంటున్నారు. ఒక కుర్రాడు "మున్నాంచి" అని కేకవేసాడు.

అతడు నడుస్తూనే "ఎన్నాంచి" అని రోడ్డు మీద నుంచి బిగ్గరగా కేక వేశాడు.

అతని కాలికి ఏదో తగిలింది. టక్కున ఆగిపోయాడు. చూచాడు మసిబొగ్గు! ఒంటరిగా దిక్కూ దివాణం లేకుండా పడివున్న ఆ మసిబొగ్గుని చూస్తే అతనికి అలుసయింది. అటూ ఇటూ

తన్నాడు. అది తను ఎటు తంటే అటు వెళ్ళింది. దాని అమాయకత్వానిక అతనికి నవ్వు వచ్చింది. చేత్తో తీసుకొని ఎగరవేసి పట్టుకుంటూ నడుస్తున్నాడు. ఎంత ఎత్తుగా గిరాటు వేసినా అది మళ్ళీ తనకు వచ్చిపడుతూ వుంది.

"సిగ్గు లేదు! దీని కంటే భార్య నయం" అనుకున్నాడు.

కాని వెంటనే జాలి వేసింది "దెబ్బ తగిలిందా?" అని నిమిరి "మా బుచ్చే" అని లాలించి ముద్దు పెట్టుకున్నాడు.

పెదిమలతో ముద్దు పెట్టుకుంటే చేతులకు మసి అయింది. వెంటనే వూళ్ళో వున్న గోడలన్నీ తెల్లగా కనిపించినయ్. గోడల నిండా మసి బొగ్గుతో బొమ్మలు గియ్యటం మొదలు పెట్టాడు. ఎక్కడ గీచినా కొద్ది మార్పులతో ప్రక్క పుటలో బొమ్మే! అతని చుట్టూ పిల్లగుంపు పోగయింది. నా బొమ్మ రాయమంటే నా బొమ్మ రాయమని వెంటపడ్డారు.

"నేను రాయను"

"ఎందుకనోయ్?"

"పిల్లల బొమ్మల నే రాయకేం? ఎవరి ముక్కుకి సూటిగా వాళ్ళు పొండి. అక్కడే రామయ్య తాత వుంటాడు. వాడికి కుంచెలాంటి తోక వుంటుంది. ఆ తోక నడగండి కుంచె రాస్తుంది...... పొండి.....పొండి.... ఊ" అని పిల్లల్ని తరిమాడు.

నల్లకోటు వేసుకొని జరీ తలపాగా ఒకటి చుట్టుకొని, చేతికర్ర పట్టుకొని ఒక పెద్ద మనిషి ఠీవిగా తన ముందు నడిచి వెళ్ళటం చూశాడు.

"ఏయ్ ఆగు" అన్నాడు.

ఆ పెద్ద మనిషి కంగారుపడుతూ ఆగాడు. సీతారామారావు అతని దగ్గరకు వెళ్ళి భుజం మీద చెయ్యేసి "అది సరేగాని నువ్వు ఎందుకు పుట్టావో నీకు తెలుసా?" అని అడిగాడు.

పెద్దమనిషి కంగారు పడ్డాడు.

"మర ఏం జూసుకొని ఈ డాబుసరి" అని బిగ్గరగా నవ్వటం మొదలు పెట్టాడు సీతారామారావు.

ఆ పెద్ద మనిషి తప్పించుకు వెళ్ళటానికి ప్రయత్నించాడు.

"నువ్వు గంగిరెద్దుకు మల్లే, చాకలి వాని గాడిదకు మల్లే ఇన్ని గుడ్డలు కప్పుకున్నావే? మొన్న ఒక చీర అడిగిందని ఎందుకురా నీ భార్యను కొట్టింది? నీ భార్య నాకు చెల్లెలి వంటిది గనక అడుగుతున్నాను. ఆడదాన్ని కొట్టడానికి నీకు చేతులెట్టా వచ్చినాయిరా?" అని అడిగాడు.

ఆ పెద్ద మనిషి విదిలించుకొని వెనక్కి వెనక్క తిరిగి చూస్తూ వెళ్ళిపోయాడు.

సీతారామారావు ప్రక్కనున్న కాఫీ హోటల్లోకి వెళ్ళాడు. ఫలహారం చేసి, బల్ల ముందు కూర్చున్న ప్రొప్రయిటరు దగ్గరకు వచ్చి "ఎంత?" అని అడిగాడు.

"అయిదణాలు"

"పావలా యిస్తే ఏమవుతుంది?"

అంత లావు ప్రొప్రయిటరూ బెదిరిపోయి చూస్తూ కూర్చున్నాడు.

"అటు సూర్యుడు యిటు పొడుస్తాడా? మన దేశ ఆర్థిక విధానం తారుమారు అవుతుందా? ఆడవాళ్ళకు సమాన హక్కులు వస్తాయా? స్వరాజ్యం రాకుండా పోతుందా? ఏమవుతుంది అంటావు?" అని అడిగాడు.

ప్రొప్రయిటరు భయపడుతూ కూర్చున్నాడు. ఆ కొట్లో కాతా వున్న న్యాయవాది ప్రొప్రయిటరుకి జరుగుతున్న అన్యాయం సహించలేక తాగుతూ వున్న కాఫీ ఆపి "ఇవ్వవోయ్ మాట్లాడక" అన్నాడు.

సీతారామారావు ఆ న్యాయవాదిని జాలిగా చూచి, "ఒరేయ్! నువ్వు న్యాయం చెప్పొచ్చావు గాని, నువ్వు చేసేది అంతా న్యాయమేనటరా! నువ్వు ఇన్నిసార్లు కాఫీ తాగుతున్నావే - నీ భార్యకు ఒక్కసారన్నా జోడు ఇడ్లీ తీసుకు వెళ్ళవూ? పాపం, వాళ్ళు మాత్రం మనుష్యులు కాదట్రా? వాళ్ళని మనతో సమానంగా చూచుకోకపోతే ఎట్లాగురా చెప్పు...... చెప్రా నా తండ్రీ" అని బతిమాలుతూ కన్నీరు పెట్టుకొని, "పాపం, ఆమె కన్నవారినందర్నీ వదులుకొని నువ్వే దేవుడవని అనుకొని, పరపురుషుల్ని దగ్గరకు చేరనివ్వకుండా బిగబట్టుకొని నీతో కాపురం చేస్తూ వుందే, ఆమెను నువ్విట్లా కష్టపెడితే ఎట్లాగురా? చెప్పరా నా తండ్రీ" అని గడ్డం పట్టుకొని బ్రతిమాలాడు. చుట్టూ పోగయిన వాళ్ళు. తేరుకోకముందే బయటకు వచ్చి, నుంచునే దిమ్మమీద నుంచున్నాడు. అక్కడ నుంచునేటప్పటికి అతనికి ఇంగ్లీషులో ఉపన్యాసం ఇవ్వబుద్ధి అయింది. కాని తెలుగులో పాడాడు.

"హరి హరీ ఈ ధరను గుణసతీ

ఆడదెవరో జూడర?

తెరువు జూసే దరిని జేరి

పదము నొందిన దాడది

అత్తమామకు పూజ చేసి

ప్రస్తుతించిన దాడది

ముత్తురాలయి అత్తమామల

మాట విననిది గాడిది

కుదురుగా భర్త మాటకు

ఎదురు చెప్పని దాడది

బెదురు ఎంతయు లేక పురుషుని

గిదుము చున్నది గాడిది

నిరతమును సద్గోష్ఠి కొరకై

వెతుకు చుండెడి దాడది

భర్త గృహమున లేని యెడల

పరుగులిడునది గాడిది

కామ క్రోధ లోహ మోహము

కట్టి వేసిన దాడది

ప్రేమతో విటకాంద్ర గూడను

తామసించును గాడిది

జన్మ పావన చేసికొనుటకు

ధ్యానముంచిన దాడది

తన్మయంబును బొంద నేరక

తనువు మరువదు గాడిది

ఇంత సద్గుణ మభ్యసించిన కాంతయే భువి నాడది

సంతసంబున యడ్ల రామ

దాసుడిది యోచించెర గాడిదీ!"

పాట పూర్తయ్యేటప్పటికి జనం పోగయ్యారు. వాళ్ళను చూస్తే తను ఉపన్యాసం చెబితే వాళ్ళకు వినాలని వుందని అతనికి అనిపించింది. హరికథ చెపుదామా, బుర్రకథ చెపుదామా అని ఆలోచించి ఉపన్యాసం మొదలు పెట్టాడు.

"ఒరేయ్, నా మాట వినండ్రా, పిచ్చెత్తిందని కొంత మంది చెపుతారు. ఆ మాట నమ్మకండి. మనకు అర్థంకాని వాళ్ళందరికీ పిచ్చెత్తిందనుకుంటే ఎట్లాగురా.

ఒరేయ్, ఈ ప్రపంచంలో మీరేదో చేద్దామనీ, చేస్తున్నామనీ అనుకుంటార్రా! ఏముందిరా ఈ ప్రపంచంలో చెయ్యడానికి! ఏమీ లేదురా! నా మాట నమ్మండ్రా తండ్రుల్లారా!

మనము ఏం చెబితే నచ్చుతుందో తెలుసుకుని, అది చెప్పి దాని కోసం పనిచెయ్యమని మనల్ని రేపి, పని చేయించుకుంటున్నార్రా అంతేరా, అంతకంటే ఏమీ లేదురా, అంతా వొట్టి బూటకంరా నా తండ్రుల్లారా!

చూడండ్రా, మొదట్లో దేవుడు మనల్ని పుట్టించాడనీ, కాబట్టి వాళ్ళలో ఐక్యం అవటానికి మనం ప్రయత్నించాలనీ చెప్పార్రా. మనం నమ్మాం రా, నమ్మి అందుకు ప్రయత్నించాం. అప్పుడు వాళ్ళేం చేశారో విన్నారంటారా, "దేవుడనే వాడు బయట లేడు, మనుషుల్లోనే వున్నాడు. కాబట్టి మానవసేవే మాధవసేవ. మీరంతా మానవసేవ చెయ్యండి." అని చెప్పార్రా. మనం ఈ మాట కూడా నమ్మాంరా. నమ్మి మానవ సేవ మొదలు పెట్టాంరా. దేవుణ్ని నమ్మిన వాళ్ళందరనీ తిట్టాంరా, పాపం నోటికి వచ్చిన తిట్లన్నీ తిట్టాం. మనం సత్యం తెలుసుకున్నామనీ వాళ్ళు తెలుసుకోలేదనీ అనుకున్నాంరా. కాని ఇట్లా చూచేటప్పటికి ఏమైందో చూశార్రటా, "మానవులంతా ఒకటనుకునే సంఘంలో అనేక వర్గాలున్నాయి. ఈ వర్గాల కలహం వల్లే సంఘం అభివృద్ధి చెందుతూ వుంది. కాబట్టి ఆఖరు వర్గాన్ని వెనకవేసుకుని మిగిలిన వర్గాలతో వర్గ పోరాటం సాగించండి" అన్నార్రా. మనం యిదీ నమ్మాం. నమ్మి వర్గ పోరాటం సాగించాం,

మనుష్యుల్లో వున్న దేవుడు ఈ దెబ్బతో కనపడకుండా మాయం అయ్యాడురా. పోరాటం పోరాటం పోరాటం - పోరాటం -

మనలో మనకే పోరాటం. మనలో మనకు కొట్లాటలు. ఒకరంటే ఒకరికి అనుమానం, ఒకరంటే ఒకరికి ద్వేషం, విరోధం, అరెరే, ఎంత ఘోరం అయిపోయిద్రా నా తండ్రుల్లారా! ఇది ప్రపంచంగా లేదురా, కసాయి కొట్టుగా ఉందిరా.

ఈ దెబ్బతో సంఘసేవ కూడా ఎగిరిపోయిందిరా. సంఘం ఒక రకంగా పరిణామం చెందుతూ వుందట! దానికి మనం దోహదం ఇవ్వాలట! ఇంకేముందిరా నా తండ్రుల్లారా, కాల ప్రవాహానికి రాళ్ళూ రప్పలూ అడ్డం లేకుండా బాగు చెయ్యటమేనటరా మన పని.

ఈ సంగతి కొంత మంది కనిపెట్టార్రా. కనిపెట్టి, మానవునికి జ్ఞానం సంపాదించటం ఆదర్శం అని చెపుతున్నార్రా, వీళ్ళు హేతువాదం మీద ఆధారపడమంటార్రా. "ఎందుకు?" "ఎందుకు?" అని ప్రశ్నించుకోమని చెపుతార్రా. అన్ని "ఎందులకు?" లకు వాళ్ళు జ్ఞానాన్ని బట్టి జవాబు చెపుతారు. మనకున్న జ్ఞానాన్ని బట్టి మనము నమ్ముతాం.

కాని ఆఖరికి "ఎందుకు" జవాబు లేదురా నా తండ్రీ.

"జ్ఞానం ఎందుకు?"

జవాబు లేదురా నా తండ్రీ! ఎక్కడో ఒక చోట ఈ "ఎందుకు" ఆగవలసిందేరా తండ్రుల్లారా!!

ఒరేయి. లేని ఈ "ఎందుకు" ఎందుకు సృష్టించారో మీకు తెలుసట్రా? ఎందుకో ఒకందుకని చెప్పకపోతే మనం పని చెయ్యమని వాళ్ళ ఉద్దేశ్యంరా, అంతేరా, అంత కంటే ఏమీ లేదురా నా తండ్రీ!

తండ్రుల్లారా, ఇవన్నీ అబద్ధాలేరా, అబద్ధాలు చెప్పి మనల్ని మోసం చేసి పనులు చేయించుకుంటారట్రా వీళ్ళు. ఏమీ లేకపోతే మట్టుకు ఎందుకు పని చెయ్యంరా? ఏమీ లేనప్పుడు - పని చెయ్యకపోతే మాత్రం ఏంరా? నిజంగా ఏదన్నా వుంటే క్షణం క్షణం ఇట్లా ఆదర్శం మారటానికి వీలుంటుందంటారా. పైగా ఆదర్శం ఎప్పుడూ మారుతూనే ఉంటుందట! చూడండ్రా వాళ్ళ ధైర్యం - ఆదర్శం లేదని ఎంత చమత్కారంగా చెపుతున్నారో!

ఒరేయి మనం పుట్టటం నిజం, చావటం నిజం, మధ్యన బ్రతకటం నిజం, పుట్టటం, చావటం మన చేతుల్లో లేదురా, ఇక బ్రతకటం ఒకటేరా మిగిలింది. బతకటానికి మనకు కావలసింది అన్నమే గదరా, మరి దీని కింత గొడవెందుకురా! నలుగురం కూడబల్కుకొని బతకలేమంటారా? ఈ ప్రపంచంలో ఏమో వుందని మభ్య పెట్టి దాని కోసం పోట్లాడుకు చచ్చేటట్లు చేస్తున్నార్రా. అంత కంటే ఏమీ లేదురా తండ్రుల్లారా, మనం కొన్నాళ్లు ఇక్కడ బతకాలి, యెవరైనా అంతే, దీనికి కలహాలూ, రక్తపాతాలూ ఎందుకురా, ఎవరు కట్టుకు పోయేద ఏముందిరా. బతకండ్రా, తండ్రుల్లారా, మనం కొన్నాళ్ళు ఇక్కడ బతకాలి, యెవరైనా అంతే, దీనికి కలహాలూ, రక్తపాతాలూ ఎందుకురా, ఎవరు కట్టుకుపోయేది ఏముందిరా, బతకండ్రా తండ్రుల్లారా, చచ్చేదాకా బతకండి."

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

17 వ భాగం

“వెళ్ళిపో” అన్నాడు పోలీసు.

“ఎక్కడికి!” అడిగాడు సీతారామారావు

“వెళ్ళు”

“వెళ్తా మళ్ళీ వొస్తా.”

అతడు గబగబా దిమ్మదిగి మళ్ళీ తిరగటం మొదలు పెట్టాడు. తిరిగి తిరిగి భోగం వాళ్ళ పేటకు వెళ్ళాడు.

-4-

భోగం వాళ్ళు ప్రత్యేకం ఒక పేట కట్టకోవటం అతనికి విచిత్రంగా కనుపించింది. ఒకే వృత్తిలో వున్న వాళ్ళకి అంతా ఒకచోట వుండాలనిపిస్తుంది గామాలు - ఏ వృత్తిలోను లేని తనకు మల్లే! తన స్నేహితులకి మల్లే! ఎందుకనోగాని భోగం వాళ్ళకి, తనకు కొంత పోలిక ఉన్నట్లు కనిపించింది. ఇద్దరూ సంఘానికి పనికి రాకుండా పోయిన వాళ్ళే. సంఘంలో వున్న కుళ్ళుతో భవంతులు కట్టించుకొని వాట్లల్లో నివసిస్తున్న వాళ్ళే. కాని తమని చూస్తే ఎవరికీ జాలి కలుగదు సరికదా, ఎగతాళిగా కూడా వుంటుంది.

ఒక భోగంది గుమ్మంలో నిలబడి విటునితో మాట్లాడుతున్నది.

సీతారామారావుకి వాళ్ళు ఏం మాట్లాడుకుంటున్నారో తెలుసుకోవాలనిపించింది. గబగబా వాళ్ళ దగ్గరకు వెళ్ళి, “ఏమిటే వాడితో నీవు మాట్లాడేది?” అన అడిగాడు.

వాళ్ళిద్దరూ ఒకళ్ళ మొహం ఒకళ్ళు చూచుకుంటూ నిలబడ్డారు.

“చెప్పవే నాకూ వినాలని వుందీ!” అన్నాడు.

“నీ కనవసరం” అంది ఆ పిల్ల.

“అనవసరమా? సంఘంలో ఇద్దరు మాట్లాడుకునే మాటలు, యిద్దరు ప్రవర్తించే ప్రవర్తన, అందరికీ అవసరమే. తెలుసుకోవలసిన బాధ్యత అందరి మీదా ఉంది. సంఘం అంటే ఏమనుకున్నావు? అది చేనుకే కంచె చేలో మంచె. అది ఒక

పత్తేదారు. తనలో వుండే, ప్రతి వ్యక్తి సంగతీ కనిపెడుతూ ఉంటుంది. తన మాట ప్రకారం ప్రవర్తించిన వాళ్ళను సుఖపెడుతుంది. తన మాట వినని వాళ్ళని హింసిస్తుంది - తెలుసా?" అన్నాడు.

ఆ కుర్రవాడు ఈ మాటలు విని భయపడి మెదలకుండా వెళ్ళిపోయాడు.

అతనికి కష్టం వేసింది. "ఎవరయినా ఇంతే, ఆపత్కాలంలో ఐపుండదు, డబ్బు తీసుకోవటం వల్ల, మీరింత తేలికయ్యారు" అన్నాడు.

"మరి తిండి గడిచేదెట్లా?" అని అడిగిందా పిల్ల.

అతనికి ఆమెను చూస్తుంటే హృదయం జాలితో, ప్రేమతో నిండి పోయింది. తన ఇంటి ముందు నుంచి వూళ్ళో మురికినంతా పోగు చేసుకొని నెమ్మదిగా, నిశ్శబ్ధంగా, గర్భిణీ స్త్రీకి మల్లే పారే కాలువ జ్ఞాపకమొచ్చింది. ఆమెకు మనస్సులో నమస్కరించు కున్నాడు.

ఆమె ఇంట్లోకి రమ్మని పిలిచింది.

అతన్ని కూర్చోపెట్టి తమలపాకు తెచ్చి ముందు పెట్టి తను పక్కనే కూర్చుని చిలకలు చుట్టిస్తూ ఉంది. అతను తీసుకోబోతే "నేను తినిపిస్తా" అని వొక్కొక్కటి నోటి కందించటం మొదలు పెట్టింది.

"నాకు డబ్బంటే వ్యామోహం లేదండీ" అంది.

"త్చెత్చె పాపం" అన్నాడు.

"నేనసలు భోగం దాన్ని కానండీ."

"మహాపతివ్రతవా ఏమిటీ - కొంపతీసి?" అని లేవబొయ్యాడు తమ్మ వుమ్మి వెయ్యబొయ్యాడు.

"నేను చెబితే మీకు నవ్వులాటగా ఉంటుంది గదండీ, నేనసలు భోగందాన్ని కాను. నేను చెపితే గొప్పకు చెబుతున్నానని అనుకుంటారు గాని, నేనసలు బానిసపిల్లని" అంది.

అతను నోరు తెరుచుకుని వింటున్నాడు, తమలపాకులతో ఎర్రబారిన అతని నోరు కాకిపిల్ల నోరుకు మల్లే లక్క చిట్టికి మల్లే వుంది.

"నా తల్లిని ఒక బాపన కుర్రాడు మోసం చేశాడు. పెళ్ళి కాక ముందే నేను పుట్టాను. నన్ను నా తల్లి భోగం వాళ్ళకు అమ్మేసింది. నేనీ వృత్తిలో ప్రవేశించనని ఎంత పోట్లాడాననుకున్నారు!" అని కన్నీరు పెట్టుకునేందుకు ప్రయత్నిస్తూ ఉంది.

"ఎందుకని? ఈ వృత్తిలో కష్టం ఏముంది?"

"అదేమిటండీ? మీరు కూడా అట్లా అంటారు? ఇంతకీ మేమంటే అందరికీ అంత చులకన" అని విచారంగా అన్నది.

"నీకు భార్యగా మారాలని వుందా ఏమిటి?"

"ఎప్పుడూ అదే అనుకుంటా వుంటాను, ఎవరినయినా పెళ్ళి చేసుకొని హాయిగా కాలం గడపాలని వుంటుంది. ఈ వృత్తి చాలా నీచమయిందండీ, నా గుణానికి బొత్తిగా సరిపడదు" అంది.

"ఏం నీ గుణం మంచిది కాదా?"

"అదేమిటండీ!"

"అయితే భార్యగా వుండి నీకు పిల్లల్ని కూడా కనాలని వుందా?"

ఆమె సిగ్గు అభినయిస్తూ, చీరె జరీ అంచు చేతి వేళ్ళతో సర్దుకుంటూ "ఎంత చెడ్డా మేం మాత్రం ఆడవాళ్ళం కాదటండీ? ఏ ఆడదానికుండదండీ ఆ కోర్కె? మీరట్లా అంటారుగాని మేమూ అందరి వంటి వాళ్ళమే......" అంది.

ఈ మాటకు సీతారామారావు ఉలిక్కిపడ్డాడు.

"మేమూ అందరి వంటి వాళ్ళమే" అనుకోవటంలో, పై మెరుగుల్లో తప్ప ప్రపంచంలో అందరూ ఒకటేనా ఏమిటి? అందుకనే కాబోలు ఉద్రేకం వచ్చినప్పుడు అందరూ ఒకే రకంగా

ప్రవర్తిస్తారు. ఆకలి వేసినప్పుడు, కోపం వచ్చినప్పుడు విచారం కలిగినప్పుడు, ప్రేమ సందర్భాల్లో అంతా ఒకే విధంగా ప్రవర్తిస్తారు. భేదాలు పై పూత లోపే! పూత కరిగిపోతే అంతా ఒకటే సరుకు!

మనస్సులో ఈ ఆలోచనలు చెలరేగుతున్నాయి. కళ్ళతో ఆమెను తీక్షణంగా చూశాడు. మనస్సులో ఆలోచనలు కట్టుబడినయ్. అతని కళ్ళకు ఆమె - ఒక్క క్షణం సూర్యారావుగా, ఒక్క క్షణం శాతవాహనుడుగా, ఒక్క క్షణం బాలకృష్ణుడుగా, ఒక్క క్షణం శివరావుగా, ఒక్క క్షణం తానుగా - కనిపించింది.

ఆమె తల చుట్టూ తన స్నేహితుల తలలూ, తన తలలా గిర్రున తిరుగుతున్నాయ్. తమ తలల మధ్యన వున్న ఆమె తల, ఒక్కొక్కప్పుడు పగలబడి నవ్వుతున్నది. ఒక్కొక్కప్పుడు విరగబడి ఏడుస్తున్నది. తన తలతో సూర్యారావు తల ఇట్లా అన్నది.

సూర్యారావు తల!

"మనం ఆంధ్రులం, ఆంధ్ర ప్రజానీకం పంచశిఖలం. మనం ఆంధ్రుల నుడికారం, ఆంధ్రుల సంస్కారం. ఆంధ్రుల ప్రతాపం,

విజ్ఞానం, ఆంధ్రుల బండారం ఏమిటో మూర్తీభవించినయ్.

ఈమె ఆంధ్రమాత. సాక్షాత్తు ఆంధ్రమాత. మనలో వున్న గుణాలన్నీ ఈమెలో కరుడుకట్టినాయి. ఆంధ్రమాతను పూజించుదాం రండి. పువ్వులు తెండి. ఆంధ్రమాతా నీకు జోహారు."

శాతావాహనుని తల: "మనం మురికి కాలవలం, ఇది మహా సముద్రం, ఆంధ్రదేశంలో వున్న మురికి కాలవలన్నీ ఎప్పుడో ఈ మహాసముద్రంలో కలవవలసిందే! అందువల్ల ఆంధ్రులందరికీ ఇది పుణ్యతీర్థం. ఈ మురికి మహాసముద్రంలో జలక్రీడలాడదాం రండి. ఆంధ్ర మహాజనులారా, ఆంధ్ర సుడికార ప్రియులారా! రండీ తీర్థం పుచ్చుకుపొండి."

బాలకృష్ణుని తల: "ఓ మహాజనులారా.... మా నాన్న వున్నాడు చూశారు. ఆయన చెప్పనే చెప్పాడు......."

మిగిలిన తలలు: "నోరుముయ్! ఈ పవిత్ర స్థలములో మీ నాన్న పేరు ఉచ్ఛరించకు."

బాలకృష్ణుని తల: "నా మాట వినండి. లేకపోతే మీ స్నేహం వదులు కొంటా, నేనే ఆంధ్రమాతనై కూర్చుంటా!"

మిగిలిన తలలు బెదిరి ఊరుకున్నాయ్.

బాలకృష్ణుని తల: "మా నాన్న వున్నాడు చూశారూ, ఆయన చెప్పనే చెప్పాడు..... కలియుగంలో మురికి మహాసముద్రమే ఆంధ్రమాత అయి కూర్చుంటుందని. ఆయన చెప్పినట్లే జరిగింది. ఈమె ఆంధ్రమాత. ఈ మన మాత ఆంధ్రదేశములో వున్న మురికినంతా తన అంకంలోకి తీసుకొని ఆంధ్రమాతగా ఉబ్బింది, మురికి వల్ల మొత్తం సంఘం పాడుగాకుండా, దానికి ప్రత్యేక స్థలాన్ని నిర్ణయించారు మన పూర్వులు. శివుడు విషాన్ని తన కంఠంలో

వుంచుకుని లోకాన్ని రక్షించినట్లు, ఈమె ఈ మన మాత... మురికిని తన అంకంలో వుంచుకుని ఆంధ్రదేశాన్ని రక్షిస్తూ వుంది. ఈమెకు నా ధన్యవాదాలు."

శివరావు తల: "ఈమెను మాతా అంటున్నామని మీరు శంకిస్తున్నారేమో, అట్లాంటి శంక మీరు పెట్టుకోవద్దు. తల్లయినా, తండ్రయినా, కూతురయినా, భార్య అయినా, సోదరి అయినా, స్నేహితుడయినా - వీరందరినీ ప్రేమించడానికి కారణం సెక్సే! అసలు ఏ వస్తువయినా ప్రేమించే శక్తినిచ్చేది సెక్సే! మానవుల్ని ప్రేమించడానికి, సంఘాన్ని ప్రేమించడానికి, దేశాన్ని ప్రేమించడానికి అన్నిటికీ కారణం సెక్సే ఇటు వంటి పవిత్రమైన వాంఛను మీరు దాచుకోగూడదు, తీర్చుకోటానికి వెనుకంజ వేయకూడదు."

ఈ మాటలు విని -

సీతారామారావు "ఓరి భగవంతుడా" అని ఒక్క అరుపు అరిచి బయటకు పరుగెత్తాడు. ఎక్కడా ఆగకుండా, రోడ్డు వెంబడి ముక్కుకు సూటిగా వెళుతున్నాడు.

ఒక ఏనాది వాడు తాగి తూలుతూ ఎదురు గుండా వొస్తున్నాడు. రాగాలు తీస్తున్నాడు. వాడి భార్య రెక్క పట్టుకొని తీసుకు వెళ్తూ వుంది. వాడు మధ్య మధ్య విదిలించుకొని "ఉండవే డోఖలే" అంటున్నాడు.

"తాగావట్రా?" అని అడిగాడు సీతారామారావు.

"సెప్పవే... దొరేందో అడుగుతున్నాడు......." అని అన్నాడు పెళ్ళాన్ని.

"నీకేం అయ్యా..... తాగితే....?" అంది రెక్క పట్టుకొని తీసుకు వెళుతూనే!

సీతారామారావుకి సంఘాన్ని తన్నబుద్ధి అయింది. కాని ఎట్లా? ఈ సంఘానికి తలెక్కడ? తోక ఎక్కడ? ఉదరం ఎక్కడ? ఎట్లా తన్నేటట్లు?

ఈ రోడ్డు చివరి దాకా నడిచి వెళ్ళి మలుపు తిరిగాడు. రోడ్డు పక్కనే దేవాలయం వుంది. దాని ముందు మీటింగు జరుగుతోంది. జనం తండోపతండాలుగా వున్నారు. వాళ్ళను చూసేటప్పటిక ఇన్నాళ్ళ నుంచ తాను వెతుకుతున్న సంఘం - తనకు కనపడ కుండా తప్పించుకున్న సంఘం అదే అనిపించింది. గబగబా జనం మధ్యకు వెళ్ళాడు.

వేదిక మీద పరబ్రహ్మ శాస్త్రి, నాగలింగం, రాంభొట్టు, విశ్వేశ్వరరావు, చైతన్యస్వామి కూర్చుని వున్నారు. వాళ్ళ మెడల్లో బండెడు పూల మాలలున్నాయ్. ప్రజలు వాళ్ళను దేవతా ప్రతిమలు చూసినట్లు తన్మయత్వంతో రెప్ప వేయకుండా చూస్తున్నారు.

వాళ్ళు ఒక్కొక్కళ్ళూ లేస్తున్నారు. ఉపన్యాసాలిస్తున్నారు. ప్రజల్లో వున్న దారిద్ర్యం పోవాలంటున్నారు. అజ్ఞానం నశించాలి అంటున్నారు. ప్రజలు పడుతున్న కష్టాలకు కన్నీరు కారుస్తున్నారు.

వాళ్ళ ఉపన్యాసాలకు ప్రజలు పరవశత్వం పొంది, మాటి మాటికీ కరతాళ ధ్వనులు చేస్తున్నారు, 'జై'లు కొడుతున్నారు.

సీతారామారావుకి ఆశ్చర్యం వేసింది. వాళ్ల మెడల్లో వున్న పూలమాలలు, వాళ్ళు

కుర్చీల్లో కూర్చున్న వైఖరీ, ప్రజల కరతాళ ధ్వనులూ, వాళ్ళ ఆనందం - ఇవన్నీ అతన్ని కలవరపరిచాయి. అతనికి కంపరం కలిగించాయి.

వీళ్ళా ప్రజలకు నీతులు చెప్పేది? వీళ్ళు చేస్తున్న దురంతాలు, మోసాలు, అన్యాయాలు ప్రజలు అప్పుడే ఎట్లా మరిచిపోయారు?

తమ ప్రవర్తనను మార్చుకోకుండా ప్రజలకు ధర్మోపన్యాసాలు చెప్పటానికి ఎట్లా సిగ్గులేదు?

అతను తుక తుక ఉడికి పోతున్నాడు. వేడి ఊర్పులు విడుస్తున్నాడు. హృదయంలో నుండి బయటికి రావడానిక ఏదో గిలగిల

తన్నుకుంటూ వుంది.

నాగలింగం ఉపన్యాసం పూర్తి చేసి కూర్చున్నాడు, కరతాళ ధ్వనులు జయ జయ ధ్వానాలూ మిన్ను మిట్టినయ్. అధ్యక్షులు నెమ్మదిగా లేచి సవినయంగా "ఇంకెవరయినా మాట్లాడే వాళ్ళుంటే మాట్లాడవచ్చు" అన్నాడు.

"నేను మాట్లాడతాను" అని జనంలోంచి కేక వేశాడు సీతారామారావు. ఆ ధ్వనికి ప్రజలంతా నిశ్శబ్ధపూరితులయ్యారు. ప్రజల దృష్టి అతని వైపుకు ఒక్కసారి మరలింది.

అధ్యక్షులు "దయ చేయండి" అన్నారు.

సీతారామారావు ప్రజల్ని నెట్టుకుంటూ వెళ్ళి వేదిక యెక్కాడు. వేదిక మీద వున్న వాళ్ళు ఇతన్ని ఎరిగిన వాళ్లే. సూర్యప్రకాశరావు తనకి దగ్గర బంధువు కూడాను.

అతని ఆకారం భయంకరంగా వుంది. తూలిపోతూ వుంది. అతన్ని చూచి వేదిక మీద వున్న వాళ్ళంతా గాభరాపడి వాళ్లల్లో వాళ్ళు గుసగుసలాడుకోవటం మొదలు పెట్టారు.

అతను జనాన్ని తీక్షణంగా చూస్తూ, "వీళ్ళా మీకు నీతులు వుపదేశించేది? వీళ్ళ మాటలు వింటానికా మీరంతా తహతహలాడేది? వీళ్ళనా మీరు గౌరవించేది. వీళ్ళల్లో ఒక్కడు ఋజుమార్గాన బ్రతుకుతున్న వాడున్నాడా? వీళ్ళంతా దుర్మార్గులు, ద్రోహులు, మోసగాళ్ళు, అవినీతిపరులు" అని బిగ్గరగా కేకలు వేశాడు.

ప్రజలు నిశ్చేష్టులై చూస్తూ కూర్చున్నారు. వేదిక మీద కూర్చున్న నాయకులు బిక్క మొఖాలు వేసుకుని ఒకరి మొఖాలు ఒకరు చూచుకుంటున్నారు.

"ఇందులో మీకు నీతులు చెప్పతగ్గ వాడెవడు? ఈ పరబ్రహ్మ శాస్త్రి? వీడు ఇందాక మీకు శీలాన్ని గురించి అత్యుతమయిన ఉపన్యాసాన్ని యిచ్చాడు. మీరంతా చప్పట్లు కొట్టారు. వీడు చేసే పనేమిటి? వీడి మరదలికి ఎందుకు పెళ్ళి కాలేదో అడగండి! ఎప్పుడూ యితని యింట్లోనే ఎందుకు వుంటుందో అడగండి? ఈ నాగలింగాన్ని మీరు ఎరుగుదురా? ఎప్పుడూ తనకు టైపిస్టుగా మళయాళీ కుర్రదాన్నే ఎందుకు పెట్టుకుంటాడో అడగండి. ఎర్రగా సన్నగా మృదువుగా వుండే కుర్రవాళ్ళు తప్ప మిగిలిన వాళ్ళు టైపు చెయ్యటానికి పనికి రారా? ఎవరూ లేనప్పుడు తన టైపిస్టు తల నిమురుతూ కూర్చోవటం ఎందుకు? అడగండి వీడికి చేనేత పరిశ్రమంటే ఎంత ఇష్టమో! ఈ రాంభొట్లు వాళ్ళమమ గొంతు పిసికి అరవై వేలు కాజేశాడు. ఈ

విశ్వేశ్వరరావు ఇంత పెద్ద వాడు గదా! వీడికేమయినా బుద్ధి వుందీ! మొన్న అభం శుభం తెలియని పది సంవత్సరాల పిల్లని తాయం పెడతా రమ్మని ఇంట్లోకి పిలిచి యేం చేశాడు? ఒక నెల రోజులు మీరు ఆ విషయము ఆగుబ్బుగా చెప్పుకుంటిరే, వీణ్ణి బహిష్కరించాలని తీర్మానించుకుంటిరే! అప్పుడే మరచిపొయ్యారా! ఇక ఈ సూర్యప్రకాశరావు సంగతి మీ అందరికీ తెలిసిందే! ధర్మసత్రం డబ్బు పది వేలు తిన్నాడు. వాళ్ళ ఇంటిపక్కన వున్న పాపయ్య ఇల్లు తాకట్టు పెట్టుకొని డబ్బు వడ్డీకి యిచ్చి ప్రస్తుతం అతని భార్యని వశం చేసుకున్నాడు. పాపయ్యకు తెలుసుకాని, తెలిసి ఏం చేస్తాడు? ఏమన్నా అంటే యిల్లు

వేలం వేయిస్తానని బెదిరించాడు. ఇప్పుడా పాపయ్యకు పిచ్చెత్తింది. వీళ్ళా మీకు నీతులు చెప్పే ప్రవక్తలు! లోక కళ్యాణార్థం ధర్మోపన్యాసాలు చేసే త్యాగమూర్తులు! ప్రజలను ఉద్ధరించే నాయక శ్రేష్ఠులు!"

అతను మాట్లాడుతూ వుంటే ప్రజలు నోళ్ళు తెరుచుకొని వింటున్నారు? వేదిక మీద ఉన్న వాళ్ళు కుంచుకు కుంచుకుపోతున్నారు. ఎవ్వరికీ ముందుకు రావడానికి ధైర్యం చాలటం లేదు. ఎవరికి వాళ్ళు తమని గురించి ఏమంటాడో తమ రహస్యాలు ఏం బయట పెడతాడోనని ప్రాణాలు బిగపట్టుకు కూర్చున్నారు.

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

18 వ భాగం

అధ్యక్షుడితో సూర్యప్రకాశరావు "తాగాడు, దింపండి. అట్లా చూస్తారేం?" అన్నాడు. కాని అధ్యక్షుడికి ఊపిరి సలపటం లేదు. సీతారామారావు మాట్లాడుతూనే వున్నాడు. ప్రజలలో నుండి "నీ సంగతేమిటో కూడా కాస్త చెప్పు" అని కేక వేశాడొకడు.

"నా సంగతేదయినా నేను మీకు నీతులు చెప్పడం లేదు. నేను ఆచరించని సిద్ధాంతాలను మీకు బోధించడం లేదు" అన్నాడు సీతారామారావు.

"మరి ఇందాకటి నుంచీ ఏడ్చిందేమిటీ?" అని యింకొకడు కేక వేశాడు.

"మీకు నీతులు చెప్పే వాళ్ళు చూచి మోసపోవద్దని చెపుతున్నాను. వీళ్ల కపట ప్రవర్తనను, వీళ్ళ నీచ స్వభావాలను మీకు ఎరుకపరుస్తున్నాను."

"అన్నీ ఏడ్చావులే. దిగు!" ప్రజల్లో గోల బయలుదేరింది. ఈలలు వేయటం, వెకిలి నవ్వులు నవ్వటం, చప్పట్లు కొట్టడం ప్రారంభించారు.

సోడా బుడ్డి కీచుమంది.

అధ్యక్షుడికి ధైర్యమొచ్చింది. "ఇక కూర్చో" అన్నాడు, భుజం పట్టుకు లాగుతూ.

సీతారామారావు విదిలించుకొని "ఇదిగో, అధ్యక్షులవారి సంగతి సెపుతా వినండి. ఈయన స్వాముల వారు గదా! శుద్ధ చేతన స్వరూపం గదా! సర్వసంగ పరిత్యాగి గదా! ఈయన చేస్తున్న పనులేమిటో తెలుసుకోండి" అని బిగ్గరగా అన్నాడు. చైతన్యస్వామి ముఖాన నెత్తురు లేకుండా పోయింది. ఆపట్నే కుర్చీలో చతికిలబడ్డాడు!

"చెప్పు - చెప్పాల్సిందే" అని ప్రజలు కేకలు వేశారు.

"స్వాముల వారు ఈ ప్రపంచం మిధ్య అని చెప్పుతారు. జీవి తన జీవితమంతా భగవంతుని జేరటానికై ప్రయత్నించాలని భోధ చేస్తారు. కాని వీరేం చేస్తున్నారో అడగండి. ఈ భోధలు. ఈ నియమాలు తాము అనుసరించవలసిన అవసరం లేదంటారు. ఇవన్నీ అజ్ఞానుల కోసం ఏర్పడ్డవి. కాని జ్ఞాని వీటికి అతీతుడు అంటారు. తాను జ్ఞాని కనుక, ఏం చేసినా తప్పు లేదనీ, తనకు అంటవనీ చెపుతారు.

ఒక కుర్రదాన్ని వేదాంతబోధ అని భర్త దగ్గర నుంచి లేపుకొచ్చాడు. అడగండి - నా మాట అబద్ధమేమో! మొదట్లో ఆ పిల్ల అంగీకరించకపోతే "తప్పేముంది, దురదపుడితే గోక్కోవడం లేదా!" అని బోధ చేశాడు.

ఆ కుర్రది ఈ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టింది. స్వాముల వారితోనో అక్క పొయ్యేటప్పటికి, స్వామీజీకి ఆగ్రహం వచ్చి ఆశ్రమంలో నుంచి తరిమేశాడు. ఆ పిల్ల తిరిగి ఆత్మహత్య చేసుకుంది. అడగండి - నా మాట అబద్ధమేమో!"

జనానికి ఈ విషయం వింటానికి ఆహ్లాదకరంగా వుంది. సంతోషంగా గోల చేస్తున్నారు. చైతన్యస్వామి బుసలు కొడుతున్నాడు, సీతారామారావు మాట్లాడుతూనే ఉన్నాడు.

"ఇక మీ సంగతి చెపుతాను. అసలు తప్పంతా మీదే - ఎవరేం చెప్పినా, చెప్పేది ఎవ్వరైనా వెర్రిమొహాలు వేసుకొని వింటూ వుంటారు. మీకు బుద్ధి లేదు. మీరు గొర్రెలు. ఎవ్వరేం చెపుతున్నారా అనే ఆలోచన మీకు లేదు. ఆహ్హాహ్హా, ఇహ్హిహ్హి అంటారు."

తన వెక్కిరింపు తనకే సంతోషం కలిగించింది. ప్రజల్లో ఎక్కువ మంది నవ్వుకున్నారు గాని, కొంత మంది ముఖాలు మాడ్చుకుంటున్నారు. "పిచ్చెక్కింది" అని కొందరూ, "మదం దించాలి" అని కొందరూ అనుకుంటున్నారు. తమను మర్ధించటం ఆగటం వల్ల, వేదిక మీద వున్న పెద్ద మనుషులకు కొంచెం ఊపిరి సలుపుతూ వుంది. సూర్యప్రకాశరావు కోపంతో ఉపాయం ఆలోచిస్తున్నాడు.

"సంఘ సంస్కర్త ప్రజాహిత జీవితానికి, వ్యక్తిగత జీవితానికి సంబంధం లేదు - అనే మాటలు మీరు నమ్మకండి. మిమ్మల్ని మోసం చెయ్యటానికి చెప్పే మాటలివి. పెద్ద వాళ్ళ వ్యక్తిగత జీవితాలను మీరు జాగ్రత్తగా పరిశీలిస్తూ వుండాలి. ఒక వ్యక్తి భావాలను, అభిరుచులను, అభిప్రాయాలను నిర్ణయించేది వ్యక్తిగత జీవితమే అని మరిచిపోకండి... మీరు అజ్ఞానులు, మూర్ఖులు, పందులు......" అని ప్రజలను నోటికి వచ్చినట్టు తిట్టడం మొదలు పెట్టాడు.

అవకాశం కోసం నిరీక్షిస్తున్న సూర్యప్రకాశరావు దిగ్గున లేచి, సీతారామారావుని ఒక్క పెట్టున పక్కకు నెట్టి, ప్రజలు ఉద్దేశించి ఆవేశంతో - "వీడు తాగుబోతు..... హంతకుడు. వీడు మిమ్మల్ని ఇంత నీచంగా తిడుతూ వుంటే మీరు ఎలా సహించి ఊరుకుంటున్నారు - మీరు ఆంధ్రమాత పుత్రులు కదా? మీలో వున్న ఆంధ్రరక్తం, ఆంధ్ర శౌర్యం, ఆంధ్రుల ప్రతాపం ఏమయినవి? అవమానం సహించి ఎలా ఊరుకో గలుగుతున్నారు?"

"తన్నండి" "పొడవండి" అని బండబూతులు, కూస్తూ వేదిక మీదకు ఎక్కుతూ వుంది జనం.

సీతారామారావు గబాలున బల్లమీదకు ఎక్కి కుర్చీ ఒకటి చేత్తో పైకెత్తి పట్టుకొని "రండి - నా వంటి మీద చెయ్యి పడిందా మీ ప్రాణం పోయిందే! ప్రాణాలకు ఆశ వదులుకున్న వాడెవ్వడో ముందుకు రండి" అని గద్దించాడు.

అతని ఆకారం భయంకరంగా ఉంది, ఏ పని చెయ్యడానికయినా వెను తియ్యడని ముఖకవళికలు చెపుతున్నాయి. జనం ముందుఉ రావటానికి భయపడింది. ఎవరికి వాళ్ళు తమనే సంబోధిస్తున్నాడనుకున్నారు. ముందు దెబ్బ తన మీదే పడుతుందను కున్నారు. వెనక వాళ్ళు బండబూతులు తిడుతూ ముందు వాళ్ళని వేదిక దగ్గరకు తోస్తున్నారు. ముందు వాళ్ళు మాత్రం నిగడదన్ని నుంచున్నారేగాని కదలడం లేదు.

అతడు అలాగే కుర్చీ చేత్తో యెత్తి పట్టుకొని "రాకండి. ఒక్క అడుగు ముందుకు వేశారా తలలు పేలిపోతాయ్" అన్నాడు.

ప్రజలు భయపడుతూ వుంటే అతనికి కసి ఎక్కువ అయింది. "మీరంతా ఒట్టి పిరికి వెధవలు, రారేం? నుంచున్నారేం.... రండి......" అని అరిచాడు.

"తన్నండి చూస్తారే? వాడు దుర్మార్గుడు - భార్యనూ, పిల్లలనూ బాది బాది వచ్చాడు. చూస్తూ ఊరుకుంటే ఏమయినా చేస్తాడు" అని జనంలోంచి ఎవ్వరో కేక వేశారు.

ఆ గొంతు అతనికి బాగా పరిచయం అయిన గొంతుగా అనిపించింది. అటు చూశాడు. రామయ్య తాత.... జనాన్ని నెట్టుకుంటూ ముందుకు వస్తున్నాడు. జనం అతన్ని అనుసరిస్తూ ఉంది -

"రామయ్య తాత నువ్వా! రా...... నీ సంగతి ఒక్కటే ఇక మిగిలి వుంది. ఈ రామయ్య తాత ఉన్నాడు చూశారూ ఇంత ముసలివాడా....?"

"పడెయ్యండి.... పట్టుకోండి...." అన కేక వేశాడు రామయ్య తాత. చైతన్యస్వామికి ధైర్యం వచ్చింది. సీతారామారావు నుంచున్న బల్ల పడదోశాడు. బల్లతో పాటు సీతారామారావు కింద పడ్డాడు జనం విరుచుకు మీద పడింది.

"తన్నండీ"

"కట్టి పడ వెయ్యండి."

"ఏం వదిరాబ్రా"

"పెద్దల్ని తిడతాడా పబ్లిక్కులో పట్టుకుని."

"పిచ్చిగాదురాత, వాళ్లకి వ్యక్తిగత తగాదాలున్నాయి. కసి తీర్చుకోవడానికి వాళ్లని అవమానించటానికి ఇంత పని చేశాడు."

నోటికి వచ్చిన బూతులు కూశాడు. తలొక తన్నూ తన్నారు. సీతారామారావుకి కదిలే ఓపిక లేదు, అలాగే మాట్లాడకుండా పడి వున్నాడు. రామయ్య తాత దగ్గరకు వచ్చి పలకరించాడు.

"బాబూ - ఇప్పుడు ఎట్లా వుంది-"

"బాగానే ఉంది తాతా! నీ మనవడికి ఒక సహాయం చెయ్యవూ?"

"ఏమిటి బాబూ?"

"నీ మనుమరాలితో నన్ను క్షమించమని చెప్పు తాతా!"

"అదెప్పుడో క్షమించి వుంటుంది బాబూ"

"తాతా - ఇంకా నేను చేసిన తప్పేమిటో నాకు తెలియటం లేదు. - యింత మంది చెయ్యని పాపం నేనేం చేశాను తాతా? నాకేమి తెలియటం లేదు తాతా-"

"బాబూ! నీతో... మాట్లాడి మాట్లాడి మొహం మొత్తింది....."

"ఫరవాలేదు బాబూ, ఆ గన్నేరు చెట్టు క్రిందకు వెళ్దాం రా. తీరిగ్గా మాట్లాడుకుందాం.

-5-

అది గన్నేరు చెట్టు. రాత్రుళ్ళు నిద్రపోతుంది. అందుకని దాన్ని నిద్రగన్నేరు అంటారు. దాని ప్రక్కన చిన్న వంతెన వుంది. ఆ వంతెనకు ఎదురుగా పిల్లలబడి దానికి కొంచెం దూరంగా ఒక ఆశ్రమం వున్నది.

ఆ గన్నేరు చెట్టుక్రింద కూర్చున్నారు రామయ్య తాతా, సీతారామారావూను, సీతారామారావు ఆ వంతెన మీది నుంచి వెళుతున్న మనుషుల్నీ, బళ్ళనీ చూస్తున్నాడు.

సూటు వేసుకుని టక టక నడుస్తూ, ఒక ఉద్యోగి వెళ్ళాడు. పంచె ఎగగట్టి గంధం బొట్టు పెట్టుకొని ఏవో మంత్రాలు గొణుక్కుంటూ ఒక పురోహిత బ్రాహ్మణుడు వెళ్ళాడు. గోచి పెట్టుకొని ఒక ఎరికలవాడు పందులను "టుర్..... టుర్...." అని తోలుకుంటూ వెళ్ళాడు. ఒక కారు వెళ్ళింది. ఒక జట్కాబండి వెళ్ళింది. ఒక రెండెడ్ల బండి వెళ్ళింది.

వీటిని చూస్తూంటే సీతారామారావుకి ప్రపంచ స్వభావం - ఇన్నాళ్ళ నుంచీ దేని కోసం తాను వెతుకుతున్నాడో అది అర్థమయినట్లు అనిపించింది. అతను పశుదశను దాటి ఆధ్యాత్మిక వాదంలోకి, ఆధ్యాత్మిక వాదాన్ని దాటి భౌతిక వాదంలోకి - సంఘం అభివృద్ధి చెందుతూ వుంది అనుకున్నాడు.

అది నిజమే, కాని సంఘంలో ఈ మూడు దశలకు చెందిన వారూ ఉంటున్నారు. ఒక వాదం మరొక వాదాన్ని రూపు మాపటం లేదు. వివిధ దశలకు సంబంధించిన కార్లూ, గుర్రాలూ, ఎడ్లబళ్ళూ అన్నీ సంఘంలో వుంటూనే వున్నాయి. అన్నింటి అవసరం ఉంటూనే ఉంది. నేటి పని అవి చేసుకుపోతూనే వున్నాయి. ఒకటి వచ్చి రెండో దాని అవసరం లేకుండా చెయ్యటంగాని, నామరూపాలు లేకుండా చెయ్యటంగానీ లేదు - జరగటం లేదు. మానవసంఘం ఎన్ని దశలు దాటినా, ఎంత పరిణామం చెందినా, అన్ని దశలకు సంబంధించిన లక్షణాలూ ఎప్పటికప్పుడు సంఘంలో ఉంటూనే ఉన్నాయి. ఈ అన్ని లక్షణాలనూ కలుపుకునే - సంఘం వృద్ధి చెందుతూ వుంది.

అయితే ఒక దశ నుంచి మరొక దశకు రావటం అంటే ఏమిటి? ఈ ప్రశ్నకు అతనికి వెంటనే జవాబు దొరకలేదు. కాని తనకేదో నూతన దృష్టి ఏర్పడుతూ వున్నట్లు అనిపించింది. కాని ఆలోచించ బుద్ధి పుట్టలేదు. అలాగే చూస్తూ కూర్చున్నాడు రామయ్య తాత.

నిమిషాలు గడిచిపోతున్నాయి. రామయ్య తాత సీతారామారావుని తేరిపార జూచి మెల్లగా మాటలు మొదలుపెట్టాడు.

“జ్ఞానం కావలసిందే బాబూ! జ్ఞానం లేకపోతే అభివృద్ధే వుండదు. మానవుడు ప్రకృతిలో భాగమే అవటం వల్ల జ్ఞానమే లేకపోతే ప్రకృతికి దాసుడుగానే ఉండే వాడు. ప్రకృతి నుంచి మానవుణ్ని వేరు చేసింది జ్ఞానమే. ఈ జ్ఞానం వల్లే మానవుడు ప్రకృతిని విడిగా చూడగలుగుతున్నాడు. ప్రకృతి స్వభావాన్ని అర్థం చేసుకొని, దాన్ని లోబరచుకో గలుగుతున్నాడు. తన భవిష్యత్తుకి తానే కర్త అవుతున్నాడు. కాని జ్ఞానానికి రెండు వైపులా పదును వుంది. జ్ఞానభాండారాన్ని ఎప్పటికప్పుడు నింపుకుంటూ వుంటేనే అది మానవుని అభివృద్ధికి ఉపయోగపడుతుంది. దానికి నిత్య నైవేద్యం అవసరం. లేకపోతే ఎదురు తిరిగి, తన్ను సృష్టించిన మానవ జాతినే సర్వనాశనం చేస్తుంది.

నీ దుర్గతికి ఇదే కారణం బాబూ! నీకు జ్ఞానం వుంది. ఇటీవల ప్రచారంలోకి వొచ్చిన సిద్ధాంతాన్ని అర్థం చేసుకున్నావు. కాని ఇప్పుడు పరిస్థితులు మారినాయి. ఆ సిద్ధాంతం ప్రచారంలోకి వొచ్చిన తర్వాత అనేక కొత్త విషయాలు అనుభవంలోకి వొస్తున్నాయి. అప్పుడు నీకున్న జ్ఞానం నూతన సమస్యల్ని పరిష్కరించడానికి సహాయపడటం లేదు నీలో నిజమైన మానవత్వం, సక్రమమైన సంస్కారం వుంటే, నువ్వేమి చేసి వుండే వాడివో తెలుసా? నీ జ్ఞాన భండారాన్ని క్రొత్త విషయాలతో నింపే వాడివి. ఇప్పటి కున్న జ్ఞానంతో, సమస్యల వొత్తిడితో, కొత్త మార్గాన్ని అన్వేషించే వాడివి. సలక్షణంగా అభివృద్ధి చెంది లోక కళ్యాణార్థం పాటు పడే వాడివి.

కాని నువ్వలా చెయ్యలేదు. అలా చెయ్యక, నీకున్న జ్ఞానంతో ఈనాటి సమస్యలు పరిష్కారం కావని తేల్చి, అనాది నుంచీ వొస్తున్న సిద్ధాంతాలన్నీ ఏ విధంగా తప్పో నిరూపించి ఈ ప్రపంచంలో చేసేది ఏమీ లేదు! అని తేల్చావు!

నువ్వేమన్నా అనుకోగానీ, ఇందులో నువ్వు కొత్తగా కనిపెట్టిందీ అద్భుతంగా నిరూపించిందీ ఏమీ లేదు బాబూ, పాత సిద్ధాంతాలన్నీ ఒక దాని తర్వాత ఒకటి అసంపూర్ణం అని తెలుసుకునే గదా ఎప్పటికప్పుడు మనం కొత్త సిద్ధాంతాన్నీ కొత్త జ్ఞానాన్నీ తెచ్చుకుంటూ వుంది. ఇక నువ్వు పాత సిద్ధాంతాలని, తప్పు అని ఋజువు చెయ్యగలగటంలో ఆశ్చర్యంగానీ, గొప్పగానీ ఏముంది? అదే విధంగా అనుభవం వల్ల ఇప్పుడున్న జ్ఞానం కూడా అసంపూర్ణం అని తెలుసుకునే స్థితికి రావడంలో కూడా ఆశ్చర్యం ఏమీ లేదు. మానవుడికి ఆ స్థితి కలగడం మంచిది కూడా. కాని ఈ స్థితి కొత్త మార్గాలను అన్వేషించడానికి, కొత్త విషయాలను తెలుసుకోటానికి ప్రోత్సాహం ఇవ్వాలి. అలా కాక ఆ జ్ఞానాన్ని తన్ను తాను నాశనం చేసుకోవటానికి ఉపయోగించే వ్యక్తి మానవుడు కాదు - పరమ కిరాతకుడు, ఘోర రాక్షసుడు.

బాబూ! ఇప్పుడు నీ మనస్సుని కలవర పెడుతున్న సంశయం ఏమిటో నాకు తెలుసు. “తాతా! నాకు జ్ఞానం వుందని అంగీకరించావు గదా! మరి నేను ముందుకు పోక వెనక్కి రావడానికి కారణం ఏమిటి?” అని అడగదలచుకున్నావు, చెపుతాను బాబూ, దానికి కూడా కారణం చెబుతాను.

జ్ఞానం ఒకటే మానవుని అభివృద్ధికి సహాయపడదు. దాన్ని సంఘ శ్రేయస్సుకు ఉపయోగపడేటట్టు చేసే మనస్తత్వం కూడా ఉండాలి. కత్తి వుంది, దాన్ని ఉపయోగించే ఉత్తమ సంస్కారం గలవాని చేతిలో పడితే, సంఘ శ్రేయస్సుకి ఉపయోగపడుతుంది. లేకపోతే సర్వనాశానికి ఉపయోగపడుతుంది. అధికారం వుంది, అదీ అంతే, జ్ఞానం కూడా అంతే!

నీకీ విషమావస్థే వచ్చింది. ఈ విషమావస్థలో పడే ఇన్నాళ్ళూ నువ్వు దారీ తెన్ను లేకుండా కొట్టుకుంటున్నావు. నీవు కొద్దో గొప్పో జ్ఞానాన్ని సంపాదించావు, కాని జీవితపు లోతులు అనుభవంలోకి రాలేదు. జీవిత ప్రవాహం వొడ్డున నిలబడి పుస్తక జ్ఞానంతోనే తృప్తి పొందడం వల్ల జ్ఞానానికి తగిన మనస్తత్వం నీకు యేర్పడలేదు. అందువల్లే జ్ఞాన సముపార్జన దానంతట అదే నీకు ఆనందాన్ని అదే నీకు ఆనందాన్ని తృప్తి పొందడం వల్ల జ్ఞానానికి తగిన మనస్తత్వం నీకు యేర్పడలేదు. అందువల్లే జ్ఞాన సముపార్జన దానంతట అదే నీకు ఆనందాన్ని తృప్తిని ఇవ్వలేక పోయింది. జ్ఞాన సముపార్జనతో పాటు నీ ఆనందం కాక

మరొక ఆధారం నీకు కావలసి వచ్చింది. దాని కోసం వెతికావు..... వెతికావు.... అహర్నిశలూ వెతికావు. నీకు అవసరమైన ఆధారం దొరికింది. నీ కంటే తక్కువ జ్ఞానం కల వాళ్ళకు పట్టు గొమ్మలుగా పనికి వచ్చినవి నీకు పనికి రాలేదు. నీకు ఊతం ఇవ్వలేదు. నీ పట్టు తప్పింది. నీ జీవితానికే ఆధారం లేకుండా పోయింది. నీ పతనం ప్రారంభం అయింది. అడుగు తగిలే వరకూ వెళ్ళావు"

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

19 వ భాగం

"పోనీ అంతటితో నయినా ఆగావా? లేదు, ప్రపంచంలో యేమీ లేదని చెప్పే నీక్కూడా నీ పతనాన్ని సమర్థించుకోటానికి కారణాలు కావలసి వచ్చినయ్. కారణాలు ఊహించావు. వెనక జరిగిందంతా తప్పే! ముందుకు ఆలోచించావు, జరగబోయ్యే దాంట్లో కూడా మానవుడు కోరదగినది ఏమీ లేదని తేల్చి వేశావు.

జ్ఞానానికి తగిన మనస్తత్వం లేకపోవడం వల్ల ఇంత దారుణమైన సంఘర్షణ, పతనం, భీభత్సం జరుగుతుంది గనుకనే, సంఘాన్ని మెట్టు తర్వాత మెట్టు పైకి తీసుకు వెళుతున్నాం, పరిణామం కప్పదాట్లు వెయ్యదు అని చెపుతున్నాం.

మానవుడు తనకున్న జ్ఞానాన్ని బట్టి ముందు చూడగలడు. ఈనాటి సంఘంలో వున్న మంచీ, ఈనాటి సంఘంలో వున్న చెడుని నిర్మూలించే మంచీ కలిసి, వచ్చే సంఘం యేర్పడుతూ వుంది. దాన్ని బట్టే తరువాత యేం జరుగబోయేదీ కూడా ఊహించవచ్చు. కాని ఈ ఊహలు యధాతథంగా జరగవు. ప్రకృతి శక్తుల్నీ, సంఘంలో వున్న శక్తుల్నీ, మానవునిలో వున్న శక్తుల్నీ మనం ఇంకా పూర్తిగా మన అధీనంలోకి తెచ్చుకోలేదు. మనకున్న అనుభవాన్ని బట్టి, మనకున్న జ్ఞానాన్ని బట్టి ఒక ఆదర్శాన్ని పెట్టుకొని దాన్ని పొందడానికి కృషి చేస్తున్నాం. ఈ కృషిలో మనం అనుకోని అడ్డంకులు అనేకం వస్తయ్. మనకు తెలియని విషయాలు తెలుస్తాయి. వీటితో ఎప్పటి కప్పుడు మన జ్ఞాన శోకాన్ని నింపుకుంటాం. ఈ విధంగా క్షణ క్షణ జ్ఞానం మారుతూ వుండటం వల్ల ఎల్లప్పుడూ మన ఆదర్శం కూడా, కొద్దో గొప్పో మారుతూనే వుంటుంది. కాబట్టి ఎంతో ముందుకు ఊహించి, నిక్కచ్చిగా ఇలా జరుగుతుందని తేల్చుకొని దాన్ని బట్టి మన జీవితాలను నిర్ణయించుకోవడం అర్థం లేని పని.

ఈ విధంగా ఊహించడం నీ ప్రత్యేకత కాదు. అనేక మంది ఊహించగలరు. ఊహించారు. ఊహిస్తున్నారు. సంఘ పరిణామాన్ని గురించి నాకుండే ఊహలు నాకున్నాయ్. కాని ఈ వూహలన్నింటినీ సంఘం మీద రుద్దడానికి నేను అంగీకరించను. ఎందుకో తెలుసా బాబూ!

మానవ మనస్తత్వం పరిపక్వ దశకు రానప్పుడు ఎటు వంటి ఉత్తమ బీజలైనా వెర్రితలలే వేస్తుంది. రోగాన్ని బట్టి గదా ఔషధాన్ని నిర్ణయించ వలసింది. అందుకని ఈ సంఘంలో వున్న మానవుడికి అనేక దశలు దాటింతర్వాత సంఘం ఎలా వుంటుందో చెప్పటం, అసత్యం చెప్పటమే కాక అతని మనస్సుని చిందర వందర చెయ్యటం అవుతుంది. ఈనాటి సమస్యల మీద బుద్ధి నిలపకుండా చేస్తుంది. కాబట్టి వచ్చే దశను గురించే చెపుతున్నాం.

ఆ దశ ఎలా వచ్చేది చెపుతున్నాం. అబద్ధం చెపుతున్నామని నువ్వు విచారపడవలసిన అవసరం లేదు. అప్పటికది నిజమే. అనుభవం వల్ల ఆ జ్ఞానం అసంపూర్ణం అని తెలుసుకున్నప్పుడు మరి కొన్ని విషయాలను కలుపుకుంటున్నాము అంతే బాబూ - అంతే,

అంత కంటే ఏం లేదు.... ఇప్పుడు వెనక్కి తిరిగి చూచి జరిగిం దంతా మోసం అని, నీచార్థం కలిపించటం నీ మనస్తత్వాన్ని తెలియజేస్తుంది అంతే - బాబూ - అంతే!"

రామయ్య తాత ఆగాడు సీతారామారావుని పరీక్షగా చూశాడు. అతడు ఇంకా వంతెన వైపే చూస్తున్నాడు. జనం వంతెన మీది అటూ ఇటూ తిరుగుతున్నారు. తన చూపు మరల్చకుండానే ప్రశ్నించాడు. సీతారామారావు "ఎందుకో? దేని కోసం ఈ మన ప్రయత్నం అంతా?"

"చెపుతా బాబూ, చెబుతా" అన్నాడు. రామయ్య తాత చెప్పటం మొదలు పెట్టాడు.

"ఏమిటి? ఎందుకు? అనే ప్రశ్నలు ఎలా పుట్టినయ్యో ఎందుకు పుట్టినయ్యో తెలుసుకుంటే గాని సరైన జవాబులు దొరకవు బాబూ, అందుకని మొదటి నుంచి మొదలు పెడతాను.

మానవుడు ఆలోచించడం మొదలు పెట్టినప్పుడు ఈ ప్రశ్నలు పుట్టినయి. ప్రకృతి చర్యల్ని అర్థం చేసుకోటానికి సహాయపడినాయి.

అనేకసార్లు నీవు చెప్పినట్లు ప్రాణం నిర్నిమిత్తంగా పుట్టింది. ఒక ప్రయోజనాన్ని సాధించాలని రాలేదు. ప్రకృతి కూడా అంతే, ప్రకృతి వుంది. దానికి కొన్ని నియమాలున్నాయి. ఆ నియమాలను బట్టి నడుస్తూ వుంది. అంతే కాని దానికొక ఆదర్శం లేదు. ఏ ఆదర్శాన్ని సాధించడానికీ అది పరిణామం చెందలేదు. ఇటు వంటి ప్రకృతిలో మానవుడు బ్రతకవలసి వచ్చింది. ప్రకృతి చేష్టలకు తట్టుకోలేని జీవాలు నశించినాయి. తట్టుకో గలిగినవి వృద్ధి చెందినయి. అంటే ఇలా బ్రతికితే అపాయం లేకుండా ఎక్కువ రోజులు బ్రతకగలం అని గాక, ఏ ఆలోచనా లేకుండా, బతికినన్నాళ్ళు బ్రతికినయి.

ఇటు వంటి జీవకోటిలోకి జ్ఞానం వచ్చింది. "ఇలా ఎందుకు జరుగుతూ వుంది? అలా ఎందుకు జరుగుతూ వుంది?" అనే ప్రశ్నలు బయలుదేరినయి. ఈ ప్రశ్నలు ప్రకృతిని అర్థం చేసుకోవడానికి ఉపకరించనయి. ప్రకృతి స్వభావం అర్థం చేసుకోవడం మొదలు పెట్టగానే జీవకోటి స్వభావం మారవలసిన అవసరం కలిగింది. అంతకు ముందు తన ఇష్టం వచ్చిన పనులు చేసుకుంటూ పోతున్న జీవకోటి, యిప్పుడు కొన్ని పనులు మాత్రమే చేయవలసి వచ్చింది. వెంటనే "యెందుకు?" అనే ప్రశ్న ఉదయించింది. ప్రకృతి నుంచి తప్పించుకోవడానికి దాన్ని అర్థం చేసుకొని అనుకూలంగా పని చేయించుకోవడానికి ఆదర్శం అవసరం అయింది.

ఈ ఆదర్శం ఏ విధంగా నిశ్చయింపబడిందో తెలుసా బాబూ? చెబుతా విను.

మానవులు పది మంది ఒక చోట చేరి ఒక పద్ధతిగా బ్రతకటం మొదలు పెట్టారు. ఈ పద్ధతే మానవుని భవిష్యత్తును నిర్ణయించింది. మానవుడు ఓం ప్రథమంలో మరొక పద్ధతి అవలంభిస్తే పరిణామం మరొక రకంగా ఉండి ఉండేదేమో? అలా జరగలేదు. ఆచరణలో వున్న పద్ధతి ఎక్కువ మందిని బాధపెట్టే స్థితికి వచ్చినప్పుడు ఆ బాధలు ఏం చేస్తే పోతాయో, ఈ బాధలు లేని సంఘం ఎలా వుంటుందో ఊహించుకొని దాని కోసం పాటు పడటం మొదలు పెట్టాడు. అభివృద్ధి చెందటానిక ఈ విధంగా మానవుడికి ఆదర్శం ఒకటి అవసరం అయింది.

మనం సౌలభ్యం కోసం మానవ పరిణామం దశలుగా వర్ణిస్తున్నాం గాని ఇవి ముక్కలు కావు. మనం ఒక ఆదర్శం సాధించటానికి చేసే ప్రయత్నంలో పొందే జ్ఞానాన్ని బట్టి మన ఆదర్శం అనుక్షణం పరిణామం చెందుతూనే వుంటుంది. ఈ

పరిణామం ఒక ప్రవాహం వంటిది బాబూ! దీనికి కొండలు, గుట్టలు అనేకం అడ్డు రావచ్చు. ఈ అడ్డంకులను తొలగించుకోటానికీ అది ఒక్కొక్కసారి ప్రబల ప్రయత్నం చెయ్యవలసిన అవసరం కలగవచ్చు. అది ఒకసారి మందంగా ఒకసారి ఉధృతంగా ప్రవహించవచ్చు. కాని అది ఎడతెరిపిలేని ప్రవాహం.

చూశావా బాబూ! మానవుడు తాత్కాలికంగా తను పడుతున్న బాధలను నివారించుకోవడానికై ఈ పరిణామానికి దోహదం చేస్తున్నాడు. అందుకుగాను ఈ పరిణామానికి దోహదం యిచ్చే గుణాలు బలవత్తరం చేసుకొని, ఈ పరిణామానికి అపకారం చేసే గుణాలను అణగదొక్కుకుంటున్నాడు, అరి కడుతున్నాడు. ఇప్పటికీ ప్రయత్నపూర్వకంగా జరుగుతూ వుంది. ఈ పని చెయ్యటం ఇప్పటికీ బాధాకరంగా కూడా వుండొచ్చు. కాని ఎప్పటికీ వుండవలసిన అవసరం లేదు. మానవుడీ విధంగా అభివృద్ధి చెందుతూ పోతే ఒకప్పటి సంఘానికి దోహదం యిచ్చే పనులే వ్యక్తికి ఆనందాన్ని, తృప్తినీ యిచ్చే స్థితి వొస్తుంది. అప్పుడు మానవుడు ఆ పనులు తప్ప మరొక పనులు చెయ్యలేడు. అప్పుడు "ఎందుకు?"అనే ప్రశ్నకు తావులేదు. ఎందుకనే ప్రశ్న మానవుని చేత మంచి పనులు చేయించటానికి, సహాయకంగా వుండటానికి పుట్టింది. మానవునికి మంచి పనులు చెయ్యటమే స్వభావం అయినప్పుడు ఈ "ఎందుకు?" యొక్క అవసరం క్షీణిస్తుంది, లేకుండా పోతుంది.

బాబూ! ఒక్క సంగతి ఆలోచించు. ఇప్పుడు నీలాంటి వాడూ, నాలాంటి వాడూ దొంగతనం చెయ్యడు, వ్యభిచారం చెయ్యడు, అబద్ధాలాడడు ఎందుకు? సంఘం హింసిస్తుందనా? కష్టాలు వొస్తయ్యనా?కాదు. ఒకప్పుడు సంఘం బెదిరించి, భయపెట్టి మానవుణ్ణి ఈ పనులు చెయ్యకుండా చేసిన మాట వాస్తవమే. కాని ఇప్పటికిది మన స్వభావం అయింది. మనం ఆ పనులు చెయ్యం. ఎందుకు? మనం గడించిన సంస్కారానికి ఆ పనులు సుఖం యివ్వవు. పైగా విపరీతమైన మానసిక బాధను కలిగిస్తాయి.

మానవుని కొన్ని గుణాలనూ, వాంఛలనూ మార్చలేమని నేనూ వొప్పుకుంటాను, కాని ఆ వాంఛలు అనాది నుంచి ఏ విధంగా తీరుతున్నయ్యో ఆ విధంగానే తీరాలంటే మాత్రం నేను వొప్పుకోను. మానవుని కోర్కెలను ఉదాత్త పరచటం వల్ల మరొక రకంగా మనకు తృప్తి కలుగుతూ వుంది. స్త్రీ వ్యామోహాన్ని దేశం మీదకు తిప్పవచ్చు. విశ్వమానవ ప్రేమగా మార్చవచ్చు. ఈ విధంగా ఉదాత్తం చేసే శక్తి మానవుడికి వుండబట్టే సంఘ పరిణామానికి సహాయం చెయ్యటంలోనే ఆనందం పొందగలుగు తున్నాడు. అదే అతని స్వభావం అవుతుంది ఏ నాటికైనా.

అప్పటికి ప్రకృతిని మానవుడు లోబరచుకో గలుగుతాడు. ప్రకృతికి, మానవుడికి సంఘర్షణ వుండదు. మానవునిలో విరుద్ధ శక్తుల ఘర్షణ వుండదు.

బాబూ! నువ్వు "మానవుడు పరిస్థితులకు బానిస" అనుకుంటున్నావు. అందుకనే "నాదేముంది? నేనలా చెయ్యక తప్పింది కాదు. పరిస్థితులు భావాలను కలిగిస్తున్నాయ్ - భావాలు పనులు చేస్తున్నాయ్. ఇక నాదేముంది?" అని మాటిమాటికి అంటూ వుండే వాడివి. అలాకాదు బాబూ! ఒకప్పుడు అంతేగాని, మానవుడు క్రమక్రమేణా ప్రకృతి శృంఖలాల నుంచి బయట పడుతున్నాడు. ప్రకృతి నియమాలను అర్థం చేసుకొని, తన అభివృద్ధికి ఉపయోగించుకోవటం ద్వారా ప్రకృతిని జయించి తన స్వతంత్రత చూపుతున్నాడు.

ప్రకృతి శక్తుల్ని పూర్తిగా అర్థం చేసుకున్నాక ప్రకృతికి, మానవునికి సంఘర్షణ వుండదు. సాంఘిక పరిణామమే మానవునికి ఆనందం యిచ్చే మనస్తత్వం అతనికి కలిగినాక సంఘానికీ, మానవునికీ సంఘర్షణ వుండదు. మానవునిలో విరుద్ధ శక్తుల

సంఘర్షణ వుండదు. మానవుడు పరిపూర్ణ మానవుడవుతాడు.

బాబూ! ఈ దృష్టితో ఆలోచించు. సంగతులన్నీ నీకు తెలిసినవే కాని, దృష్టి మాత్రం భేదం. వ్యక్తిగత దృష్టి వల్ల విరుద్ధ శక్తులు ప్రకోపించటం; మానవకోటి నాశనం అవటం తప్ప, మరొకటి జరుగదు. సాంఘిక దృష్టి అలవరచుకొని ముందుకు చూడు - సంఘాన్ని ముక్కలుగా చూడక మొత్తంగా చూడటం నేర్చుకో.

సంఘంలో భిన్న వర్గాలున్న మాట నిజమే బాబూ! ఈ వర్గాల పోరాటం పరిణామానికి దోహదం ఇస్తున్నమాట నిజమే! కాని ఈ వర్గాలు ఒకదానికొకటి సంబంధం లేని ముక్కలుగా కాక, ఒక దాని మీద ఒకటి ఆధారపడ వుంటున్నాయ్. వీటి కలయికే సంఘం అనే మాట మాత్రం మరచిపోకు. బాబూ! ఇప్పుడు నువ్వు తరువాత మెట్టుకు వెళ్ళవలసిన స్థితికి వచ్చావు. ధైర్యంగా ముందుకు వెళ్ళు. నువ్వు సుఖపడు - నీ కుటుంబాన్ని సుఖపెట్టు" అని ముగించాడు రామయ్య తాత.

సీతారామారావు మాట్లాడలేదు. ఒక్క క్షణం రామయ్య తాతని ఎగాదిగా చూచి, తన దృష్టిని వంతెన వైపుకు తిప్పాడు. వంతెన మీద నుంచి వెళుతున్న వొక మాలవాడు ఎదురుగా వస్తున్న ఆశ్రమవాసుల్ని చూచి దూరంగా వెళ్ళి నిలబడ్డాడు. ఎదురుగా వస్తున్న ఇద్దరు విద్యార్థులు ఆశ్రమ వాసుల్ని హేళన చేశారు, ఆశ్రమ వాసులు తమ స్వంత గుణాన్ని వొదిలి తమ చేతుల్లో వున్న దండాలు పైకెత్తారు. విద్యార్థులు పకపకా నవ్వుతూ పారిపోయారు.

సీతారామారావు అలాగే చూస్తూ కూర్చున్నాడు. కాలక్రమేణా ఆ ప్రదేశం నిర్మానుష్యం అయింది. వంతెన బావురుమంటూ వుంది. అర్థ చంద్రాకారంగా వుంది. అంతులేని సొరంగంలాగు వుంది.

రామయ్య తాత సీతారామారావుని చూస్తూ కూర్చున్నాడు.

నిశ్శబ్దం - నిశ్శబ్దం - అంతులేని నిశ్శబ్దం. రామయ్య తాతకి అంతులేని ఆ నిశ్శబ్దంలో సీతారామారావు వొక భాగం అయినట్లూ నిశ్శబ్దమే అవుతున్నట్లు కనుపించాడు.

"ఇక వెళదాం బాబూ ఇంటికి" అన్నాడు.

సీతారామారావు నెమ్మదిగా రామయ్య తాత వైపుకి తిరిగి విచిత్రంగా చూచి తలవంచుకుని "నువ్వు వెళ్లు తాతా" అన్నాడు.

"ఇద్దరం వెళదాం బాబూ"

"నన్నిక్కడ కాసేపు ఉండనివ్వు. తాతా! ప్రపంచంలో వున్న ఈ నిశ్శబ్దాన్నంత నాలోకి తీసుకోనివ్వు."

రామయ్య తాత ఏమనుకున్నాడో, నెమ్మదిగా నడిచి వెళ్ళాడు.

సీతారామారావు వంతెన వైపుకి తిరిగి మెదలకుండా కూర్చున్నాడు. మూర్తీభవించిన నిశ్శబ్దంలా కూర్చున్నాడు. అర్థచంద్రాకారాన్నీ అంతు లేని సొరంగాన్నీ చూస్తున్నాడు. అతని కళ్ళ వెంట కన్నీటి చుక్కలు రాలుతున్నాయ్.

ఉండి ఉండి ఆకస్మాత్తుగా "మిథ్య, మిధ్య, అంతా మిథ్య!" అని తన విశ్వాసాన్ని నిలబెట్టుకోడానికి అరిచాడు. "మిధ్య గనకనే ఎటు తిప్పి చెప్పడానికైనా వీలవుతుంది" అన తన్నావరించిన నిశ్శబ్ధం బద్ధలయ్యేటట్లు అరిచాడు.

చీకటి పడింది. తుమ్మ బీడుకీ ఏనాది వాళ్ళ గుడిసెలకీ భేదం కనబడ్డం లేదు. అన్నీ కొన్ని మైళ్ళ దూరంగా వున్న కొండల పంక్తికి మల్లే కనిపిస్తున్నాయి. కారు మబ్బులకు మల్లే వున్నాయి... సీతారామారావు కాళ్ళీడ్చుకుంటూ స్మశానం దగ్గరకు వొచ్చాడు. ఒక్కసారి స్మశానాన్ని పారజూశాడు. దూరంగా ఒక చితి మండుతూ వుంది. అతడు ఒక నిట్టూర్పు విడిచి అక్కడే కూర్చున్నాడు.

పొద్దున్నుంచీ వున్న ఆరాటం, ఆవేదనా తగ్గినయ్. ఆ చీకటి, ఆ స్మశానం దూరంగా మండుతున్న చితీ - అతనికి మనశ్శాంతిని చేకూర్చినాయి. తానన్నాళ్ళూ ఆరాటపడింది, వెతికింది ఈ స్మశానం కోసమే కాబోలు అనుకున్నాడు. ఆ చితిని తదేక దృష్టితో చూస్తూ కూర్చున్నాడు.

ఒక వ్యక్తి అతని దగ్గరకు వొచ్చి "నేను చేసింది తప్పా!" అని అడిగాడు.

సీతారామారావు ఉలిక్కిపడ్డాడు. ఆ వ్యక్తిని చూశాడు. అతడు అరవైయేళ్ళ ముసలివాడుగా కనుపిస్తున్నాడు. శరీరం శుష్కించి వుంది.

"ఏం నాయనా, నేను చేసింది తప్పా?"

"ఏది తప్పో ఎవరు చెప్పగలరు? ఎవరి మనస్సు వాళ్ళకే సాక్షి" అన్నాడు సీతారామారావు.

"అదిగది బాబూ, సత్యం చెప్పావు. నూరేళ్ళు వర్ధిల్లు! పరిస్థితులు తెలియని వాళ్ళు ఏమైనా అంటారు. తప్పు అంటారు. దుర్మార్గుడు అంటారు. ఘోరపాపం అంటారు. దేనికైనా మనుష్యులు ముందు బతకాలిగా బాబూ! నీతి, ధర్మశాస్త్రం అన్నీ - బతికే వీలున్న వాళ్ళకి. బతకటమే కష్టమైన వాళ్ళకీ బతకటమే నీతి. బతకటమే ధర్మం, బతకటమే శాస్త్రం."

"అట్లాగే కనిపిస్తూ వుంది. బతకాలి అనుకోవటం, మనుష్యులకు తప్పించుకోలేని వ్యసనం అయింది. "ఎందుకు బతకాలి?" అనే ప్రశ్న వేసుకొనే ధైర్యం ఇంకా మనుష్యులకు అలవడ లేదు....." అన్నాడు సీతారామారావు.

"మరి ఆ అవసరం తీరడానికి ప్రయత్నిస్తే తప్పేముంది?"

"లేనట్టే వుంది. అంతా ఆ పనులు చేస్తూనే ఉన్నారు. అబద్ధాలు ఆడుతూనే వున్నారు. మోసాలు చేసిన వాళ్ళు చేస్తూనే వున్నారు. ఇతరులను హింసించే వాళ్ళూ హింసిస్తూనే ఉన్నారు. ఎవరి బ్రతుకు తెరువుని వాళ్ళు నిర్ధాక్షిణ్యంగా చూసుకుంటూనే వున్నారు......" అన్నాడు.

"ఇక నే జేసిన పాపమేమిటి బాబూ? తిండికి కష్టం అయింది. ఎన్నాళ్ళు డొక్కలు మాడ్చుకొని వలవల యేడుస్తూ

కూర్చున్నామో ఎవడికి తెలుసు? ఒక రోజు కూతురు పది రూపాయలు తెచ్చి చేతిలో పెట్టింది. "ఎక్కడివి?" అని అడిగాను. అది చెప్పింది. నా దగ్గర ఏమీ దాయలేదు. బాబూ - అంతా చెప్పింది. నాకు కోపం వచ్చింది. ఎట్లా కొట్టాననుకున్నావు? ఎముకలు విరగగొట్టాను. కాని ఏం లాభం? మళ్ళీ మర్నాటి నుంచి యథాప్రకారం అయింది మా బ్రతుకు. నేను చూస్తూ ఊరుకున్నాను. అదే సంపాదించి కుటుంబం పోషించింది. ఇప్పుడు దాని తమ్ముడు అది సంపాదించే డబ్బుతో చదువు పూర్తి చేసుకున్నాడు. ఉద్యోగంలో ప్రవేశిస్తున్నాడు. ఇంత కంటే ఏం కావాలి బాబూ! బతికిన నాలుగు రోజులు అది సుఖపడింది. మమ్మల్ని సుఖపెట్టింది. దాని దారిన అది పోయింది. అదిగో బాబూ! మట్టిలో కలిసిపోతూ వుంది. నూరేళ్ళు వర్ధిల్లు" అని దీవించి వెళ్ళిపోయాడు.

సీతారామారావు ఆలోచిస్తూ కూర్చున్నాడు. రకరకాల ఆలోచనలు చెలరేగినయ్. తలచిన కొద్దీ అతనికి ప్రపంచం క్రొత్తగా కన్పిస్తూ వుంది. ఇటీవల తన అనుభవంలోకి వొచ్చిన ప్రపంచం క్రొత్తగా కన్పిస్తూ వుంది. ఇటీవల తన అనుభవంలోకి వొచ్చిన ప్రపంచం అతనికీ వింతగా వుంది.

కాని, ప్రస్తుతం బాధపడే ఓపిక కూడా లేకుండా వుంది. అలాగే నిర్జీవ ప్రతిమలాగ కూర్చున్నాడు. కోలాహలంగా వున్న ప్రపంచాన్నీ, ప్రశాంతంగా వున్న స్మశానాన్నీ పోల్చి చూసుకుంటే అతని మనస్సు చల్లబడింది. తనకు సరిపోయిన చోటుకి, తన మాతృదేశానికి, తన స్వగృహానికి వచ్చినట్టు అనిపించింది. ఇక్కడ ప్రపంచంలో వున్న భేదాల్లేవు. కీచులాటలు లేవు. హెచ్చు తగ్గుల్లేవు. సంఘాల్లేవు. మోసాలు కుట్రలు తాపత్రయాలూ లేవు. ఇక్కడ అంతా ఒక్కటే, కూలి వాళ్ళు, షావుకార్లు, ఆడవాళ్ళు - మొగవాళ్ళు, పిల్లలు, పెద్దలు, నీతిపరులు, అవినీతిపరులు - అంతా ఒక్కటే. స్మశానానికి సాక్షిక బుద్ధి లేదు. అందర్నీ సమానంగా చూస్తుంది.

తన తండ్రి, తన మేనత్తా ఇక్కడే వున్నారు. తన తల్లి ఇక్కడే వుంది. రామయ్య తాత తొణక్కుండా కబుర్లు చెబుతాడు గాని, తనకు అస్తమానం నీతులు ఉపదేశిస్తాడు గాని, ఆయన ఇక్కడకు రావలసిన వాడే. తన్ను... మోసం చేసి ఆస్తి సంపాదించిన మేనమామకు మాత్రం తప్పేదేముంది! ఆస్తిని వదిలి చేతులు జాడించుకుంటూ ఇక్కడకు రావలసిందే. యిక ఎందుకు వీళ్ళకీ ఆరాటం?

# అసమర్థుని జీవయాత్ర

గోపీచంద్

20 వ భాగం

మేం తెలివిగల వాళ్ళం అనీ ధనవంతులమనీ కొందరు విర్రవీగటం; బీదవాళ్ళం అని, మందబుద్ధులం అని కొందరు విచారపట్టం ఎందుకు?

ఇలా ఆలోచించుకుంటూ వుండేప్పటికి స్మశానం చాలా ఆకర్షవంతంగా కనిపించింది. ప్రపంచంలో వున్న కష్టాలనూ, సుఖాలనూ అన్నిటినీ భరించే మాతృదేవీలాగు, భూదేవిలాగు కనిపించింది.

దూరంగా మండుతున్న చితి ప్రపంచాన్ని దగ్ధం చెయ్యటానికా అన్నట్లు మంటల రూపంలో గుప్పుమని పైకిలేచి ఆర్భాటం చేసింది, టపటపా ధ్వని చేసింది. ఆ చితి తన్ను ఆహ్వానిస్తూ వుందనుకున్నాడు. దగ్గరకు రమ్మని తన్ను పిలుస్తూ వుందనుకున్నాడు. తనకేదో రహస్యం చెప్పటానికి వుబలాటపడుతూ వుంది, పాపం ఆ చితికి కాళ్ళు లేవు తన దగ్గరకు రావటానికి, నోరులేదు తన్ను బతిమాలటానికి! అగ్ని శిఖలను తనవైపుకు పంపుతూ వుంది. మళ్ళీ ఉపసంహారించుకుంటూ వుంది. ఆటుపోటుతో బాధపడుతున్న సముద్రపు అలలు జ్ఞప్తికి వచ్చినయి. చేత్తో పిలుస్తూ వున్నట్టనిపించిందతనికి. నెమ్మదిగా లేచి దగ్గరకు వెళ్ళాడు.

చూడగా చూడగా ఆ చితి ముసలివాని కూతురు రూపం ధరించినట్లుగా వుంది. చిటచిటలాడింది, టపటప ధ్వనిచేసింది. ఆమె ఏదో మాట్లాడుతున్నదనుకున్నాడు."సుఖంగా నా బతుకు వెళ్ళమారిపోయింది. ఈ ప్రపచంలో మిగిలేది సుఖమూ, దుఃఖించినవాళ్ళూ అంటా మట్టి కావలసిందే. ఎందుకు దుఃఖపడాలి? దేనికోసం?" అని అడిగింది.

అతడు కళ్ళు తెరుచుకొని వింటూ కూర్చునాడు. "ఇదిగో - నా యీ పక్క సమాధిలో, సత్ప్రవర్తన ఆదర్శంగా పెట్టుకోవడంవల్ల, తిండికి గడవక, కోర్కెలు తీరక, కుళ్ళికుళ్ళి చచ్చిపోయిన పుణ్యాత్మురాలు ఉంది. ఆమె ప్రవర్తన ఆమెను ఏం సుఖ పెట్టింది? ఆమె పడిన బాధలూ సహించిన కష్టాలు ఎవర్ని ఉద్ధరించమని?" అని అడిగింది.

పక్కనున్న సమాధి ఆ మాటలకు వెక్కివెక్కి ఏడుస్తున్నట్లు కదిలింది.

అతడు స్మశానాన్ని మరొకమారు పొరచూచాడు. స్మశానమంతా కదులుతున్నట్లు కనిపించింది. దిబ్బలు కదులుతున్నాయి. చీకటి వూగింది. తన తండ్రిని ఎక్కడ సమాధి చేసిందీ అతనికి తెలుసు. నెమ్మదిగా మిగిలిన దిబ్బలను తప్పుకుంటూ అక్కడికి వెళ్ళాడు. అక్కడ యేమీలేదు - దిబ్బ హరించుకుపోయి నేలమట్టమైంది.

జిల్లేడు మొక్కలు దట్టం పెరిగివున్నాయి. అతనికి యీ జిల్లేడు మొక్కలకు తన తండ్రి ఎరువయ్యాడనిపించింది. తాను ఆదర్శంగావుంచుకున్న తన అతండ్డి, అనేక ఘనకార్యాలకు కారణభూతుడైన తన తండ్రి - ప్రస్తుతం యీ జిల్లేడు మొక్కలకు ఎరువుగఆ వుండి వాటి పోషణకు ఆధారంగా వున్నాడు. ఎంత ప్రాణం లేకపోతే మట్టుకు ఇటువంటి పనికి పూకుంటాడా

తన తండ్రి?

అతనికి తండ్రిమీద కోపమొచ్చింది? తన పుట్టుకకు తండ్రే కారణం. ఈ జిల్లేడు మొక్కల పుట్టుకకూ తన తండ్రే కారణం! బతికివున్నంత కాలమూ తన్ను పోషించాడు. మరణించి ఈ జిల్లేడు మొక్కలను పోషిస్తున్నాడు. ఆయన రక్తంలో ఆయన ఆలోచనల్లో యేదో చెడు వుండి వుండకపోతే జిల్లేడు మొక్కలకు కారణభూతుడవుతాడా? ఆయనలోనుంచి జిల్లేడు మొక్కలకు బదులు గులాబీ మొక్కలు పుట్టగూడదూ? మల్లెపోదలు పెరగగూడదూ? తనకు బదులు వొక గొప్పవ్యక్తి కొడుకు కాకూడదూ

ఉన్న మొక్కల్లో పెద్ద మొక్క కదిలింది. తన్ను పలకరించింది. "అన్నాయ్!" అంది. అతడు ఉలిక్కిపడ్డాడు. ఆ మొన్ననీడ కదలి కదలి చితి వేడివల్ల వుబికి వుబికి తన తండ్రి తనను కౄరంగా చూస్తున్నాడు. గుడ్లు ఉరుముతూ, పండ్లు కొరుకుతూ యిలా అన్నాడు" ఇదట్రా నువ్వు చేసిన పని? నీమీద ఎంతో ఆశ పెట్టుకున్నానే! చివరకు నువ్వు చేసిన పని యిదా? నా గౌరవాన్నీ నా వంశ ప్రతిష్టనూ నా కుటుంబ ఔన్నత్యాన్నీ బుగ్గిపాలు చేశావు" అన్నాడు.

అతనికి కోపమొచ్చింది. "డబ్బు అయిపోయింది నాన్నా - నన్నేం చెయ్యమంటావ్?" అన్నాడు.

"డబ్బు డబ్బు డబ్బు - ఎప్పుడూ డబ్బే! నేను నువ్వు పుట్టినప్పుడే అనుకున్నాను. నీకు నీ మేనమామ పోలిక వచ్చిందని. డబ్బు లేకపోతే మాత్రమేమిరా? చెడి బతికావా బతికి చేడ్డావా? అన్నారు పెద్దలు. తరతరాల నుంచీ మేం కాపాడిన ఆచారాలను వమ్ముచేశావు. నేనెంత చెప్పినా నీకు నీ తల్లి ఆదర్శమయింది" అన్నాడు.

తల్లి పేరెత్తేటప్పటికి కోపమెక్కువయింది. తండ్రి మీద అంతకుముందు అతనికి వున్న గౌరవఅమూ అభిమానమూ అన్నీ ఆ వొక్కమాటతో ఎగిరిపోయినయి. హృదయం మీదనుంచి ఒక పెద్ద బరువు తొలిగిపోయి నట్టయింది. "ఏమిటి నువ్వు మాట్లాడేది? నీలో నీ వంశం పోగుచేసి కాపాడాని సాంప్రదాయాలు ఏమిటి? ఏమిటి నీ వంశానికి వున్న గౌరవం. నా తలలి వంశానికి లేని గౌరవం? ఎవరికి వుండే గౌరవం వాళ్ళకుంది. నీ వంశ గౌరవం అనే గానుగలో ఎంత మంది పిప్పి అయ్యారో, అవుతున్నారో నువ్వు ఎప్పుడయినా ఆలోచించావా? నీ వంశం నీ సాంప్రాదాయాలే నన్నీ స్థితికి తీసుకొచ్చినయి. పోతున్నాను - పాతాళానికి పోతున్నాను. ఈ అగాధానికి అంతున్నట్టు లేదు. ఇది వరకు ఎన్ని కష్టాలు వచ్చినా నిన్ను తృప్తిపరుస్తునానాగదా - నీ ఆత్మకు శాంతిని చేకూరుస్తున్నా గదా అని సంతోషపడేవాణ్ణి. ఇప్పుడు నువ్వు కూడా నన్ను నిందించటానికి పూనుకున్నావా? నా స్థితిని నేనేనా కారణం? నువ్వు కాదూ?" అని అడిగాడు. "నేనేనా?" అని ఆశ్చర్యపడ్డాడు తండ్డి.

"ఆఁ నువ్వే, ముమ్మాటికీ నువ్వే, నీ గుణాలు నాకు కొన్ని సంక్రమించినయి. నీ చేతులలో, నీ అభిరుచులకు అనుకూలంగా నీ ఇష్టప్రకారం పెంచావు, నా చుట్టూవున్న వాతావరణం నువ్వు నిర్మించిన వాతావరణమే. ఇక నా యిష్టమనేది ఎక్కడ చచ్చింది? నీ ఇష్టం వచ్చినట్టు పెరిగి

పెద్దవాణ్ణయ్యాను. నీ ఇష్టమొచ్చిన వూహలే వూహించాను. నీ ఇష్టానికి వ్యతిరేకంగా, నీ సంస్కారానికి భిన్నంగా ఎవరయినా బతుకుతుంటే వాళ్ళు దుర్మార్గులనీ, నీచులనీ, అవినీతిపరులనీ నాకు నూరిపోశావు. నా తల్లిని నాకు కాకుండా చేశావు. ఇప్పుడు నీ కృషి ఫలితాన్ని చూచి నీవే భయపడుతున్నావా? బెదిరిపోతునావా? నింద నామీద మోపుతున్నావా?"

అన్నాడు.

కొడుకుని చూచి భయపడ్డాడు తండ్రి. అతనికి ఏమీ తోచలేదు. తన వంశంలో పుట్టిన ఒకడు, తన తండ్రికి ఎదురు తిరిగి తన వంశాన్ని నిందించేవాడుగా తయారు అవుతాడని జన్మలోనయినా అనుకొని ఉండడు. అలాగే నిర్ఘాంతపడి చూస్తున్నాడు. అతని కొడుకు నీడ కనిపించింది. అదే తన కొడుకు అనుకున్నాడు అది కదిలింది. నిఠారుగా నిలబడ్డది. మాట్లాడింది.

"ఒట్టిది. అన్నీ అబద్ధాలు చెపుతున్నాడు. అతను చేతులారా చేసుకున్నాడు. తన తప్పును నీమీదపెట్టి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. అతను మొదటినుంచీ అంతే! తన తప్పును ఇతరులకు అంటగట్టడం, తన బలహీనలతలకు ఇతరులను హింసించడాం - నువ్వు మరణించినప్పటి నుంచి అతను చేస్తున్న పనే ఇది. ఇందులో నీ బాధ్యత ఏమిలేదు" అంది. సీతారామారావు, మాట్లాడుతున్న తన నీడను చూస్తూ - నిర్విణ్ణుడై నిలబడ్డాడు.

తండ్రి మొహం విప్పారింది. "నిజంగా నా బిడ్డవు నీవురా నాయనా!" అని తన కొడుకు నీడను కౌగిలిచుకొని "వాడు నిజంగా నా కొడుకు అనుకొని భ్రమపడ్డాను. ఎంత వేదన పెట్టాడు! వాడి మాటలు నా హృదయాన్ని ముక్కలు ముక్కలుగా తరిగాయి" అన్నాడు.

"వాడు అంతే నాన్నా. వాడికొక ఆదర్శం లేదు. జీవితానికి ఒక ఆదర్శం పెట్టుకోనివాడు, దేన్నో ఒకదాన్ని నమ్మి పనిచెయ్యనివాడు, చివరికి అంతే!" అంది నీడా.

సీతారామారావుకి కోపం వచ్చింది. ఒక అడుగు ముందుకు వేసి "ఎవరు నువ్వు" అడిగాడు. "నీ తండ్రి కొడుకుని."
"మరినేనూ?"

"నా నీడవి." "ఆఁ!"

"మరేమనుకున్నావు? హృదయంలేని ఆకారానివి. ఆకారంలేని అస్తిపంజరానివి!" అంది నీడ.

సీతారామారావుకి ఊపిరాట్టంలేదు. తండ్రి ముఖంలోకి చూస్తూ "నాన్నా ....నేను నీ కొడుకుని.... చూడు" అన్నాడు.

"పో......పో......" అని గద్దించాడు తండ్డి. "ఇంకా నన్ను మోసం చేద్దాం అనుకున్నావా? నా కొడుకుని నేను గుర్తుపట్టలేనూ! నా చేతులారా పెంచానే! వాణ్ణి నేను ఎరగనూ?...నీవానాకొడుకువి! అహ్హా! బాఊ! వీడొక పీడకలగా వున్నాడు!" అని నీడతో చెప్పి బిగ్గరగా నవ్వాడు. నవ్వుతూనే తన నీడను తీసుకొని అదృశ్యం అయ్యాడు.

సీతారామారావు కూలబడ్డాడు. అతనికేమీ అర్థమవటంలేదు. తల పేలిపోతూ వుంది.

"బాబూ!" అని పిలిచింది పక్కనున్న సమాధి. ఉలిక్కిపడి చూశాడు. పిలిచేది తన తల్లే. అందులో సందేహంలేదు. "నువ్వు మారావు నాయనా!" అంది.

"నేను మారానా అమ్మా? నా మార్పు నీకు ఆనందాన్నిస్తూ వుందా? నేను నిన్ను సంతోషపెట్టగలిగేనా అమ్మా?"

"అవును నాయనా. నువ్వు మారుతున్నావ్!" అంది తల్లి. ఆమె ఆనందాశ్రువులు రాలుస్తూ వుందని అతను ఊహించాడు.
"అమ్మా!నేను ఈ విశ్వ ప్రపంచంలో ఒక ప్రాణికి -

అందులో తల్లికి సంతోషాన్నివ్వగలిగాను, నాకింకేం కావాలి?"

"నాకు చాలా సంతోషంగా ఉంది నాయనా!" అంది తల్లి.

"అమ్మా....అమ్మా... అమ్మా....." అని సమాధి పాదాల దగ్గరపడి భోరున ఏడ్చాడు "మరి లాభంలేదమ్మా? ఆలస్యం అయిపోయిందమ్మా....."

అలా పడి ఎంతసేపు ఏడ్చాడోగాని, తల పైకెత్తి చూసేటప్పటికి చితి ఆరిపోతూ వుంది. చీకటి దట్టం అవుతూ వుంది. స్మశానం యధారూపం ధరించుతూ వుంది. నల్లకుక్క ఒకటి అతని కాలు నాకుతూ ఉంది. అతడు కదలకుండా ఆకుక్కను చూస్తూ వెల్లకిలా పడుకున్నాడు. చూడగా చూడాగా ఆ కుక్క ఆకారం తన ఆకారంగానే కనిపించింది.

తన ఆకారంగా తనకు ఎదురుగా నిలబడింది.

తన ఆకారాన్ని చూసుకునేటప్పటికి అతనికి భయం వేసింది.మొహంమడతలు పడివుంది. జుట్టు పండి రెల్లుదుబ్బులాగుంది.కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. శరీరం అస్థిపంజరంలాగుంది. ఒంగిపోయి వుంది.ఊగులాడుతూ నడుస్తూ ఉంది. నుంచోలేక కూర్చొని, కడుపు చేత్తో పట్టుకుని దగ్గుతూ వుంది.

సీతారామారావుకి తనే దగ్గుతున్నట్టు బాధ కలిగింది. ఆ ఆకారం దగ్గి దగ్గి, తోక తొక్కిన పాముల్లే లేచి, సీతారామారావుకి ఎదురుగా నిలబడి "నా జీవితం భగ్నం అవటానికి కారణం నువ్వే - మూర్ఖుడా! బంగారం వంటి జీవితాన్ని బుద్ధిలేని ఆలోచనలతో నలిపి నలిపి నాశనం చేశావు. నన్నీ స్థితికి తీసుకువచ్చింది ఎవరు? నీ తెలివితక్కువతనం, నీ అహంకారం, నీ మౌఢ్యం" అని అరిచింది.

దగ్గుతెర వచ్చింది. కుక్క మంచంలో కూలబడింది. లుంగలు పడి దగ్గుతూ ఉంది.

తన భార్య ముసలిదయింది. తన ఆకారం పడే బాధని గమనించకుండా మనుషులకు చొక్కాలు కుడుతూ ఉంది. తన కొడుకు వచ్చాడు. పెద్దవాడయ్యాడు. ఠీవిగా ఉన్నాడు. వాళ్ళెవరూ కుక్కిమంచంలో తన ఆకారం పడుతున్న బాధలు గమనిస్తున్నట్టు లేదు.

"బాబూ, మంచినీళ్ళు" అని అడిగింది తన ఆకారం.

"ముంచుకు తాగు!" అన్నాడు కొడుకు.

"కన్న తండ్రినే...." అంది ఆకారం.

"తండ్రి... ఉద్ధరించావు కదూ కుటుంబాన్ని.... సర్వమంగళం చేసి" అని

చీదరించుకున్నాడు.భార్య కొడుకుని వారించలేదు. మాట్లాడకుండా మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది.

తన ఆకారం మంచినీళ్ళు తాగబోతుండగా మళ్ళీ దగ్గుతెర వచ్చింది. గ్లాసు వొదిలి మంచంలోబడి గిలగిల తన్నుకుంటూ వుంది. నెత్తురు కక్కుతూ ఉంది. అంతా నెత్తురే! తన ఆకారం పడే బాధని సహించలేకపోయాడు.

తనే దగ్గుతున్నట్టూ, తనే నెత్తురు కకుతున్నట్టూ, తన నరాలే లుంగలుపడి, జివ్వుని లాగుతున్నట్టూ అనిపించింది అతనికి.

తన ఆకారం మళ్ళీ లేచింది, లేచి మంచంపట్టె పట్టుకొనికూర్చుంది. తన్నే చూస్తూ ఉంది. ఆ చూపులు అతన్ని చురచురా కాలుస్తున్నాయి. లోపల అగ్నిజ్వాలలు విజృంభించినయ్.

"మళ్ళీ కూర్చున్నావే... పడుకో.... నీకు చెయ్యలేక మా నరాలు తెగుతున్నాయి" అన్నాడు కొడుకు.

తన భార్య మనుమణ్ణి ఎత్తుకొని కొడుక్కు అందించింది. కొడుకు చేతులలోకి తీసుకొని ముద్దు పెట్టుకున్నాడు. పసివాడి చేష్టలకు తల్లి కొడుకులు పరవశులయ్యారు.

తన ఆకారం మళ్ళీ దగ్గుతూ ఉంది."చూశావా నువ్వుచ ఏసినపని నన్ను, నా భార్యకూ పిల్లలకు కాకుండా చేశావు. ఆ పసివాడిని నా కివ్వరు. ఎందుకో తెలుసా? నేను చెడగొడతాననీ, పనికిమాలిన మాటల్నీ చెప్పి చిన్నతనంలోనే వాడి మనస్సు పాడుచేస్తఆననీ, వాళ్ళ భయం... పరమ ఛండాలుడా! ఇంతచేసి ఇంకా సిగ్గుపడకుండా, కించపడకుండా బతుకుతున్నావా? ఎందుకు బతుకుతున్నావు? ఇంకా ఎవర్ని నాశనం చెయ్యటానికి? ఎవ్వరి జీవితాలను హతమార్చటానికి?" అని మంచంమీద నుంచి హఠాత్తుగా లేచి, మీదకు రివ్వున దూకింది.

అది విషం కక్కుతూ వుంది.కళ్ళు జ్యోతుల్లా మండుతున్నాయి. కళ్ళల్లోంచి కత్తులు కఠారులు వచ్చి తన్ను ముక్కలుగా చేస్తున్నాయి. తను సహాయం కోసం భార్యనీ తన కొడుకునీ ప్రార్థించాడు. వాళ్ళు తన మొర ఆలకించలేదు... తన భార్య కొడుకికి భోజనం వడ్డించి ఎదురుగా కూర్చొని కబుర్లు చెపుతూ వుంది. కొడుకు నవ్వుకుంటున్నాడు.

అతనికి కోపం వచ్చింది. తనకు సహాయం చేసేవాళ్ళు లేరు. తన్ను జాలి తలిచే వాళ్ళు లేరు, తనకు సానుభూతి చూపేవాళ్ళు కూడా లేరు. తన్ను తానే రక్షించుకుంటాడు. తానే ఎదుర్కొంటాడు. తనే పోట్లాడుతాడు. తన ఆకారాన్నుంచి తన్ను తాను రక్షించుకోలెదూ. తన ఆకారాన్ని తాను జయించలేడూ? తాను పోట్లాడలేడూ?

తన ఆకారం తనమీదకు దూకింది. ఎముకల కాళ్ళతో డొక్కల్లో తన్నుతూ వుంది. గుప్పిళ్ళు బిగపట్టి మొహంమీద గుద్దుతూ వుంది.కోరలతో పీకుతూ వుంది. విచ్చుకత్తులవంటి గోళ్ళతో వళ్ళు పీకుతూ వుంది. రక్తం కండలూ ఎముకలూ పేగులూ -

స్మశానం అంతా భీభత్సం అయింది. రాబందులు ఎగురుతున్నాయ్, నక్కలు అరుస్తున్నాయ్.

సీతారామారావు పళ్ళూ బిగించాడు. పిడికిలి బిగపట్టాడు. మిగిలివున్న శక్తినంతా

కేంద్రీకరించాడు. అమాంతంగా నిలబడ్డాడు. తన ఆకారం మీదకు ఉరికాడు. రెండు చేతులతో గొంతు పట్టుకున్నాడు. నొక్కాడు. పిసికాడు. తన శక్తి కొద్దీ పిసికాడు. తన ఆకారం నెత్తురు కక్కుతూవుంది. తన ఆకారాన్ని నామరూపాలు లేకుండా చేస్తున్నాడు. అతనికి కసి ఎక్కువయింది. అతనిలో వున్న రాక్షసత్వం ప్రకోపించింది. మెడ కోడి మెడ విరిచినట్లు విరిచాడు. ఒక సన్నని భయంకరం అయిన ఎలుగుతో కూలబడ్డాడు, తన్ను హత్య చేసుకున్నాడు.

తెల్లవారి స్మశానంలో ఎవ్వరో చచ్చిపడివున్నారని ఊరంతా ఆగుబ్బుగా చెప్పుకున్నారు. జనం తండోపతండాలుగా స్మశానం చుట్టూ పోగయ్యింది. శవం పడివున్నచోట నెత్తురు

గడ్డకట్టుకొని వుంది. శవానికి కాళ్ళులేవు, వొంటినిండా దెబ్బలే. ఒళ్ళంతా బాగా బద్దలుగా చీలివుంది. మెడ మెలితిరిగి వుంది. అయిదారుగురు బలపడి యుద్ధం చేసినట్లు స్మశానం అంతా కసాపిసా తొక్కబడి వుంది.

"ఎవరో పొడిచి చంపారు" అనుకున్నారు అంతా.

రామయ్యతాత వొచ్చి చెప్పేవరకూ ఆ శవం సీతారామారావుదని బాగా ఎరిగిన వాళ్ళు కూడా గుర్తుపట్టలేకపోయారు.

( సమాప్తం )